# విషయ సూచిక



ముఖచిత్రం : బుద్ధుడు......బీద్రీ పనితనం.

వెనుక అట్ట : లధక్‌లోని మంచు, రాళ్ళతోనిండిన ఇసుకభూమి ఎగువభాగం — ప్రపంచంలోని అత్యంత ఉన్నత ప్రదేశాలలో ఇదొకటి. ఇక్కడ శీతోష్ణపరిస్థితులు హెచ్చుస్థాయిలో ఉంటాయి.

రెండవఅట్ట. "ద్రాక్షపళ్లు పులుపుకావు."

# ముఖ్యమంత్రి లేఖ

*ప్రియమైన చదువరీ!*

**హోంగార్డ్సుకు** సంబంధించిన శాసనం మన **రాష్ట్రంలో ఇదివరకటినుంచే** వున్నప్పటికీ, మన దేశానికి బాహ్యంగా ఏర్పడిన ప్రమాదం దృష్ట్యా ఈ వ్యవస్థను **నెలకొల్పడంలో ఇప్పుడు** మనం గట్టిచర్యలు తీసుకున్నాం. హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోనూ, విజయవాడ, విశాఖపట్నం, కాకినాడ, కర్నూలు, గుంటూరు, వరంగల్‌లలోనూ స్థాపించేందుకై హోంగార్డు ప్లాటూన్లను మంజూరు చేశారు. హోంగార్డ్ దళసభ్యులకు అవసరమైన శిక్షణ ఇస్తున్నారు. విపత్కర పరిస్థితుల్లో ప్రజల ఆస్తిపాస్తులను, ప్రాణాలను కాపాడేందుకూ, శాంతి భద్రతలను పరిరక్షించేందుకూ హోంగార్డ్ దళాలవారు నిర్వహించవలసిన గురుతరమైన బాధ్యతలను గురించి, ఈ నెల (ఏప్రిల్)లో, అనేక ప్రదేశాలలో, హోంగార్డ్ దళాల ప్రారంభోత్సవం సందర్భంగా జరిగిన ప్రదర్శనలవల్ల స్పష్టంగా తెలిసివుంటుంది. విపత్కర పరిస్థితి యుద్ధం మాత్రమే కానక్కరలేదు. వరదలు, అగ్ని ప్రమాదాలు, అంటువ్యాధులు మొదలైన ప్రకృతి దుర్ఘటనలు సంభవించినప్పుడు కూడా హోంగార్డ్సు వంటి క్రమశిక్షణాబద్ధులైన, సుశిక్షితులైన దళాల వారు సమాజానికి ఎంతో సేవచేయ గలుగుతారు. అత్యావశ్యకమైన పనులకు వినియోగించబడే రెగ్యులర్ పోలీసు లేక సైనిక దళాలకు వీరు అమూల్యమైన సహాయంచేస్తారు. చైనా దురాక్రమణమూలంగా తలవనితలంపుగా సంభవించిన సత్పరిణామాలలో ఈ దళాల స్థాపనకూడా ఒకటిగా భావించవచ్చు. ఎందుచేతనంటే శత్రువును ప్రతిఘటించడానికి మనం సాగించే యుద్ధసన్నద్ధ కృషిలో భాగంగా ఇలాంటి స్వచ్ఛంద దళాలను నెలకొల్పి శిక్షణ ఇవ్వడం అత్యావశ్యకం. శిక్షణపొందినట్టి ఏదో ఒక రకమైన స్వచ్ఛంద దళాలు రాష్ట్రంలో ప్రతిప్రాంతంలోనూ — అది పట్టణమైనా, పల్లెఅయినా సిద్ధంగా అందుబాటులో వుండాలి. ప్రారంభంలో 76,600 హోంగార్డ్సును సిద్ధం చేయడానికి మనం ఉపక్రమించాం. వీరిలో 40,000 మందిని పట్టణ ప్రాంతాల నుంచి, తక్కిన వారిని గ్రామీణ ప్రాంతాలనుంచి తీసుకుంటారు. హోంగార్డ్సు సంఖ్యను క్రమేపీ పెంపొందించడం హోంగార్డ్సు బాధ్యతలకంటే కొద్దిగా భిన్నమైన బాధ్యతలు నిర్వర్తించే ఇతర స్వచ్ఛంద సంస్థలను నెలకొల్పడం ద్వారా వీరికి అదనపు బలం చేకూర్చడంకూడా జరుగుతుంది. ఇప్పటికే మన జిల్లాలలో చాలా వాటిలో గ్రామీణ వాలంటీర్ దళాలలో, సభ్యులను చేర్చుకోవడం, శిక్షణ ఇవ్వడం సంతృప్తికరంగా ముగిసింది. గ్రామీణ ప్రాంతాలలో ఉత్పత్తి కృషికి తోడ్పడేందుకు ఈ దళాలను ప్రధానంగా ఉద్దేశించారు. కేంద్రం సూచించిన ప్రకారం, పౌర వాలంటీర్ దళంవంటి ఇతర రకాల పౌరసంస్థలను నెలకొల్పే ఆలోచన కూడా వుంది. ప్రజోత్సాహాన్నీ కార్యదక్షతను నిర్మాణాత్మకమైన విధానంలో వినియోగించుకునేందుకై జరుగుతున్న ఈ బృహత్ కృషి, మనకు ఎదురయ్యే ఎట్టి సవాలునైనా గట్టిగా ఎదుర్కొనడానికై జాగరూకతలోనూ, సుశిక్షణలోనూ దేశాన్ని శక్తివంతం చేయడానికి తోడ్పడేందుకు వీలుగా సంస్థలన్నింటి కార్యకలాపాల సమన్వయం సమర్థవంతంగా జరగాలి.

**హోంగార్డ్ ప్లాటూన్లలో చేరడంలో** పురుషులు, స్త్రీలుకూడా కనబరచిన ఆసక్తి చాలా ప్రోత్సాహకరంగావుంది. పోతే రెగ్యులర్ సైనిక దళాలలో భర్తీకై ప్రస్తుతం జరుతున్న ఉద్యమాన్ని నేను మీదృష్టికితేవలసివుంది. తగుసమర్థత, యోగ్యతలు గలవారిని మనరాష్ట్రంనుంచికూడా తగినంతసంఖ్యలో సమకూర్చాలి. మన సైనికబలాన్ని రెట్టింపు చేయవలసివుందనీ, అలాగే ఇతర రక్షణదళశాఖల బలాలనుకూడా పెంపొందించవలసివుందనీ రక్షణమంత్రి గావించిన ప్రకటనను మీరు చూచేవుంటారు. ఈ కార్యక్రమ నిర్వహణకు ధనం సమకూర్చుకోడానికీ, అవసరమైన ఆయుధాలు తదితర సాధన సామగ్రిని సేకరించడానికి లేదా ఉత్పత్తి చేయడానికి చర్యలు తీసుకున్నారు. ఏ రంగంలోనైనా సరే మనుష్య శక్తికి సంబంధించినంతవరకు మనకు కొదవలేదనీ, ఎప్పుడూ కూడా ఈ శక్తిసంపదను మనం అవసరమైన దానికంటే ఎక్కువే కలిగివున్నామనీ మనం ఎల్లప్పుడూ సగర్వంగా చెప్పుకుంటున్నాం. నిజానికి భారీ ఎత్తున నిర్మాణాలు చేపట్టబడే పథకాలకు ఉదాహరణకు నాగార్జునసాగర్ ప్రాజెక్టువంటి కట్టడాలకు మనం ఎక్కువ భాగం పనిని

మనుషులతోనే నిర్వహిస్తున్నాం. కాగా ఇతర దేశాలలో ఇలాంటి పనులకు బ్రహ్మాండమైన యంత్రాలను ఉపయోగిస్తారనే విషయం గమనార్హం. అందుచేత మన రక్షణ దళాలకు కావల్సినంత బలగాన్ని సమకూర్చడం మనకో సమస్య కానేకాదు. అయితే సైన్యానికి బలం చేకూర్చడమంటే యుద్ధం చేసే మనుషులను సైన్యంలో ఇతోధికంగా చేర్చడం అని మాత్రమే అర్థం కాదు. సైనిక విభాగాలు, అన్ని హంగులతో స్వయం సంపూర్ణమై వుండాలి. పలురకాల పనులు చేయగలిగిన సిబ్బంది వాటికి అవసరం. నర్సులు, క్లర్కులు, వంటపనివారు, అంబులెన్స్ డ్రైవర్లు, స్టెనోగ్రాఫర్లు, వంటశాల సూపర్ వైజర్లు, ట్రక్కు డ్రైవర్లు, ఇంకా అనేక మంది ఇతరులు కావల్సివుంది. ఈ పనులకు వాలంటీర్లను నమోదు చేసుకోవడం జిల్లాలలో జరుగుతూ వుంది. దేశభక్తి పూరితమైన ఈ ఉద్యమంపట్ల ప్రజానీకం చాలా ఉత్సాహం ప్రదర్శించాలి.

అత్యవసర పరిస్థితితో సంబంధం లేకపోయినా రాష్ట్రంలోని యువకులను గూర్చి సాధారణంగా వినవచ్చే ఫిర్యాదుల గూర్చి నేను ప్రస్తావించదలచాను. ఇది అఖిలభారత సర్వీసుపోటీ పరీక్షలకు సంబంధించింది. ఆయేటికాయేడు సెలక్షన్లలో ఆంధ్రుల భాగం చాలా తక్కువగా ఉంటున్నట్టు మనం వింటున్నాం. ఈ సంవత్సరం కూడా ఫలితాలలో మద్రాసుకు ఎక్కువ మొత్తం దక్కగా ఆంధ్రులు ప్రత్యేకంగా యేమీ పొందలేకపోయినట్టు చెప్పబడుతున్నది. ప్రత్యేక రకానికి చెందిన యీ వెనుకబడినతనానికి సాంప్రదాయం, చరిత్ర బహుశా కారణాలు కావచ్చు. మన యువకులు ప్రయత్నించడానికి సమయం మించిపోయింది. కొన్ని రకాల పరిశోధనల విషయంలోనూ, ఇతర విద్యావిషయాలలోనూ మన విశ్వవిద్యాలయాలు ప్రత్యేకత సంపాదించాయి. అంతేకాక వివిధరంగాలలో వారు సాధించిన అభివృద్ధికి విదేశాల మన్ననలు అందుకున్నారు. ముఖ్యమైన పరిపాలనా సర్వీసులలో ఎక్కువ సంఖ్యలో రిక్రూటుఅయి తద్వారా తమ ఆధిక్యతను నిలుపుకోవడమే మన యువకుల ధ్యేయంగా ఉండాలి.

ప్రజలకు ప్రాథమిక సౌకర్యాలు కలిగించడానికి సంబంధించిన సమస్యలు ఎల్లప్పుడూ మనముందు ఉంటాయి. ఈ సమస్యలను పరిష్కరించడానికి అవసరమైన చర్యలను తీసుకోవాలని మనం ఆత్రత చెందుతూ ఉంటాం. ఇక సమస్యలే లేవని చెప్పడం ఎప్పుడు సాధ్యమవుతుంది? మనకు సాధ్యమైంది మనం చేస్తూ పోతుంటాం. ఉదాహరణకు నీటినే తీసుకోండి. త్రాగడానికి నీరు కావాలి. సాగుకై నీటిపారుదలకు నీరు కావాలి. కేవలం త్రాగేనీటి సమస్య కూడా గ్రామాలకు మాత్రమే పరిమితమైలేదు. పెద్దనగరాలకూ, రాష్ట్రాలకు కూడా ఇది ఒకప్పుడు సమస్యగా పరిణమించవచ్చు. హైద్రాబాదు నగరంలోని కొన్ని భాగాలలో ఇదొక పెద్ద సమస్యే. ఇక్కడి మంచినీటి సరఫరా పద్ధతిని ప్రథమంలో చిన్న జనాభా కోసమై ఉద్దేశించారు. 12 లక్షలకు మించి జనాభాగల నగరంలో ప్రత్యేకించి వేసవి కాలంలో నీటి ఎద్దడితో సతమతమవుతున్న అనేక ప్రాంతాలను మనం ఇప్పుడు చూస్తున్నాం. మంజీరా పథకం అమలు జరపడం ద్వారా నీటి సరఫరాను అధికం చేయడానికి ఒక ముఖ్యమైన చర్యను తీసుకోవడం జరుగుతున్నది. ఈ పథకం ఫలితాలను నగర ప్రజలు ఒక సంవత్సరంలో అనుభవించ గలుగుతారు.

దీనికి తోడు మన ఇతర పట్టణాలకూ, గ్రామాలకూ చెందిన మంచినీటి సరఫరా సమస్యను కూడా పరిష్కరించే బాధ్యత మనపై వున్నది. ఈ విషయంలో నగరాలలో కన్నా ఎక్కువగా యీ ప్రాంతాలలో బాధగా ఉన్నది. ఈ సమస్యను పరిష్కరించడానికై ప్రతి సంవత్సరం ఎక్కువ మొత్తాలను కేటాయించడం జరుగుతున్నది. సాధ్యమైనంత త్వరలో పరిస్థితిని అభివృద్ధి పరచడానికై వివిధ పథకాలు అమలు చేయబడుతున్నవి. కనీసం మూడవ ప్రణాళిక ఆఖరుకైనా అవసరమైన అనేక గ్రామాలకు మంచినీటి సరఫరా సౌకర్యం కలగజేయ బడుతుందని ఆశిస్తున్నాం. దీనికై రు. 9 కోట్లు కేటాయించడం జరిగింది. ఇదే విధంగా వ్యవసాయ కార్యకలాపాలకై బావులపై ఆధారపడే మన బీదరైతులు కూడా ప్రభుత్వంనుంచి ఇతోధిక సహాయం పొందాల్సి ఉంది. బావుల సబ్సిడీ పథకం క్రింద అవసరమైన ప్రతి రైతుకు కనీసం ఒక బావిని ఏర్పాటు చేయాలని మనం కోరుతున్నాం. దీనికి సంబంధించిన కేటాయింపులను కూడా ఎక్కువ చేయడం జరిగింది. ప్రతి బావికి రు. 750/- ల చొప్పున సబ్సిడీ ఇవ్వడమే కాక బహుశా రు. 1500/- ల రుణాన్ని కూడా మనం ఇవ్వవచ్చు. దీనివల్ల రైతుల కొన్ని తక్షణ సమస్యలు తీరవచ్చు. అధ్యతనభావిలో యీ విషయమై ఒక విస్పష్టమైన ప్రకటన వెలువడవచ్చునని నేను ఆశిస్తున్నాను. జైహింద్!

భవదీయుడు

నీలం సంజీవరెడ్డి

# ధమ్మ పథము

—వి. వి. యల్. నరసింహారావు

ధరణి ధరశీర్ష మెక్కిన ధైర్యశాలి
అవనిపై నున్న బాలకు నరసినట్లు
జ్ఞానసౌధ మధిష్ఠించు సద్వివేకి
శోక భూయిష్ఠలోకమ్ముఁ జూచుచుండు.

వగలవలఱేని వలనుండి బయలువడఁగ
బడుగుటెడఁదలు పరితాప పడుచునుండు
జలము వెలువడి గట్టుపై నిలిచినపుడు
గిలగిలం గొట్టుకొనెడి చేపల విధాన.

నిగనిగలు నిక్కు నీటును సొగసుఁ గలిగి
తావి లేకున్న పూవు వ్యర్థమ్ము గాదె!
మాటలవి మేలిమి పసిండి మూటలైనఁ
జేతలవి చెడ్డవైనచోఁ జేటు మూడు.

గాలి కెదురీదఁ జాలదు పూల తావి
కాని సుజనుల కీర్తి సుగంధ మేచి
ప్రళయ ఝంఝానిలమ్ములఁ బాఱఁదోలి
ఇంద్రియాతీత సుఖముల నిట్టె చూపు.

ఎంత సుడిగాలి కేని చలింపకుండు
భూరి భూమీధరమ్మట్లు బుద్ధిశాలి
లోక నిందాస్తుతుల్ చెవిసోక నీక
నిశ్చలంబైన యాత్మతో నెగడుచుండు.

నగర మగును గాక, నడిసంద్రమగుఁగాక
స్థలము జలము నొక్క చాయ నరయు
ముక్త సంగుడైన పురుషుఁడెచ్చట నుండు
నదియె స్వర్గ మంచు నరయుమోయి.

# విశేషాలు - వ్యాఖ్యలు

పి.వి. నరసింహారావు

## ఇంగ్లీషు - హిందీ

1965 అనంతరం కూడా అనిశ్చితంగా మరి కొంత కాలంపాటు ఇంగ్లీషును సహ అధికార భాషగా వాడడానికి అనుమతించేందుకు ఉద్దేశించిన బిల్లును ఏప్రిల్ 13వ తేదీన లోకసభలో ప్రవేశపెట్టారు. మన పార్లమెంటు చరిత్రలో, మున్నెన్నడూ లేని ఉద్రిక్త సంఘటనలు ఆనాడు జరిగాయి. ముగ్గురు సభ్యులను సభనుంచి బహిష్కరించడం వారిలో ఇద్దరిని బలవంతంగా, సభ నుంచి బయటికి ఎత్తుకొని వెళ్లడం జరిగింది.

అధికార భాష విషయంలో దక్షిణాత్యులకు గల భయసందేహాలను ఉపశమింప జేసేందుకై ప్రధానమంత్రి ఇచ్చిన హామీల ననుసరించి ఈ బిల్లును రూపొందించారు. ఒక్క హిందీని మాత్రమే భారత అధికారభాషగా వాడటానికి ఇంకా కాలపరిపక్వం కాలేదని భావించడం జరిగింది. కాబట్టి రాజ్యాంగం అమల్లోనికి వచ్చినప్పటి నుంచి 15సంవత్సరాలవరకు మాత్రమే ఇంగ్లీషును అధికారభాషగా వాడడానికిగాను లోగడ నిర్ణయించిన గడువు తరవాతకూడా అధికార భాషగా ఇంగ్లీషు వాడకాన్ని కొనసాగించాలని ప్రభుత్వం నిశ్చయించింది.

అధికార భాషగా ఇంగ్లీషు వాడకం కొనసాగినప్పటికీ హిందీ భాషకు న్యాయ సమ్మతంగా లభించవలసిన ప్రతిపత్తి కేమీ భంగంకలుగకుండా చూస్తారు. నిజానికి, దేశవ్యవహారాలమంత్రి పేర్కొన్నట్లు ఈ బిల్లు, హిందీ భాషకు మొదటిసారిగా ఇంగ్లీషుకంటే ఉన్నతస్థానం కలిగించింది.

యూనియన్ ప్రభుత్వ వ్యవహారాలకు హిందీ వాడకంలో జరిగిన అభివృద్ధిని 30 మంది పార్లమెంటు సభ్యులతో కూడినకమిటీ సమీక్షించి, రాష్ట్రపతికి నివేదిక దాఖలుచేయడాన్ని ఈ బిల్లు ఉద్దేశిస్తున్నది. పార్లమెంటు సభ్యులు సమర్పించే నివేదికలోని అన్ని అంశాల ననుసరించి కానీ లేదా కొన్నిటి ననుసరించి కానీ రాష్ట్రపతి ఉత్తర్వులు చేస్తారు.

ఆర్డినెన్సులు, చట్టాలు మొదలైనవాటి అధికారిక హిందీ అనువాదాల ప్రచురణనూ, హైకోర్టు ఉత్తర్వులు, డిక్రీలు, తీర్పుల నిమిత్తమై రాష్ట్రపతి అనుమతితో హిందీ తదితర రాష్ట్ర అధికార భాషలను ఐచ్ఛికంగా వినియోగించడాన్ని కూడా ఈ బిల్లు ఉద్దేశిస్తున్నది.

అధికార భాషగా హిందీని ప్రవేశపెట్టదలిచిన కొన్ని వర్గాలవారి, మనోభావాలు ఎలా వున్నప్పటికీ ప్రజాస్వామిక దేశంలో ఈ లక్ష్యాన్ని కానీ మరేదైనా లక్ష్యాన్ని కానీ సాధించడానికి అనుసరించాల్సిన మార్గం సక్రమ విధానంలో వాదించడం తమ వాదాన్ని సమ్మతింపజేయడానికి ప్రయత్నించడమే కాని కల్లోల పరిస్థితులను సృష్టించడం మాత్రం కాదు. హిందీ వాదులు ఒక్కొక్కసారి ఈ ప్రాథమిక సూత్రాన్ని ఎంచేత విస్మరిస్తుంటారో బోధపడదు.

దేశవ్యాప్తంగా అధికార భాషగా వాడకానికై గత పదిహేను సంవత్సరాల కాలంలో హిందీ అభివృద్ధికి తగినంతగా కృషి జరగలేదనే విషయాన్ని అంగీకరించక తప్పదు. దీనిని నేరుగా ప్రాథమిక పాఠశాల పాఠ్య ప్రణాళికలో ప్రవేశపెట్టినంత మాత్రానే సరిపోదు. అట్లా చేయడంవల్ల హిందీ భాషను బలవంతంగా ప్రవేశ పెట్టినట్లు కూడా అనిపిస్తుంది. అందుచేతనే "హిందీ ఇంపీరియలిజం" అనే మాట వాడుకలోకివచ్చి, హిందీ భాష బలవంతంగా రుద్దబడుతుందనే భావంతో ఆ భాష పట్ల వైముఖ్యం, ఆ భాషను నిరోధించాలనే పట్టుదల దక్షిణాదిన కొన్ని ప్రాంతాలలో ఏర్పడడానికి దారితీసింది.

ఇక గత్యంతరం ఒక్కటే. ఇది జటిలమైంది. హిందీ అనుసరణపట్ల దేశ ప్రజ

లందరినీ సుముఖులను చేయడమే ఇప్పుడు జరుగవలసింది. హిందీయేతర ప్రాంతాల ప్రజలే హిందీ అభివృద్ధికి కృషిచేసే పరిస్థితులను నెలకొల్పినప్పుడు ఇది సుసాధ్యమవుతుంది. తమ తమ పద్ధతుల ననుసరించి హిందీ అభివృద్ధికి దోహదం చేయడానికి దేశంలోని అన్ని రాష్ట్రాల ప్రజలకు అవకాశాలు కల్పించాలి. ఇలా జరిగినప్పుడు కట్టకడపటికి అధికార భాషగా రూపొందే హిందీ భాషపై దేశంలోని ఇతర ప్రధాన జాతీయ భాషలన్నింటి ప్రభావం పడుతుంది. ఈ నాడు హిందీ ప్రాంతాలలో వాడుకలో వున్న సనాతన హిందీ భాషకు ఇది చాలా భిన్నంగా వుంటుంది. ప్రతి రాష్ట్రంలోనూ వెంటనే హిందీ భాషలో సాహిత్య కృషి ఆరంభం కావాలి. హిందీ నుంచి ఇతర భాషల లోకీ, ఇతర భాషల నుంచి హిందీ లోకీ భారీ ఎత్తున అనువాదాలూ, అనుసరణలు జరపడం ద్వారా ఇచ్చి పుచ్చుకునే విధానాన్ని అవలంబించాలి. హిందీయేతర ప్రాంతాల లోని హిందీ పండితులు, విద్యార్థులు హిందీలో స్వతంత్ర రచనలు చేయడాన్ని ప్రోత్సహించాలి. మొత్తం దేశవ్యాప్తంగా ప్రజలలో హిందీపట్ల ఆదరాభిమానాలు ఏర్పడడానికి చేతనైనదంతా చేయాలి.

ఒకప్పుడు జాతీయైక్యతకు చిహ్నమైన హిందీభాష స్వతంత్ర భారతదేశంలో విభేదాలకు కారకమయిందంటే అందువల్ల ఎవరికీ ఘనతరాదు. అయితే ఈ పరిస్థితి తాత్కాలికమైనదే. అధికార భాషావ్యవహారాన్ని నైపుణ్యంతో నిర్వహించక పోవడంవల్లా, అతివాద ధోరణివల్లనే ఈ పరిస్థితి ఏర్పడింది. దేశంలో అన్ని ప్రాంతాలలోనూ అధికారభాష అభివృద్ధి కోసం దీక్షతో కూడిన 'కృషి' ఎంత సత్వరంగా జరుగగలదో దానినిబట్టే జాతీయ అధికారభాష అంత వేగిరంగా అభివృద్ధి జెందగలుగుతుంది.

## లావోస్‌లో తిరిగి పోరాటం

లావోస్ విదేశాంగమంత్రి శ్రీ క్వినిం ఫొల్సెనాను అతని రక్షకభటులలో ఒకడు హత్య చేయడంతో, జార్స్ మైదానంలో తటస్థవర్గం, పాథట్ లావో వర్గాలమధ్య తిరిగి పోరాటం ప్రజ్వరిల్లింది. పోరాటాన్ని నిలుపు చేయించవలసిందిగా లావోస్ అంతర్జాతీయ కంట్రోలు కమీషన్ను లావోస్ ప్రభుత్వం అభ్యర్థించింది.

శ్రీ ఫొల్సెనా హత్యతో విదేశాలవారికి సంబంధం వున్నట్లు లావోస్ మంత్రి మండలి సభ్యులుకొందరు ఆరోపించారు.

ఇటీవల లావోస్ రాజు మన దేశానికి వచ్చినప్పుడు శ్రీ ఫొల్సెనాకూడా ఆయన వెంట వచ్చారు.

లావోస్‌లో తిరిగి పోరాటం ప్రజ్వరిల్లడంలో కమ్యూనిస్టు చైనా జోక్యం వున్నట్లు అనుమానించ బడుతున్నది. లావోస్ పట్టణాన్నొకదానిని చైనీయులు ఆక్రమించుకున్నట్లు కూడా వార్తలు వచ్చాయి. కమ్యూనిస్టు చైనా ఆగ్నేయాసియాలో ఈ విధంగా పోరాటాన్ని ప్రోత్సహించడం; ఆసియాలో శాంతిని వాంఛిస్తున్న రష్యావిధానానికి వ్యతిరేకమైన తన సిద్ధాంతాన్ని బలపరచుకోవడానికి ఉద్యమంగా సాగిస్తున్న ప్రయత్నాలలో భాగమైనట్లు భావించబడుతున్నది. సహజీవనం తటస్థ విధానాలపట్ల చైనాకుగల వైముఖ్యం కూడా దీనికి కారణమే. కమ్యూనిజం, కాపిటలిజంల మధ్య యుద్ధం తప్పనిసరి అని కమ్యూనిస్టు చైనామాత్రం ఇంకా విశ్వసిస్తూనే వుంది. అమెరికా, రష్యా దేశాలను రెంటినీ బలహీనపరిచే బహుశా వాటిని పూర్తిగా నాశనం చేసే - ఎట్టి సంఘటనైనా చైనాకు ప్రయోజనకారి అవుతుంది కాబట్టి ఈ విశ్వాసం చైనా జాతీయ ఆశయాలకు బాగా సరిపోతుంది. ఈ విధంగా చైనా శాంతి, సహజీవన విధానాలను వమ్ము చేయడానికీ, అగ్రరాజ్యాల మధ్య తీవ్ర సంఘర్షణలను ప్రజ్వరిల్ల జేయడానికి గట్టిగా పూనుకున్నది. ఈ కారణాలనుబట్టి చైనా భారత దేశంపై దురాక్రమణ జరపడంలోగల దురుద్దేశం సుస్పష్టమవుతున్నది.

## జాతివిచక్షణ ధోరణి

"ఒక జాతి ప్రజలను ఆస్తిపాస్తులు లేకుండా చేసి రూపుమాపడానికి గ్రూప్ ఏరియాల చట్టం ఆయుధంగా ప్రయోగించబడింది.'' తమ వర్ణ విచక్షణా విధానాన్ని కొనసాగించడానికై దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఇటీవల అవలంబించిన అమానుష చర్యల తీవ్రతను గురించి ట్రాన్స్‌వాల్ భారతీయ కాంగ్రెసు చెప్పిన మాటలు ఇవి.

వివిధ జాతులవారు విడివిడిగా ఆయా జాతులకోసం నిర్దేశించబడిన

స్థావరాలలోనే నివసించాలని గ్రూప్ ఏరియాల చట్టం నిర్బంధిస్తున్నది. దీని మూలంగా దక్షిణాఫ్రికా అంతటా జనాభా భారీ ఎత్తున ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి తరలి వెళ్లవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఈ చట్టంవల్ల వేలకొలది భారతీయ కుటుంబాలు అభివృద్ధిలో నున్న తమ వర్తక వ్యాపారాలను బలవంతంగా వదిలిపెట్ట వలసి వస్తున్నది. కూలి నాలి వంటి తక్కువ రకం పనులు మినహా ఇతర పనులను వేటినీ వారు పొందలేకుండా వున్నారు. ప్రిటోరియాలోని 20 మంది భారతీయులు తమకు నోటీసులు అందజేయబడినప్పుడు ఆ విధానాన్ని ఆమోదించడంకంటే జైలులో మ్రగ్గటమే మంచిదని ఎంచి తమ ప్రాంతాలను విడిచి వెళ్ళడానికి నిరాకరించారు.

ఆఫ్రికాలో జాతివిచక్షణా విధానం నిరంతరం దౌర్జన్యానికి, కల్లోల పరిస్థితికి హేతువవుతున్నది. దక్షిణాఫ్రికాలోని శ్వేత జాతీయులు, తమ విధానాల దుష్పరిణామాలను లక్ష్యపెట్టకుండా మూర్ఖంగా ప్రవర్తించడంవల్ల యీ ఖండంలోనే గాక ప్రపంచమంతటిలోనూ వివిధ జాతులమధ్య సంబంధ సామరస్యాలకు తీవ్ర విఘాతం వాటిల్లుతుంది. మానవ నాగరికతకు ఏర్పడిన ఈ తీవ్రమైన ముప్పుదృష్ట్యా, నీతి, న్యాయం, అభివృద్ధి అభిలషించే వారంతా తిరోగమనమైన, అమానుషమైన ఈ విధానానికి వ్యతిరేకంగా ఏదైనా సమైక్యచర్య తీసుకునే విషయంలో ఆలోచించవలసిన సమయం ఆసన్నమైంది. ప్రపంచ వ్యవహారాలలో ప్రముఖస్థానంగల ఇతర శ్వేత జాతీయుల సంపూర్ణ సహకారంలేకపోవడంవల్లనే బహుశా ఈ సమస్య ఎంతోకాలంగా అపరిష్కృతంగా వుంది. శ్వేత జాతీయులు, రంగు జాతులవారికి సంబంధించిన సమస్యగా మాత్రమే దీనిని భావించరాదు. కాగా అసలు సమస్య పురోగమన తిరోగమన శక్తులకూ; న్యాయానికీ, అన్యాయానికీ మధ్యనే వుంది.

## కార్య సాఫల్యత

యు. యన్. పతాకం క్రింద భారత సైనికులు కాంగోలో రెండు సంవత్సరాలు అమోఘ సేవచేసి దళలవారీగా భారత దేశానికి తిరిగి వస్తున్నారు. కాంగోలో ఉన్న కాలంలో కటాంగాలో యు. యన్. సిబ్బంది సభ్యులకు రాకపోకల స్వాతంత్ర్యం కల్గింపజేయడంలో పాల్గొన్నవారిలో వీరు ప్రధానపాత్ర వహించారు. కొన్నివేల కటాంగా సైనికులను నిరాయుధులను చేయడం, మెర్సినరీలను పూర్తిగా తీసివేయడం ద్వారా మిగతా కాంగోతో కటాంగాను త్వరితగతిని సమీకృతం చేయడంలో కూడా భారత సైనికులు తోడ్పడ్డారు. దీనికితోడు వీరు నెలకొల్పిన సైనిక ఆసుపత్రిలో చాలామంది పౌరులకు కూడా చికిత్స చేశారు. అక్కడ వున్నంతకాలమూ వారినడత ఎంతో ప్రశంసనీయంగానూ, ఇతరులకు ఆదర్శప్రాయంగానూ ఉన్నది. వారి నడత విదేశపరిశీలకుల, కాంగో ప్రజల మన్ననల బడసింది. శాంతిస్థాపనార్థం విదేశాలలో భారత సైనికులు తాము చేసిన నిస్వార్థసేవాచరిత్రలో మరో గణనీయమైన అధ్యాయాన్ని రచించారు.

## రవాణా విమానాలు

అన్నిరకాలైన ఉత్పత్తులలోనూ స్వయం సమృద్ధి సాధించడమే మనధ్యేయం. అయితే విమానాలవంటి కొన్ని అతి ముఖ్యమైన పరికరాల విషయంలో మన లక్ష్యాలను చేరుకోవడం జరగలేదు. అయినా యీ లక్ష్యసాధనకై నిరంతర పురోగమనం కొనసాగుతుంది. కాన్పూరులోని విమానాల నిర్మాణం డిపో ఇటీవల తయారుచేసిన రెండవ అవ్రో–748 విమానం, అన్ని పరీక్షలకు విజయవంతంగా నిలవడమే దీనికి సూచీగా ఉంటుంది. యీ డిపో తయారుచేసే విమానాలలో మొదటిదయిన యీ టర్బో–ప్రోప్ విమానంలో 40 మంది కూర్చునే సౌకర్యం ఉండి 10,000 పౌండ్లకు మించి పే–లోడ్ శక్తిగలిగి ఉంటుంది. దీనిపేరు 'జంబో' అని పెట్టారు. 1963 సం॥ లో యీ డిపోలో ప్రతిమూడు మాసాలకు ఒక విమానాన్ని తయారు చేస్తారు. వచ్చే సంవత్సరం నుంచి యీ శక్తిని అధికంచేయడం జరుగుతుంది.

బ్రిటన్, మధ్య ప్రాచ్యం, దక్షిణ అమెరికాలోని "సుబ్రోటో," మొదటి అవ్రో–748 విమానం ద్వారా గడించిన అనుభవాల ఫలితంగా జరిగిన

ఎంతో అభివృద్ధినీ, ఎన్నో సవరణలను యీ విమానంలో కూర్చడం జరిగింది.

## కేంద్ర నేరపరిశోధక కేంద్రం

దేశంలో అవినీతి, నేరాలను అంత మొందింప జేయడానికై కేంద్ర నేరపరిశోధక కేంద్రాన్ని నెలకొల్పడం ద్వారా క్రొత్త చర్యలను తీసుకోవడం ప్రారంభించారు. ఇందులో ఆరు డివిజనులు ఉంటాయి: పరిశోధన, అవినీతినిరోధం; సాంకేతిక క్రైం రికార్డులు, గణాంకాలు; రీసర్చి; చట్టాలు; పరిపాలన; జనరల్. అంతరాష్ట్రీయ నేర పరిశోధనలను జరిపే సమయంలో రాష్ట్ర పోలీసుదళాల విజ్ఞప్తిపై యీ సి. బి. ఐ. సహాయపడుతుంది. కేంద్ర ప్రభుత్వోద్యోగులు వారు స్వయంగాకానీ, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులసహాయంతో కానీ, ఇతర వ్యక్తులసహాయంతో కానీ,కలిసిచేసిననేరాల కేసులను పరిశోధనా డివిజన్ చేపట్టుతుంది. కేంద్రప్రభుత్వం వ్యవహారాలకు చెందిన కేసులనూ, ప్రభుత్వరంగంలోని ప్రాజెక్టులు, కేంద్ర ప్రభుత్వం అధ్వర్యంలోని ఇతర సంస్థలకు సంబంధించిన కేసులనూసి.బి.ఐ.చేపట్టుతుంది. భారత రక్షణ నిబంధనలు, అధికార రహస్యాలచట్టం, వీసా మోసాలు, విదేశ మారకద్రవ్యం రెగ్యులేషన్స్, ఎగుమతి, దిగుమతుల కంట్రోలు ఉత్తర్వులకు సంబంధించిన కేంద్ర చట్టాలను ఉల్లంఘించిన కేసులను కూడా ఇది నిర్వహిస్తుంది.

రైల్వేలు, పోస్టల్ అక్కౌంట్లు, ఆదాయం పన్ను ఎస్టేట్ డ్యూటీలకుచెందిన కేసులను సాంకేతిక డివిజన్ నిర్వహిస్తుంది. అఖిల భారత నేరాల గణాంకం, నేరాల పరిస్థిని గూర్చి పరిశీలన, వాటి నివారణచర్యలు, తత్సంబంధమైన ఇతర విషయాలను నేరాల రికార్డులు, గణాంకడివిజన్ నిర్వహిస్తుంది. ప్రత్యేక నేరాల పరిశోధన, పోలీసుల సాధారణ సమస్యలను గూర్చిన పరిశీలనలను పరిశోధనా డివిజన్ నిర్వహిస్తుంది. నేరాల పరిశోధన, అవినీతి నిరోధక డివిజన్ చేపట్టే కేసుల విషయంలో లీగల్ డివిజన్ న్యాయసంబంధమైన సలహాలను ఇస్తుంది.

దొంగనిల్వలు, బ్లాక్ మార్కెటింగ్, జీవితావసర వస్తువులపై అధికలాభార్జనకు సంబంధించిన కేసులను ఢిల్లీ స్పెషల్ పోలీసులనుంచి సి. బి. ఐ. తీసుకోవచ్చు.

## సైనిక సన్నాహం

చైనీయుల దురాక్రమణ బెదిరింపును తట్టుకోవడానికి దేశభద్రతను పటిష్ఠంచేయడానికి అనేక చర్యలను తీసుకోవడం జరుగుతున్నది. సైనిక బలాన్ని పెంపొందిస్తున్నారు. సైనిక పరికరాలను ఆధునీకరించడమేకాక మేలు రకం ఆయుధాలను ఉత్పత్తిచేయడం జరుగుతున్నది. డెహ్రాడూన్‌లోని మిలిటరీ అకాడమిని విస్తరింప జేయడమే కాక మద్రాసు, పూనాలలో రెండు ఆఫీసర్ల శిక్షణ పాఠశాలలను ప్రారంభించారు.

సాయుధ దళాలుగా సమాయత్తం చేయడానికివీలుగా ప్రాంతీయసైన్యం, లోకసహాయసేన,యన్.సి.సి.సభ్యులకు తీవ్రతరశిక్షణ ఇవ్వబడుతున్నది. జాతీయ వాలంటీర్ రైఫిల్ అనిపిలువబడే వాలంటీర్ దళాలను కూడా త్వరలో ప్రారంభిస్తారు. సైన్యంలోని వైద్య విభాగంలోకి ఇతోధికంగా సభ్యులనుచేర్చుకోవడంద్వారాపటిష్ఠం చేస్తున్నారు. సైనికదళాల అవసరాలను తీర్చడానికి వీలుగా ఆయుధోత్పత్తి కర్మాగారాలు అహోరాత్రాలు పనిచేస్తున్నాయి. వైమానికదళాల అవసరాలను తీర్చడానికై హిందుస్తాన్‌విమానాలకంపెనీ భారత ఎలక్ట్రానిక్ కంపెనీలు కూడా శరవేగంతో పనిచేస్తున్నాయి. కలకత్తాలోని గార్డెన్‌రీసర్చి వర్క్‌షాపు నౌకానిర్మాణంలో నిమగ్నమైంది. మెజ్గాన్‌డాక్‌ను అభివృద్ధి చేస్తున్నారు.

స్వీడిష్, బ్రిటిష్ సహకారంతో మెజ్గాన్‌డాక్‌లో యుద్ధనావలను నిర్మించడం జరుగుతుంది. భారత దేశంలో యం. ఐ. జి. విమానాలనూ, వాటికి సంబంధించిన ఆయుధాలను నిర్మించడంలో సహాయపడడానికి రష్యా అంగీకరించింది. భారత వైమానికదళాన్ని విస్తరింపజేయడంలో అమెరికా, కామన్వెల్తు దేశాలు సహాయంచేస్తాయని ఆశించబడుతున్నది. యీ సంవత్సరాంతానికి ఐదు పర్వతశ్రేణి సైనిక డివిజనులు తయారవుతాయి.

## దృక్పథాలలో విభేదం

కమ్యూనిస్టు చైనా, సోవియట్ యూనియన్‌ల మధ్యగల సిద్ధాంతాల విభేదాలు కొనసాగుతూనే ఉన్నాయి. దీనివల్ల ప్రపంచశాంతికి విఘాతం కలిగే ప్రమాదం ఉంది. ఇటీవల చైనా వార్తాపత్రికలలో చైనా నాయకులు రచనల ద్వారానూ, ఉపన్యాసాల ద్వారానూ యీ విభేదాలను బహిరంగ పర్చారు. ప్రత్యే

కంగా క్యూబా విషయంలోనూ భారత దేశంపై చైనా దురాక్రమణను సమర్థించక పోవడంలోనూ రష్యా చర్యను చైనా గ్రహించలేక పోయింది. అంతేగాక పరిమిత భాష లోనే అయినా యీ దురాక్రమణను రష్యా ఖండించింది. యీ సమస్యపై మొత్తం కమ్యూనిస్టు కూటమి రెండు వర్గాలుగా చీలిపోయింది. మెజారిటీ కమ్యూనిష్టు రాజ్యాలు రష్యాను సమర్థించాయి. అల్బేనియా, ఉత్తర వియత్నాంవంటి కొన్ని దేశాలు చైనాను బలపర్చాయి.

నిజమైన మార్క్సిస్టు విధానాలకు ఎవరు ప్రతినిధులు అనే విషయంపై రష్యా, చైనాల మధ్య ప్రధానమైన విభేదం తలఎత్తిందని చెప్పబడుతున్నది. మార్క్సిజం—లెనినిజం ప్రాతిపదికపై చైనా విధానాలు రూపొందించ బడ్డాయని చైనా వాదిస్తున్నది. అయితే యుద్ధోన్మాదం, యుద్ధకాంక్ష అవలంబించడంకన్నా శాంతి, సహజీవనం, బడుగుదేశాలకు సహాయపడడమే వాస్తవమైన మార్క్సిజం సూత్రాలనీ, యుద్ధం అనివార్యమనే చైనాభావం తప్పని రష్యా అంటున్నది. ఈ విభేదాత్మకమైన దృక్పథాలను నివారించ డానికై ఇటీవలజరిగిన ప్రయత్నాలు కూడా విఫలమయ్యాయి. చర్చలకై పెకింగ్ రావల్సిందిగా ఆహ్వానించిన చైనా ఆహ్వానాన్ని శ్రీ కృశ్చేవ్ మర్యాదగానే తిరస్కరించారు. దీనికిమారుగా మాస్కో విచ్చేయవలసిందిగా శ్రీ కృశ్చేవ్, శ్రీ మావ్‌సేతుంగును ఆహ్వానించారు. ప్రపంచాభిప్రాయాన్ని చైనా మూర్ఖత్వంతో పెడచెవిని పెడుతున్న కారణంగా ఉభయులమధ్య సమన్వయం చేకూరే అవకాశాలు తక్కువగా ఉన్నాయని ఇటాలియన్ వామపక్షనాయకుడు శ్రీ నెన్ని అభిప్రాయపడినారు.

## వ్యవసాయోత్పత్తి

వ్యవసాయరంగంలో ప్రణాళికా లక్ష్యాలను సాధించడంలో వైఫల్యం పొందిన విషయంపై ప్రణాళికామంత్రీ, వ్యవసాయమంత్రీ ప్రకటించిన విరుద్ధాభిప్రాయాల ఉదంతం గతనెలలో జరిగిన ఎ. ఐ. సి. సి. సమావేశ విశేషాలలో పేర్కొనదగింది. వ్యవసాయం, పారిశ్రామిక ఉత్పత్తుల విషయాన్ని ప్రస్తావిస్తూ వాతావరణ పరిస్థితులను లెక్కలోకి తీసుకున్నా వ్యవసాయోత్పత్తులలో గత శతాబ్దంకన్నా ఎక్కువ అభివృద్ధి యేమీ జరగలేదని ప్రణాళికామంత్రి అన్నారు.

వివిధ మంత్రిత్వశాఖలమధ్య సమన్వయం కుదరడంలేదని ఫిర్యాదుచేస్తూ వ్యవసాయానికి అతి ముఖ్యమైన నీటిపారుదల, సహకారం, సమాజాభివృద్ధి శాఖలపై తమ శాఖకు ఆధిపత్యంలేదని వ్యవసాయమంత్రి అన్నారు. ప్రణాళికా సంఘం "అవాస్తవికమైన" లక్ష్యాలను నిర్ణయించిందని వ్యవసాయ శాఖా స్టేట్ మంత్రి అన్నారు.

యీ విభిన్నాభిప్రాయాలను "వివాదం"గా తీసుకోకూడదు. ఒకరిపై ఒకరు అపవాదులను వేయడం సునాయాసమే అయినా దానివల్ల సత్ఫలితాలు కలుగవనే సత్యాన్ని తెలుసుకోవచ్చు. యీ విషయంతో ఆసక్తి కలిగించే సంగతి ఒకటి తెలుస్తుంది. ప్రతిఒక్క అంశంలోను చెప్పుకోదగిన అభివృద్ధిజరిగి అదనపు ఉత్పత్తిలో సహాయకారి అయినా మొత్తంమీద యెకరా సగటు ఉత్పత్తిని అధికంగా సాధించినట్టు కనిపించదు.

ఇది ఆశ్చర్యకరమైన, హేతువిరుద్ధమైన విషయంగా చెప్పవచ్చు. నీటిపారుదల సౌకర్యాలు అధికమైనాయి, పెద్దమొత్తంలో మేలురకం విత్తనాలను ఉత్పత్తి చేస్తున్నారు. ఎరువుల ఉత్పత్తికూడా అధికంగా జరుగుతున్నది. భారీయెత్తున ఆధునిక వ్యవసాయ విధానాలను అవలంబిస్తున్నారు. భూసార సంరక్షణచర్యలను శరవేగంగా అమలు జరుపుతున్నారు. రైతులకు పరపతి సౌకర్యాలను ఇతోధికంగా కల్పిస్తున్నారు. ఇన్ని జరిగినా వ్యవసాయోత్పత్తులలో సగటు ఎకరా ఉత్పత్తి పెరగకపోవడానికి ఒకే కారణం ఉండవచ్చు. పైన తెల్పిన అన్ని అంశాలను ప్రణాళికాబద్ధంగా ఒక్కుమ్మడిగా అమలు చేయకపోవడమే దీనికి సమాధానం. మరోవిధంగా చెప్పాలంటే నీటిపారుదల, మేలురకం విత్తనాలు, ఎరువులు, ఆధునిక వ్యవసాయ పద్ధతి, క్రిమిసంహారం, సకాలంలో పెట్టుబడి మొదలైన వాటిని ఒకే *భూఖండంలో* వాడితే సాధారణంగా అధికోత్పత్తి ఫలితాలు కలుగుతాయి. వీటిని వివిధ భూఖండాలకు వినియోగించితే ఏ భూఖండంలోనైనా అధికోత్పత్తి జరుగుతుందనే నమ్మకం ఉండదు. రసాయనిక ఎరువులు కావాలని రైతు బి. డి. ఒ. వద్దకు వచ్చినప్పుడు ఆ రైతు తన క్షేత్రానికిఅనువైనవిధంగా గట్లువేయడం మేలురకం విత్తనాలను ఎన్నుకొనడం, చీడ పురుగు, తెగులునివారణకు ఆయత్తమయ్యే వివరాలనుగూర్చి బి. డి. ఒ. తెలుసుకోకుండా ఉండడం సర్వసాధారణమైన అనుభవం. తత్ఫలితంగా ఆ ఎరువులను వాడిన తర్వాత భారీవర్షాలకు అవి కొట్టుకపోవడమో, లోపసహితమైన విత్తనాలుకారణంగా ఎరువు ఎక్కువ ఉపయోగకారి కాకపోవడమో, పైర్లకు తెగులును రైతు సకాలంలో నివారించకపోవడమో సంభవించవచ్చు.

అధికవ్యవసాయోత్పత్తి ఆరు అంశాలపై ఆధారపడి ఉందనేవిషయం దీనివల్ల స్పష్టమవుతున్నది. యే ఒక్క అంశంలోపించినా అభివృద్ధి కుంటుపడుతుంది.

ఈ విధంగా లభ్యమైన వనరులను విస్తృతంగానూ సమీకృతంగాను వినియోగించుకోవడం ఇతోధిక వ్యవసాయోత్పత్తిలో చాలాముఖ్యం. 

# దురాక్రమణ

సున్నం వీరరాజు

మంచితృణీకరించి, యభిమానము ద్రుంచి, యకార్యమంచు దా
నెంచక, పంచశీల గణియింపక, స్నేహితులంచునెంచ కొ
క్కించుక, భారతీయుల జయింపగ "చౌ-ఎను-లై" సిపాయిలన్
బంచెను వంచకుండని ప్రపంచజనుల్ నిరసించి తిట్టగన్.

జవహరులాలు శశ్వత్‌కీర్తి దశదిశల్
వ్యాప్తిజెందుట సహింపనికతాన,
ఆశించునటు లాసియాఖండమున దన
"కమ్యూనిజము" పెంపుగననికతన,
భారతదేశ సంపదలు దినదినాభి
వృద్ధి నొందుట కోర్వలేనికతన,
భారతీయులు పాడిపంటలతో సుఖి
యించుటగని మచ్చరించుకతన,

కనులలో విప్పులను పోసికొని హటాత్తు
గా "చ-ఎన్-లయి" ధర్మమార్గమును దప్పి
మిత్రరాజ్యంబుపై దండయాత్ర జరిపె;
నితనికంటె గృతఘ్న డెందేని కలడె ?

న్యాయము దప్పి తా దొలి దురాక్రమణమ్మొనరించి "ఇండియా
యే" యొనరించెనంచు వచియించి ప్రపంచము విశ్వసింపగా
జేయ నభూతకల్పనలజేసి "చ-ఎన్-లయి" చాటుచుండినన్,
మాయురె ! వాని మాటలను నమ్మెడువారలు వేరుధారుణిన్.

ఆయన సత్యదూరుడగు నంచు గ్రహించినరీతిగా "చ-ఎన్-
లై" యను పేరు పెట్టినటులన్ గనుపట్టెడు, "లై" యటన్న "నాం
గ్లేయము''లో నబద్ధమగు; నిక్కువ మాతని పల్కులందు నౌ
రా ! యణుమాత్రమైన నిజమన్నది యున్నదె మచ్చుకేనియున్.

"చీనీభారత భాయి, భాయి'' యనుచున్ జెల్మిన్ బ్రదర్శించుచున్
చైనా పెద్దలు రాజ్య విస్తరణ కాంక్షన్ మారణాస్త్రాలితో
సేనల్ పంపిరి "ఇండియా''ను తొలి జే జిక్కించుకొందంచు, నా
పై నాశించిన ఆసియాను కబళింపన్ వచ్చునంచెంచుచున్.

పోరునగెల్చి, యాంగ్ల ప్రభువున్ దొలగించి, స్వరాజ్యలక్ష్మి జే
కూరగజేసి మన్ననలగొన్న పరాక్రమశాలులైన తత్
భారతవీరసైనికుల పౌరుషమప్పుడె విస్మరించినా
రౌర ! పెకింగు పెద్దలు మదాంధులు, జ్ఞానవిదూరులౌటచే.

ఆటంబాంబులు మాకు నున్నవని బాహాటమ్ముగా, మాటికిన్
జాటెన్ ధాటిగ నా "చ-ఎన్-లయి'' భయానన్ భారతీయుల్ మరే
యాటంకంబునులేక లొంగెదరటంచాసించి; యవ్వానికిన్
యాటంబాంబులె యున్న నీశ్వర సహాయంబేది నిర్జింపగన్.

అనుచితరీతి శత్రువు దురాక్రమణం బొనరించినంతనే
కనివిననంత యైక్యమును గాంచిన భారతజాతి భక్తితో
ధనకనకాదులంపెను ప్రధానికి తత్‌క్షణ మాతృదేశ ర
క్షణకు బ్రవాహరీతిగ జగజ్జనులచ్చెరువొంది మెచ్చగన్.

అనుపమ దేశభక్తిగల యంగనలెందరొ మాతృదేశ ర
క్షణ నిధికై యయాచితముగా దమ స్వర్ణవిభూషలన్ సమ
ర్పణమును సల్పి, యుద్ధమున భారతవీరులతో స్వరాజ్య ర
క్షణ మొనరింప గంకణము కట్టిరి వైరులు తల్లడిల్లగన్.

శాంతి కాంక్షించి మిత్రరాజ్యములు న్యాయ
సమ్మతమగు కొన్ని సూచనలుచేసి,
యిరువురును సఖ్యపడుడని హితమొనర్ప,
ద్రోహబుద్ధిని నవి చైన త్రోచివైచె,

న్యాయము దప్పి సంగరమొనర్చుట నాశనహేతువంచు, గాం
గేయ, జనార్దనాది మహనీయులుచెప్పిన లెక్కసేయ కే
మాయెనొ కౌరవేశు; డటులయ్యెడు "చౌ-ఎను-ల''య్యుకూడ చై
నీయులతో; జయంబొదవు నిక్కము భారతజాతికే తుదిన్.



# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

ఇటీవల విశ్వవిద్యాలయాల ప్రణాళికా సంఘ సమావేశంలో ఒక మేధావి యిలా అన్నారు: "ఈనాడు మనకు కావలసింది ఒక్క కుటుంబంలో తప్ప అన్ని రంగాల లోను అధికోత్పత్తి.'' మన దేశ పరిస్థితులకు పై వాక్యం అక్షరాల అన్వయిస్తుంది. ఈనాడు అధికోత్పత్తి ఎంత అవసరమో కుటుంబ పరిమితి కూడా అంత అవసరం. జనాభా పెరుగుదలపై ఏ నిపుణుడినైనా అడిగి చూడండి. ఒకే సమాధానం వస్తుంది. "జనాభా పెరుగుదలను నిరోధించక పోయినట్లయితే మిగతా విషయాలెలా వున్నా దేశం అభివృద్ధి చెందదు." మన దేశ జనాభా సంవత్సరానికి సుమారు 2.1 శాతం చొప్పున పెరుగుతోంది.

రామాయణం అంతటినీ 'కట్టె, కొట్టె, తెచ్చె' అని మూడు ముక్కల్లో చెప్పారు. మన ప్రణాళికా లక్ష్యాలను కూడ సంగ్రహంగా చెప్పవచ్చు :— ప్రజలందరికీ సరైన తిండి, బట్ట, ఆరోగ్యం. ఆహారోత్పత్తి ఆవశ్యకత నానాటికీ హెచ్చుతోంది. ఇక ఈనాటి అత్యవసర పరిస్థితిలో దీని ప్రాముఖ్యం చెప్ప నవసరంలేదు. మన రక్షణావసరాలకు దేశంలో సమృద్ధిగా ఆహారపదార్థాలు లభ్యం కావాలి. ఎట్టి అవాంతర స్థితినైనా ఎదుర్కొనడానికి మనం సిద్ధం కావాలి.

మనది ప్రధానంగా వ్యవసాయం వృత్తిగా గల దేశం. జనాభాలో నూటికి 68 మంది వ్యవసాయం మీదనే ఆధారపడి వున్నారు. సారవంతమైన భూములు, పుష్కలమైన జలసంపద, కాయకష్టానికలవడిన కోట్లాది రైతులు మన దేశంలో వున్నారు. ఆంధ్రప్రదేశ్‌లాంటి రాష్ట్రంలో వ్యవసాయంలో మరింత అభివృద్ధిని సాధించేటందుకు మార్గాలు విశేషంగా వున్నాయి. అందువల్లనే మన రాష్ట్రంతో వ్యవసాయోత్పత్తిని పెంపొందించేటందుకు కేంద్ర ప్రభుత్వం, ప్రణాళికా సమితి రాష్ట్ర ప్రభుత్వంతో సమాలోచనలు జరుపుతున్నది.

ఈనాడు మనకొక ప్రధాన సమస్య ఎదురవుతున్నది. కేవలం అధికంగా పండించడమే గాదు; పొందే ఫలసాయాన్ని సులభంగాను, నిశ్చితంగాను సాధించాలి. అంటే వీలైనంత తక్కువ వ్యయ ప్రయాసలతో నూటికి నూరుపాళ్ళు ఫలితాన్ని పొందాలి. ఇందుకు సహకార సేద్యం ముఖ్యమైన ఆయుధంగా పనిచేస్తుంది. అడ్డంకుల నధిగమించి ఆహారోత్పత్తిని అధికం చేయడానికి తోడ్పడుతుంది.

మన రైతులు సహజంగా వుత్సాహం గలవారు. శాస్త్రీయ విధానాలను చేపట్టడానికి వెనుకాడరు. ఐతే వారికి ఆర్థిక తదితర ఇబ్బందులున్నాయి. వీటికితోడు దేశంలోని భూ కమతాలన్నీ చిన్నవి. అవి చెల్లాచెదురుగా వున్నాయి. సన్నకారు రైతులు తమ భూములనుండి పూర్తి ప్రయోజనం పొందలేకుండా వున్నారు. రైతుల శక్తి, వారి పశు సంపద, వ్యవసాయ పనిముట్లను తగినంతగా వినియోగించలేక పోతున్నారు. స్థానిక వనరులద్వారా ఎక్కువ లాభం పొందడానికీ, సమిష్టిగా పనిచేయడానికి సహకార సేద్యం ఒక పద్ధతి.

సహకార వ్యవసాయ ప్రయోజనాలను ప్రజలకు తెలియజేసేటందుకు భారత ప్రభుత్వం మూడవ ప్రణాళికలో జిల్లాకొకటి చొప్పున 320 ప్రయోగాత్మక ప్రాజెక్టులను ప్రారంభించడానికి నిర్ణయించింది. ప్రతి ప్రాజెక్టులోను 10 సంఘాలుంటాయి. ఆంధ్రప్రదేశ్‌లోని 20 ప్రాజెక్టులలోను 200 సహకార సంఘాలు ప్రారంభింపబడతాయి. సహకార వ్యవసాయాన్ని ప్రోత్సహించేటందుకు మూడవ ప్రణాళికలో రాష్ట్ర ప్రభుత్వం రు 40 లక్షలు కేటాయించింది.

1963–64 అంతానికి ఈ క్రింది 10 జిల్లాలలో ఎన్నిక చేసిన ఒక్కొక్క ప్రాజెక్టులో ఐదేసి సంఘాల చొప్పున మొత్తం 50 సహకార సంఘాలు నిర్వహింపబడతాయి.

| జిల్లా | పైలట్ ప్రాజెక్టు |
|---|---|
| కర్నూలు | నందికొట్కూరు బ్లాకు |
| కడప | చిట్వేలు, కోడూరు బ్లాకులు |
| గుంటూరు | బాపట్ల, రేపల్లె బ్లాకులు |
| శ్రీకాకుళం — | సర్‌బుజ్జిలి బ్లాకు |
| ఖమ్మం | కొత్తగూడెం, బూర్గంపాడు బ్లాకులు |
| నల్గొండ | భోన్‌గిరి బ్లాకు |
| నెల్లూరు | వెంకటగిరి బ్లాకు |
| కృష్ణా | కైకలూరు, మండవల్లి బ్లాకులు |
| మహబూబ్‌నగర్ | బిజ్నపల్లి, రేవల్లి బ్లాకులు |
| నిజామాబాద్ | మద్నూర్, ఎల్లారెడ్డి బ్లాకులు. |

సహకార వ్యవసాయంలో చిన్న భూకామందులు తమ కమతాలను, మానవ శక్తిని, ఉత్పత్తి సాధనాలను ఒకచోట చేర్చి కలసికట్టుగా పనిచేస్తారు. దీనిలో నిర్బంధమంటూ ఏమీ లేదు. సభ్యత్వం స్వచ్ఛందంగానే వుంటుంది. భూముల యాజమాన్యం

సభ్యులైన భూస్వాముల చేతిలోనే వుంటుంది. సహకార సేద్యానికి, నిర్వహణకు మాత్రం భూమి సంఘానికి వప్పగించబడుతుంది. సహకార వ్యవసాయం ప్రధాన లక్ష్యం ఉత్పత్తిని పెంపొందించి ఉపాధి సౌకర్యాలు కల్పించడం. ఇందుకోసం భూమి అభివృద్ధి, నీటి పారుదల, ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పంటల మార్పిడి మున్నగు కార్యక్రమాలు చేపట్టబడతాయి. ఈ పనుల నిర్వహణవల్ల వుత్పత్తి ఎక్కువ కావడమేగాక అందుకయ్యే ఖర్చు కూడా తగ్గుతుంది. అన్ని ఋతువులలోను ఈ పథకం ఎలా పని చేసేదీ చూసేటందుకు కనీసం 3 సంవత్సరాలైనా చిన్న కమతాలను ఏకీకరించడం అవసరమని సూచించబడింది.

సహకార వ్యవసాయ సంఘాలు ప్రభుత్వంనుండి దిగువ సహాయాలను పొందవచ్చు.

1. పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలో ప్రారంభించబడే ప్రతి సహకార సంఘానికి వాటా ధనానికి తోడుగా రు 2 వేల వరకు ప్రభుత్వం యిస్తుంది.

2. అభివృద్ధి కార్యక్రమాలకు మధ్య కాలపు ఋణంక్రింద రు 4 వేలు యిస్తుంది. ఈ మొత్తాన్ని 5 సమాన వార్షిక వాయిదాలలో చెల్లించాలి.

3. గోదాము - పశువుల కోష్టాన్ని నిర్మించేటందుకు రు 5 వేల ధన సహాయం. ఇందులో 75 శాతం ఋణంగాను, 25 శాతం గ్రాంటుగాను వుంటుంది.

4. 3 నుండి 5 సంవత్సరాల కార్య నిర్వహణ ఖర్చులకుగాను రు 12 వందలు వుచిత గ్రాంటుగా ఇవ్వబడుతుంది.

వ్యవసాయ అభివృద్ధి పథకాలు, అధికాహారోత్పత్తి పథకం, బ్లాకు బడ్జెట్టులలో కేటాయించే మధ్యకాలిక, దీర్ఘకాలపు ఋణాలను కూడ ఈ సంఘాలు పొందవచ్చు. వ్యవసాయ కార్యక్రమాల నిర్వహణకు స్వల్పకాలిక ఋణాలవిషయంలో జిల్లా సహకార వ్యవసాయ సంఘాలకు హామీ ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వం సమ్మతించింది. ఐతే ఈ స్వల్పకాలిక అవసరాలు బ్లాకు సిబ్బంది సహాయంతో సంఘం రూపొందించిన ఉత్పత్తి కార్యక్రమాలై వుండాలి.

పైలట్ ప్రాజెక్టు లేని ప్రాంతాలలో కూడా సంఘాలను ఏర్పాటు చేయవచ్చు. వాటా ధన సహాయం తప్ప పైన పేర్కొన్న ఇతర సహాయాలన్నీ ఈ సంఘాలకు లభిస్తాయి. పైలట్ ప్రాజెక్టులలో 9 సంఘాలు, బయట 27 సంఘాలు ఇంతవరకు ఏర్పడ్డాయి. సహకార వ్యవసాయ సంఘాల అనధికార కార్యదర్శులకు రాజేంద్రనగర్‌లో శిక్షణ యిచ్చేటందుకు రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ శిక్షణ 6 మాసాలు వుంటుంది.

వ్యవసాయ రంగంలో విప్లవాత్మకమైన ఈ కార్యక్రమాన్ని ఇతరులతోపాటు మన రాష్ట్రం కూడా ప్రవేశపెట్టింది. దీని ప్రయోజనాన్ని పొందేముందు ప్రజలు ఈ కార్యక్రమ లక్ష్యాలను అవగాహన చేసికోవాలి. తమకు గల భయ, సందేహాలను నివృత్తి చేసికోవాలి. అనాదిగా మానవుడు సంఘజీవి. తన దినచర్యలలో కొంతమందికి తోడ్పడుతూ మరికొంతమంది సహాయాన్ని అతడు ఆర్జిస్తాడు. తాను ఒంటరిగా సాధించలేని అనేక ఘన కార్యాలను సాధిస్తాడు. సహకార వ్యవసాయం కూడా అలాంటిదే. దీనివల్ల పరస్పర అవగాహన, ఐక్యత పెంపొందుతాయి. దేశ స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లిన ఈ తరుణంలో అధికోత్పత్తి, ఐక్యత అనేవి మనకు సహజమైన ఆయుధాలు. సహకార వ్యవసాయాన్ని సక్రమంగా అమలుపరచి దేశాన్ని మరింత పటిష్ఠం చేసికోలేమా?



# "భారతరత్న"

# డాక్టర్ పి. వి. కానే

ఎస్. ఆర్ టికేకర్



రాష్ట్రపతి భవనంలో 1963 ఏప్రిల్ 17వ తేదీన జరిగిన గౌరవ బిరుద ప్రదానోత్సవం చిరస్మరణీయమైందిగా పరిగణింపబడుతుంది. ఆ నాడు నేటి తత్త్వవేత్తలలో సుప్రసిద్ధులు, ఇరవైనాలుగుకు పైగా పుస్తకాలు రచించిన ప్రముఖ గ్రంథకర్త అయిన మహా మనీషి, ప్రఖ్యాత పండితుడు, ధర్మశాస్త్ర చరిత్ర రచయిత అయిన మరో మహా వ్యక్తికి మనదేశంలో ఉన్నత గౌరవ బిరుదు అయిన "భారతరత్న" బిరుద ప్రదానం చేసి గౌరవించారు. డాక్టర్ కానే, తమ అసమాన పాండితీ ప్రతిభవల్లా, విజ్ఞాన సంపదవల్లా ప్రతిఫలాపేక్ష లేకుండా యావజ్జీవితం విజ్ఞానార్జనకే పరిశ్రమించినట్టి జ్ఞాన తృష్ణవల్లా ఈ ఉన్నత గౌరవ బిరుదానికి ఎంతైనా తగివున్నారు

"చంద్రునివల్ల రాత్రికి వింత శోభ చేకూరుతుంది అలాగే రాత్రి మూలంగా చంద్రుని అందం ఇనుమడిస్తుంది కాగా ఈ రెండిటివల్ల నీలాకాశం శోభ ద్విగుణీకృత మవుతుంది." అన్నాడొక సంస్కృత కవి ఈవిధంగానే "భారత రత్న" బిరుదం, ఆ బిరుదాంచితులైన డాక్టర్ కానే ప్రతిభను రాణింపజేయగా, డాక్టర్ కానే "భారత రత్న" బిరుదాన్ని రాణింప జేస్తున్నారు కాగా ఈ బిరుదు, ఈ బిరుదాంచితులు కలిసి భారతీయ పాండితీ ప్రాశస్త్యాన్ని శోభిల్ల జేస్తున్నారు

శ్రీ కానే సుమారు 84 సంవత్సరాల క్రితం పశ్చిమ కనుమల పల్లె పరిసరాలలో నివసించే ఒక సామాన్య కుటుంబంలో జన్మించారు ఉన్నత విద్యాభ్యాసానికీ, విద్యారంగంలో మంచి ఉద్యోగ సాధనకూ ఆయన బొంబాయి వెళ్ళారు ఉపాధ్యాయుడుగా గడపదలిచిన శ్రీ కానే, ఆయన భవిష్యత్ప్రణాళికలనే పూర్తిగా మార్చివేసినట్టి దిగువ సంఘటన సంభవించనట్లయితే ఆ వృత్తిలోనే వుండిపోయేవారు ఉత్కృష్టమైన ఉపాధ్యాయ వృత్తిని విడనాడి శ్రీ కానే న్యాయవాద వృత్తిని స్వీకరించి, బొంబాయి హైకోర్టు అప్పల్లేటు పక్షాన అక్కడ ప్రైవేటు ప్రాక్టీసు ప్రారంభించారు శ్రీ కానే ఈ మార్పుకు ఒకవిధంగా బలవంతంగానే పూనుకోవాల్సివచ్చింది న్యాయసమ్మతంగా తనకు రావల్సిన ఒక ఉద్యోగం తనకంటే జూనియర్ అయిన వ్యక్తికి ఇవ్వడం జరిగింది ఈ అన్యాయం శ్రీ కానేను చాలా కోపావేశుణ్ణి చేసింది న్యాయవాద వృత్తి ఆయనకు స్వేచ్ఛాయుతమైన వాతావరణం కల్పించింది అతనిలోని ఇతర సహజ ప్రతిభాసామర్థ్యాలు శోభిల్లడానికి మహదవకాశం కలుగచేసింది హైకోర్టు కేసులద్వారా పొందిన అపారమైన అనుభవం, ఈ ధర్మశాస్త్ర చరిత్రకారుని రచనాపాటవాన్ని పెంపొందించింది సంస్కృతంలోని అపారమైన సాహితీ సంపదకు, పూర్తిగా న్యాయం కలుగజేయడానికి ఆ దైవభాషలో దిట్ట అయి వుండటం అవసరమైంది అంతేగాక

హిందూ న్యాయశాస్త్రం యొక్క పెక్కు అంశాలమీద, అనేకమంది హైకోర్టు జడ్జీలు, న్యాయశాస్త్ర కోవిదులైన ప్రివీకౌన్సిల్ (1947 వరకు) సభ్యులు తమ తీర్పులలో చెప్పిన విషయాలను నిశితంగా పరిశీలించడం కూడా అవసరమైంది.

సంస్కృత పండితుడుగా, హైకోర్టుల తీర్పులను పెక్కింటిని నిశితంగా పరిశీలించే విమర్శకుడుగా కూడా గణుతికెక్కడం అద్వితీయమైన విషయం. ఈ రెండిటిలోనూ సమాన ప్రజ్ఞ కలిగివుండటం నిజానికి అపూర్వమైన సంగతే.

తన ఆత్మగౌరవానికి ప్రథమంగా భంగం కలిగిన అధ్యాపక వృత్తిలోని వారిని అధిగమించాలనే కాంక్షతోనే శ్రీ కానే ప్రత్యేకంగా అధ్యయనానికి ఉపక్రమించారనే విషయం జగద్విదితమే. ఇది ప్రేమానురాగాలతో జరిగిన కృషి. మొదటి రెండు సంపుటాలను ముగించిన తరువాత కూడా తన కృషి యొక్క బృహత్పరిమాణాన్ని గూర్చిన స్పష్టమైన అంచనాయే శ్రీ కానేకు కలుగలేదు. దాని ఇతర ప్రయోజనాల సంగతి ఎలా వున్నప్పటికీ ఇప్పుడది హిందూ మతానికి సంపూర్ణ విజ్ఞాన సర్వస్వమైంది.

"మీకు ఇక్కడ ఏదైతే కన్పిస్తుందో అది అంతటా కనిపిస్తుంది. ఇక్కడ మీ కేదైతే కన్పించదో అది ఎక్కడా కూడా కన్పించదు.''

అని "మహాభారతాన్ని" గూర్చి చేసిన ప్రశంస ధర్మశాస్త్ర చరిత్రకుకూడా చక్కగా వర్తిస్తుంది. "భారత రత్న" బిరుదాంచితుడైన ఈ పండిత ప్రకాండుని విశిత దృష్టి నుంచి మన జీవితానికి సంబంధించిన ఏ ఒక్క అంశంకూడా బహుశా తప్పిపోయి వుండదు.

మానవుడు ఆశించేవన్నీ శ్రీ కానేకు లభ్యమయ్యాయి. అత్యున్నతమైన వాటితో సహా అనేక గౌరవ సత్కారాలను శ్రీ కానే అయాచితంగానే పొందారు. నిజానికి ఇవన్నీ కూడా ఆయన్ను వెంటాడి వచ్చాయని చెప్పవచ్చు. ఈ గౌరవ సత్కారాలు ధారావాహకంగా జరిగినప్పుడు, ఈవిధంగా తనకు దేశవ్యాప్తమైన పరిగణను తెచ్చిపెట్టిన తన విజయాలపట్ల ఆయనకు చాలా ఆనందం కలగడం సహజమే. కాగా అవి దైవిక న్యాయం విషయంలోనూ, ప్రతిఫలాపేక్ష లేకుండా తన కర్తవ్యం పాలించవలసిన ఆవశ్యకత విషయంలోనూ సహజంగానే ఆయన విశ్వాసాన్ని పెంపొందించాయి. ఇలాంటి ఉదాహరణలు చాలా అరుదు. గీత ఉపదేశించిన ఉత్కృష్ట మార్గంలో ఇతరులను ప్రేరేపితులను చేయడానికి అవి తోడ్పడతాయి. లోకమాన్య తిలక్ గీతా రహస్యం అనే తన ప్రసిద్ధ వ్యాఖ్యాన గ్రంథంలో ఈ విషయాన్నే నొక్కి చెప్పారు. మహాపురుషుల ఈ ప్రత్యేక విలువనూ, వారి జీవితాలు, వారి వ్యక్తిత్వాలు మానవాళిపై తరతరాలవరకు కలిగించిన ప్రభావాన్నీ పూర్తిగా గ్రహించడం సామాన్యమైన విషయం కాదు.

శ్రీ కానే విషయంలో, సంస్కృత భాషలో ఆయనకుగల ప్రతిభ, ఆ భాషపట్ల ఆయనకున్న మక్కువ ఇతరులను ప్రభావితులను చేసిన దృష్టాంతాలు కానవస్తాయి. బొంబాయిలోని బ్రాహ్మణ సభ వరుసగా ఎనిమిది సంస్కృత నాటికలను శోభాయమానంగా ప్రదర్శించి మేధావివర్గాలను ఆనందపరవశుల జేసింది. గుప్తవంశపు రాజుల స్వర్ణ యుగంలోకూడా ఇట్టి అద్భుతం జరిగి వుండదు.

సంస్కృత భాషా శాస్త్రజ్ఞులు ఆధునిక యుగపు ఈ పండితోత్తముని ప్రతిభకు ఆకర్షితులయ్యారనడంలో ఆశ్చర్యపడనవసరం లేదు.

శ్రీ కానే ప్రతిభా సంపత్తి అపారమైనది. బహుముఖమైనది. ఈ లఘు పరిచయంలో దానికి న్యాయం చేకూర్చడం సాధ్యం కాదు. హిమాలయాలవంటి గంభీరమైన ఆయన కృషియొక్క ముఖ్యాంశాలను ఇచ్చట ప్రముఖంగా వెల్లడించడం జరిగింది.

కొందరు ప్రసిద్ధ సంస్కృత కవులూ, వారి గ్రంథాలకూ సంబంధించి కాల నిర్ణయం చేయడానికి శ్రీ కానే తమ మొదటి సంపుటంలో ప్రయత్నించారు. వీటిని ఇప్పటికే పండితులు దాదాపు అంగీకరించడం జరిగిందికూడా. — ఇది మొదటిది. ఇక రెండవదేమంటే, శ్రీ కానే, భారతీయ విద్వత్తు, హిందూ వేదాంతం గురించీ, సంస్కృత గ్రంథాల వైశిష్ట్యాన్ని గురించీ పాశ్చాత్య పండితులు కొందరు చేసిన అవమానకరమైన, హేయమైన విమర్శలను, ప్రకటనలను ఖండించడానికి ప్రయత్నించారు. డాక్టర్ కానే పాశ్చాత్యుల వాదనలన్నింటినీ యథాతథంగా ఉదహరించి వాటిని ప్రతిభాపూర్వకంగా ఖండించాడు. డాక్టర్ కానే చాలా బిడియస్తులు. అయినప్పటికీ ఇతరులను ఒప్పించగల సమర్థుడు. ఆయన పాండితీగరిమ, హుందాతనం అందరినీ ఆశ్చర్య చకితులను చేస్తుంది. ధర్మశాస్త్రం యొక్క అయిదు సంపుటాలలో పేర్కొన్న అత్యధికమైన గ్రంథాల సంఖ్యను బట్టి ఈ ఉత్కృష్ట సంపుటాలను సిద్ధం చేయడానికి ఎంతగా ఎన్ని గ్రంథాలను చదవవలసి వచ్చిందో వెల్లడవుతుంది.

సంప్రదాయికమైన యాత్రా స్థలాల జాబితా, మత సంబంధమైన వ్రతాల సుదీర్ఘ జాబితాలే రెండు చిన్న పుస్తకాలవుతాయి. నిపుణులతో నియమించిన అనేక సంఘాలు

పరిపాలనా సంబంధమైన ఉద్యోగాలకూ మొదలైనవాటికి ఉద్యోగ హోదాకు సంబంధించి కొత్తకొత్త పేర్లు రూపొందిస్తున్న ఈ రోజుల్లో, దేశ పరిపాలనా పద్ధతిపై, ప్రభుత్వాధికార్ల అనేక హోదాలకు పెక్కు గ్రంథాలలోనుంచి తీసుకున్న సంస్కృత పర్యాయపదాలు చాలా ఉపయోగ పడతాయి. కాలమానానికి సంబంధించిన చారిత్రకాంశం జటిలమైన ముహూర్త సిద్ధాంతం, అనేక హిందూ పంచాంగాలకు హేతువైన వ్యత్యాసాలు సమగ్రంగా, సంపూర్ణంగా చర్చించ బడినాయి. చిన్న అచ్చులో 6,000 కు పైగా పేజీలతో కూడిన అయిదు పెద్ద పెద్ద సంపుటాలలోని అతిముఖ్యమైన విషయాలను సైతం ఇచ్చట పేర్కొవడం సాధ్యంకాదు.

డా. కానే పాండితీ ప్రతిభను పురస్కరించుకొనే ఆయనను రాజ్యసభకు నామినేటు చేయడం జరిగింది. హిందూకోడ్‌ను (తరువాత ఇది ప్రత్యేకంగా అనేక చట్టాల క్రింద విడగొట్ట బడింది.) రచించడంలో ఆయన అమూల్యమైన మార్గ దర్శకత్వం లభించింది.రాజ్యసభకు డా. కానే నామినేషన్ కేవలంతలవని తలంపుగానే జరిగింది. రెండవ పర్యాయం తుదిక్షణంలో మళ్ళీ అయాచితంగానే మరొకసారి ఆయన్ను నామినేట్ చేశారు. డాక్టర్ కానే నిష్కపటంగా, నిర్మొగమాటంగా మాట్లాడే స్వభావంగల వ్యక్తి, ఎట్టి భయప్రలోభాలకు లోను కాకుండా తన భావాలను స్పష్టంగా వెల్లడించి ఇతరుల ప్రశంసలకు పాత్రుడయ్యాడు.

డాక్టర్ కానే, జాతీయ ప్రథమ ఇండాలజీ ప్రొఫెసర్‌గా నియమించబడినప్పుడు ఆయన అన్నమాటలు ఆయన విశిష్ట వ్యక్తిత్వాన్ని చాటుతాయి. ఈ నియామకాన్ని గురించి తెలియరాగానే డాక్టర్ కానే అందువల్ల తనపై ఏమన్నా నిర్బంధాలుంటాయా లేదా తాను ఏవైనా పనులు తప్పనిసరిగా చేయవలసి వుంటుందా అని మొట్టమొదట అడిగి తెలుసుకొన్నారు. తనపని శీఘ్రంగా సాగకుండా ఏవీ అడ్డగించకూడదన్నదే ఆయన అభిమతం. పనిలో స్వేచ్ఛకు ఆయన అత్యధిక విలువఇచ్చారు.

వ్యక్తిగత జీవితంలో డాక్టర్ కానే నిరాడంబరుడు. ఆయన ఇప్పటికీ బొంబాయిలో జనాభా అధికంగావుండే చాల్‌లోవి పూర్వపు సాధారణమైన ఇంట్లోనే నివసిస్తున్నారు. జీవిత సుఖాలపట్ల మోజులేక విరాగి జీవితం గడుపుతున్నారు. ఆయన సాదా నూలు వస్త్రాలు ధరిస్తారు. ఆయన తలపై ధరించే పగిడీ ఒక్కటే రంగుతో ఆకర్షణీయంగా వుంటుంది. ఆయన తన వ్రాతకు పాతకాలపు కలం, పాళీని మాత్రమే ఉపయోగిస్తారు. కానే ఎప్పుడూ స్వశక్తిమీదనే పూర్తిగా ఆధారపడతారు. పెద్ద పెద్ద సూచికలను తయారు చేయడానికి కూడా ఎప్పుడో కాని ఇతరుల సహాయం పొందడు. ఆపనంతా తామే చేసుకుంటారు. విజ్ఞానం పట్లా, స్వయంగా కల్పించుకున్న కార్య నిర్వహణ పట్లా ఇంతటి అకుంఠితమైన శ్రద్ధాసక్తులు వుండటం అరుదు. డాక్టర్ కానే గొప్పతనానికి బహుశా ఇదే కీలకమేమో. డాక్టర్ కానే సమాజ కల్యాణానికై అపురూపమైన విధానంలో తన శక్తి సామర్థ్యాలను చాలా వరకు వినియోగించారు. బ్రాహ్మణసభకూ, రాయల్ ఆసియాటిక్ సొసైటీకీ, భండార్కర్ ప్రాచ్య పరిశోధనా సంస్థకూ, దక్కన్ కళాశాలకూ, బొంబాయి విశ్వవిద్యాలయానికీ ఇంకా అనేక ఇతర విద్యాసంస్థలకు డాక్టర్ కానే గొప్ప సేవచేశారు. ఆయన సేవలు మిక్కిలి ప్రశంసార్హం కావడం మరీ విశేషం.



# సైనికునికి ఉత్తరం



కుంటిమద్ది శేషశర్మ

*(మార్చి నెల "ఆంధ్రప్రదేశ్" లో ప్రకటితమయిన శ్రీ కరుణశ్రీగారి తెలుగుసేత "సైనికుని ఉత్తరం" చదివి)*

ఈనాడే ఓ యన్నా !
నీజాబును గైకొన్నా
ప్రత్యుత్తర మిస్తున్నా
నీ కందిన నెమ్మదిలో
సంతసపడు తానన్నా !

ధన్యమయ్యె నీ జీవనము :
పావనమైన హిమాలయము;
గౌరీ శివుల నికేతనము,
సురనారీ ప్రమదావనము,
దేవదంపతుల నిధువనము
కూర్చిన సుందర నిష్కుటము,
ఐరావత మద వాసితము,
ఇంద్రాణీదిన మానసము,
క్రౌంచదారణుని శరవణము,
భాగీరథము తపోవనము,
ప్రవరుని పావనపదయుగము
నడయాడిన తుహినాచలము,
తిలకించిన నీ కనుయుగము
ధన్యమయ్యె నీ జీవనము.

మదనుడు మాడిన పట్టులట;
గౌరి తపించిన చోటులట;
ప్రవరతిరస్కృతయైన వరూధిని
వేదనఁగుందిన తిన్నెలట;
జరఠకమఠ చరమాంగముగనరా
గంగానది దిగులోయలట ;
భారతభూమికి నుత్తర దిక్కున
మనుజులు పెట్టని కోటలట ;
తుహినహీర మకుటంబులుదాల్చిన
మిన్నంటెడి శిఖరంబులట;
భారతభూమిని సస్యశ్యామల
గా నొనరించెడి నదులు నదంబులు
పుట్టువునొందెడి తుహినహిమానీ
తుషార మిహికానిలయమట ;
అది యుదీచిలో ప్రాక్ప్రతీచ్యముగ
భారతభూమికి మానదండముగ
నిలిచిన పర్వతరాజమట ;
అచ్చోటులఁ బరికించిన తిరిగిన
నీ జీవితమే ధన్యమనా !

అమ్మచెప్పినది ఓయన్నా !
వీనులొగ్గి యిది వినవన్నా !
కన్నది తొలుతటి జనయిత్రి ·
రెండవ జనయిత్రీ ధాత్రి :
ధాత్రి ఋణంబును తొలగించుటకే -
మాత్రము వేయకు వెనుకంజ :
"బానిసతనమున బ్రదుకుటకంటే,
మానమెడసి జీవించుటకంటే,
చావేమే"లని సత్యాగ్రహమున
సాధించిన యీ స్వాతంత్ర్యమ్మును -
నిలబెట్టిన మనదేశపతాకను

ఆచంద్రార్కము నారాధింపను
తారాపథమున నెగురవైవను
శపథముఁబూనిన స్వాతంత్ర్య ప్రియ
యువక వీరులకు మేలుబంతిగా,-
తడిబట్టలతో గొంతులు గోసే
పయోముఖంబుల విషకుంభములు
ధేనుముఖంబుల శార్దూలములు
తేనెనుబూసిన కత్తివాదరలు
హితశత్రువులగు చీనీ దస్యులు,
ఏమరించి మన సీమభూములను
దురాక్రమించిన హఠాద్విజృంభణ
కోహరి సాహరి ముసరిన మూగిన,
మోసగించుటకు వేసము వేసిన,
త[illegible]ఁదామె వెనువెనుకఁ[illegible]న
ఒక్కటి చెప్పుచు నొక్కటిచేసిన,
చైనీయులు మన యెల్లలనుండగ,
బొందిలోన జీవానిలముండగ,
కదనరంగమును వదలిరాకుమా;
వైరితూపులకు వీపు నీకుమా:
విజయలక్ష్మియో వీరస్వర్గమొ
కాని, వీరునకుఁగాదు మరొక్కటి:
వీరమాతయను పేరునెగానీ,
భీరుమాతయను దూరు సహింపను;
పరదేశీయుల పాదఘట్టనల
బలియగు మననేలలవీడి పరుల్
దొలగుదాక, నిర్మలజీవితములు
నెలకొనుదాకను, నిద్రాహారము
లను నాశింపక అని యొనర్పుమని
ఆదేశించెను; ఆశించెను విజ
యలక్ష్మితో నీయాగమనమ్మును.

తెలి కన్నుగవలలో
నెలకొన్న బిందువుల
రెప్పలంచులతోన
నప్పళించుచు, నధర
పల్లవము గంపింప,
పలుకుపలుకున ధవళ
దంతకుట్మలకాంతి
తాండవించుచునుండ
మా వదిన వాకొన్న
మాటలను వినుమన్న
ఎండనక చలియనక
వానగాలియనాక,
అకొంటి డస్సితిని
అలిసితిని సొలసితిని
నిదురపొద్దని యనక,
కదనరంగమునందు
మరఫిరంగుల దాల్చి
యరుల తండము డుల్చి,
పిరికికండలు లేని
బిరుదు మగడను వాసి
గడలుకొన, మువ్వన్నె
పడగ నెగురగ వైచి,
పగవారి యెదసించి,
జయభేరి మ్రోగించి,
పగతురను దిక్కులకు
పరువులెత్తగఁజేసి,
రాఁ, జూచి నీకు నీ-
రాజనము నెత్తెదను.
నీతోడి సేనలకు
నీకు శస్త్రాస్త్రములు
పదయుటకు బంగారు
కడియాల నొసగితిని.
చలికాగుటకు మీకు
ఉలను మేజోళ్ళు స్వె
ట్టరులల్లి పంపెదము,
బురునీసు లంపెదము,
ఎదలలో మా మీది
దిగులు దగులగనీక
కదనమున పగవారు
తుదిమట్టు నేలగొట్టి
చనుచెంది కనువిందు
సలుపవలెనని ప్రజా-
పతి విన్నవించినది.

మా పరీక్షలు ముగిసినంత నె
మాతృభూమికి దాపురించిన
ఇడుములను శాంతింపఁజేయను
నడుములను బిగియించివత్తుము,
నేనునూ మా మిత్రులన్నా!
ఒక్కమాటగ నొక్కసేతగ
ఒక్కపదముగ జనులు వలుబది
మూడుకోటుల్లు మల్లచరచిన
మూడుకన్నుల దేవరయ్యు క
న్నెత్తి చూచుట కెన్నిగుండెలు?
దేశహితమును కాంతసేయుచు
దీక్షఁబూనితి మింక వా ఫా
లాకుడైనను మనల ఢీకొన
విరిగిపారుట సత్యమని ఢం
కారవముతో చాటిచెప్పుము
మారుమ్రోగగ నాల్గుదిక్కులు
భారతీయుల కీర్తివెన్నెల
లెల్లదిక్కుల నలముకొన జే
జేల రోతసి పిక్కటిల, జే
జేలు నిను దీవింతురన్నా!

(మిగతా 27 వ పేజీలో)

# భారతదేశంపట్ల ఈర్ష్యతో చేసుకొన్న ఒప్పందం

పాకిస్తాన్, చైనాదేశాల మధ్య జరిగిన సరిహద్దు ఒడంబడికపై పెకింగ్‌లో 1963 మార్చి 2వ తేదీన సంతకాలు జరిగాయి. ఈ ఒడంబడికవల్ల పాకిస్తాన్‌కు కాశ్మీర్‌లో తాను ఆక్రమించుకున్న ప్రాంతంపై తన ఆధిపత్యానికి చైనాయొక్క గుర్తింపును పొందడం మినహా మరెట్టి ప్రయోజనమూలేదు. కాగా, చైనావారు మాత్రం తాము ఎంత భూభాగమైతే పొందదలిచారో అంతా సంపాదించుకున్నారు. ఈ ఉపఖండంపై తమ పలుకుబడినీ, ఆధిక్యతనూ పెంపొందించుకునే ఉద్దేశంతో రాజకీయమైన ప్రయోజనం పొందారు. వారు పాకిస్తాన్ పశ్చిమకూటమి రాజ్యాలను సైతం మించి, భారతదేశంపై ఒత్తిడులు తేవడం ద్వారా ఆగ్నేయాసియాలో పాకిస్తాన్‌ను తమ వత్తాసుగా ఉపయోగించుకోవడంలో కృతకృత్యులయ్యారు. భారతదేశం సరిహద్దు వివాదాన్ని ప్రత్యక్ష సంప్రదింపుల ద్వారానే పరిష్కరించుకోవాలన్న చైనా వాదాన్ని పాకిస్తాన్ విదేశాంగమంత్రి సమర్థించడాన్నిబట్టి చూస్తే, పాకిస్తాన్ చైనా పన్నుగడలను ప్రారంభించిందనే విషయం బుజువవుతున్నది.

కారాకోరం కనుమ పశ్చిమానగల కాశ్మీరు సంప్రదాయికమైన సరిహద్దు భారతీయ అధికారిక చిత్రపటాలన్నింటిలోనూ చూపబడింది. యార్కండ్, హుంజానదుల ఉపనదులను విభజిస్తూ నదీపరీవాహక ప్రాంతం పొడవునా ఈ సరిహద్దురేఖ వెళ్తుంది. కిలిక్, మింటక, కర్చనాయ్, పార్పిక్, కుంజెరాబ్ కనుమల పొడవునా ఇది వుంది. తరువాత ఈ సరిహద్దురేఖ షక్స్‌గమ్ నదిని దాటి, అఘిల్, మార్పో, షక్స్‌గమ్ కనుమలగుండా అఘిల్ పర్వతాల పొడవునా వెళ్ళి కారాకోరం కనుమ చేరుతుంది. ఇది సంప్రదాయికమైన వాడుకలో వున్న నదీపరీవాహక సరిహద్దు.

ఈ సరిహద్దు ఏర్పాటు భౌగోళిక సూత్రాలకూ, సంప్రదాయాలకూ, ఆచార వ్యవహారాలకూ అనుగుణ్యంగా వుంది. కాగా కాశ్మీర్‌పై పాకిస్తాన్ దాడిజరిపే వరకూ ఎప్పుడూకూడా ఈ ప్రాంతం భారత ప్రభుత్వాధీనంలోనే వుంది. అఘిల్ పర్వతాలకు దక్షిణానవున్న షక్స్‌గమ్, ఖుంజెరబ్ నదుల ఎగువలోయలు ఎల్లప్పుడూ హుంజాకు చెందిన భాగాలుగానే వున్నాయి. హుంజా ప్రజలు, ఈ ప్రాంతంలో సేద్యం చేసుకోవడం, పశువులను మేపుకోవడం వంటి వివిధ హక్కులు పొందివున్నారు. ముఖ్యంగా దర్వాజా ప్రాంతంలోని షింషాలీలు, షక్స్‌గమ్ వరకూ గల యావత్తు ప్రాంతాన్నీ పశువులు మేపుకోవడానికి వినియోగించుకున్నారు.

అంతేగాక లోయలో వివిధ స్థలాలలో వారు ఉప్పు తయారుచేసుకునేవారు కూడా. కాగా చైనాకు చెందిన ఏ వ్యక్తిగానీ ఎప్పుడూ కూడా ఈ ప్రాంతాన్ని వినియోగించుకోవడం జరగలేదు. హుంజా పాలకుడు మీర్, ఈ ప్రాంతంపై అధికారం వహించాడు. అతడు చౌకీలను నిర్వహించాడు. రెవిన్యూ వసూలు చేశాడు. 1907వ సం. పు ఇండియా ఇంపీరియల్ గెజెటులో చేర్చిన పటం, సర్వే ఆఫ్ ఇండియా ప్రచురించిన రాజకీయ పటాలతో సహా భారత ప్రభుత్వపు అధికారిక పటాలలో ఈ ప్రాంతం యావత్తూ భారతదేశంలో భాగంగానే చూపబడింది. పోతే 1917, 1919, 1933వ సంవత్సరాలలో ప్రచురించబడిన చైనా అధికారిక పటాలలో కూడా ఈ ప్రాంతాన్ని భారతదేశంలో భాగంగానే చూపడం జరిగింది. 1917వ సంవత్సరంలో ముద్రించబడి తరువాత 1919వ సంవత్సరంలోనూ ఆ తరువాత 1933వ సంవత్సరంలోనూ పునర్ముద్రించబడిన చైనావారి పటం సంప్రదాయికమైన ఈ సరిహద్దు రేఖను చూపుతుంది.

హుంజా పాలకుడు మీర్ 1884వ

సంవత్సరం దరిదాపుల్లో కాశ్మీర్ మహారాజాకు సామంతుడయ్యాడు. ఆయన, సంప్రదాయికమైన సరిహద్దుకు ఉత్తరాన వున్న ప్రాంతాలను, పశువులను మేపుకోవడానికి సేద్యానికి వినియోగించుకుంటూ వచ్చాడు. కొన్ని బ్రిటిష్ పటాలలో, ఈ ప్రాంతాన్నీ ఉత్తరాభిముఖంగా సింకియాంగ్‌లోని మరికొంత ప్రాంతాన్నీ కూడా కలుపుతూ ఒకే రంగు వాడబడింది. అయితే బ్రిటిష్ ప్రభుత్వం, ఈ ప్రాంతంలో సరైన సంప్రదాయసిద్ధమైన సరిహద్దును గుర్తించింది. 1899 వ సంవత్సరంలో, పెకింగ్.లో తమ ప్రతినిధిగావున్న సర్ క్లాడే మెక్డొనాల్డ్‌కు, సరిహద్దురేఖను తిరిగి ఏర్పరచడానికై చైనా ప్రభుత్వానికి ప్రతిపాదించడానికి అధికారం ఇచ్చింది. రాజీపూర్వకమైన ఈ ప్రతిపాదనలలో, హుంజాకూ సంప్రదాయికమైన సరిహద్దుకూ ఉత్తరాన వున్న తాగ్ దంబష్‌ను హుంజాలో చేర్చడానికీ, దానికి బదులుగా అఘిల్, కారాకోరం శ్రేణుల మధ్య సరిహద్దుకు దక్షిణాన వున్న ప్రాంతాన్నీ వదలుకోవడానికీ సూచనలు చేయబడ్డాయి. చైనా ప్రభుత్వం ఇటువంటి ఒప్పందం చేసుకోవడానికి తిరస్కరించి సంప్రదాయసిద్ధమైన సరిహద్దు నిర్ణయానికే కట్టుబడి వుండడానికి సమ్మతించింది.

## దిద్దుబాట్లు

1927 వ సంవత్సరంలో, భారత ప్రభుత్వాధికార్లు జరిపిన భూపరిశీలన ఫలితంగా సంప్రదాయసిద్ధమైన సరిహద్దువరకే హుంజా పరిపాలన విస్తరించివున్నట్లు తిరిగి ధృఢపరచబడింది. దీని ఫలితంగా 1936 వ సంవత్సరంలో, భారతప్రభుత్వం, రాగ్ దమ్‌బాష్ ప్రాంతంలో పశువులను మేపుకునే హక్కును వదులుకోవలసిందిగా మీర్‌ను కోరింది. 1947 వ సంవత్సరం తరువాత భారతప్రభుత్వం ప్రచురించిన పటాలన్నింటిలోనూ ఈ సరిహద్దు సర్దుబాటుకు సంబంధించిన మార్పులు చేయబడినవి.

*1960 లో చైనా తనవిగా వాదించిన ప్రాంతాలు :-* 1960 వ సంవత్సరంలో చైనా, భారత ప్రభుత్వాల అధికార్లమధ్య జరిగిన చర్చల సందర్భంలో చైనావారు ప్రదర్శించిన పటంలో కాశ్మీర్‌లోని దాదాపు 3,700 చదరపు మైళ్ళ భూభాగంతో సహా సంప్రదాయికమైన సరిహద్దు రేఖకు దక్షిణాన చాలాదూరం వరకుగల ప్రాంతమంతా వారి (చైనా)కి చెందినట్లు చూపబడింది.

అయితే ఈ ప్రాంతం భారత ప్రభుత్వాధీనంలో లేదనే సాకుతో ఈ విషయాన్ని మనతో చర్చించడానికి వారు నిరాకరించారు.

*1962 వరకు పాకిస్తాన్ అధికారిక సరిహద్దు :-* సంప్రదాయసిద్ధమైన సరిహద్దుకు ఉత్తరాభిముఖంగా సింకియాంగ్‌లో వున్న భూభాగాలపై భారత ప్రభుత్వానికి ఎట్టి హక్కు లేదని పాకిస్తాన్ ప్రభుత్వానికి స్పష్టం చేయబడింది. కాని ఆతరువాతకూడా పాకిస్తాన్ ప్రభుత్వం, దాదాపు 11,000 చదరపు మైళ్ళ భూభాగంతో సహా సింకియాంగ్‌లో ఉత్తరాన చాలా దూరంవరకూ తన సరిహద్దు వున్నట్లు చూపిస్తూ వచ్చింది. ఈ ఏర్పాటువల్ల సరిహద్దు నిర్వచించబడలేదనే విషయం ద్యోతకమవుతున్నది.

*వాస్తవంగా పాకిస్తాన్ అధీనంలోవున్న ప్రాంతాల సరిహద్దు :-* భారత ప్రభుత్వం పదే పదే అభ్యర్థించిన ఫలితంగా, పాకిస్తాన్ ప్రభుత్వం 1961 వ సంవత్సరంలో ఒక పటాన్ని అందజేసింది. వాస్తవంగా తమ అధీనంలోవున్న ప్రాంతాల హద్దు ఎమిటో వారు దానిలో చూపించారు. ఈ సరిహద్దు రేఖ సంప్రదాయసిద్ధమైన సరిహద్దుకు దక్షిణంగావుంది. వీటి మధ్య ప్రాంతం విస్తీర్ణం సుమారు 1600 చదరపుమైళ్ళు.

## చైనాకు సూచనలు

కరాచీలో జరిగిన ఒక అధికారిక ప్రకటనను బట్టి, సరిహద్దును నిర్ణయించుకొనగోరుతూ పాకిస్తాన్ ప్రభుత్వం చైనాకు 1961 మార్చి 28 వ తేదీన ఒక వర్తమానం పంపినట్లూ ఈ విషయంలో పాకిస్తాన్ ప్రభుత్వం చైనాను లాంఛనప్రాయంగా కదిపినట్లూ తెలుస్తున్నది. ఈ విషయంలో చైనా 1962 ఫిబ్రవరి నెలారంభంలో శ్రద్ధ వహించింది. 1962 మే 3 వ తేదీన పాకిస్తాన్ చైనా ప్రభుత్వాలు ఒక సంయుక్త ప్రకటన విడుదలచేశాయి. సంప్రదింపులు జరపడానికి ఉభయ దేశాలు అంగీకరిస్తున్నట్లు ఈ ప్రకటనలో పేర్కొనబడింది. ఈ విషయంలో భారతప్రభుత్వం తన అసమ్మతిని ఈ ఉభయ ప్రభుత్వాలకూ తెలియజేసింది.

## వివరణ

ఈ పరిణామం దృష్ట్యా భద్రతాసమితిలోని భారత ప్రతినిధి మే 3,4 వ తేదీలలోనూ జూన్ 22 వ తేదీన మన ప్రభుత్వ విధానాన్ని తెలియజేశారు. 1962 మే 3 వ తేదీన ఆయన ఇలా అన్నారు :

"భారత భూభాగమైన జమ్మూ - కాశ్మీర్‌లోని ఒక భాగాన్ని న్యాయవిరుద్ధంగా పాకిస్తాన్ ఆక్రమించుకున్నప్పటికీ, సర్ మహమ్మద్ జఫ్రుల్లా 1962 ఫిబ్రవరి 1 వ తేదీన చేసిన తన ప్రకటనలో అంగీకరించిన ప్రకారం పాకిస్తాన్, జమ్మూ - కాశ్మీర్ రాష్ట్రంనుంచి తన సైన్యాన్ని ఉపసంహరించుకోవలసి వుంది. అయినప్పటికీ సింకియాంగ్ కాశ్మీర్ సరిహద్దు విషయంలో

చైనాతో సంప్రదింపులు జరపడానికి పాకిస్తాన్ పూనుకున్నది. భారతదేశంలోని ఏ భూభాగం విషయంలోకానీ సంప్రదింపులు జరపడానికి పాకిస్తాన్‌కు ఎట్టి అధికారం లేదని మేము స్పష్టంచేస్తున్నాము. ఎవరితోనైనాకానీ పాకిస్తాన్ ఏ ఒప్పందం చేసుకున్నా దానికి మా దృష్టిలో విలువేమీ వుండదు.''

1962 మే 4 వ తేదీన భారత ప్రతినిధి ఇంకా ఇలా అన్నారు:

''శాశ్వతంగాకానీ, తాత్కాలికంగాకానీ లేదా ఇంకా ఏదైన విధంగాకానీ వారు కుదుర్చుకునే ఎట్టి ఒప్పందానికి కాని మేము కట్టుబడివుండమని భారతప్రభుత్వం తరపున నేను ఇక్కడ వెల్లడించదలిచాను. దీనికి కానీ లేక భారతదేశ భద్రతకు భంగకరమైన షరతులతో కూడిన ఏ ఒప్పందానికి కానీ మేము బద్ధులమై వుండము. ఇది అంతర్జాతీయ న్యాయ సూత్రాలను ఉల్లంఘించడమే అవుతుందనీ, భారత యూనియన్ సార్వభౌమాధికారంగల భూభాగాల విషయంలో ఇతరులతో రాజీబేరాలు చేసుకోవడం భద్రతామండలి తీర్మానాలను వమ్ముచేయడమే అవుతుందనీ నేను వివరించదలిచాను. ఈ సార్వభౌమాధికారాన్ని ఎల్లప్పుడూ భద్రతామండలేకాక యునైటెడ్ స్టేట్స్ ప్రతినిధి వారెన్‌ఆస్టిన్ కూడా అంగీకరించడం జరిగింది. ఆస్టిన్ ప్రకటనను నేను ఇదివరకే మీకు చదివి వినిపించాను.

''జమ్మూ, కాశ్మీర్‌పై సార్వభౌమాధికారం భారత యూనియన్‌కువుంది. జమ్మూ కాశ్మీర్ ఇప్పుడు భారత యూనియన్‌లో ఒక భాగం. కాబట్టి దానిని ధారాదత్తంచేసే అధికారం పాకిస్తాన్‌కులేదు. చైనాతోకానీ, మరెవరితోనైనాకానీ సంప్రదింపులు జరపడానికి పాకిస్తాన్‌కు అధికారంలేదు. కాబట్టి అంతర్జాతీయంగా సంప్రదింపులకు దిగడం, స్వప్రయోజనానికై ఇద్దరి మధ్య కయ్యాలు పెట్టడంవంటి చర్యలకు పూనుకోవడం అంతర్జాతీయ న్యాయ నిబంధనలను ఉల్లంఘించడమే అవుతుంది.

జూన్ 22 వ తేదీన భారత ప్రతినిధి తిరిగి ఈ విషయమై ఇలా అన్నారు:-

''పాకిస్తాన్ నేడు సంప్రదింపులకు దిగి, చైనా ప్రజారిపబ్లిక్ కేంద్ర ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకునే పరిస్థితి ఏర్పడింది. ఇది ఏ సదుద్దేశంతోనూ చేసిందికాదు. ఇది కేవలం మాకు ఇబ్బంది కలిగించి మాపై ఒత్తిడి తేవడానికి ఒక సాధనం మాత్రమే. ఈ సంప్రదింపులు లేదా ఒప్పందం పాకిస్తాన్‌కు గల అన్ని హక్కులు లేక అధికారాలకు పూర్తిగా భిన్నమైనది. ఎందుచేతనంటే ఈ రాష్ట్రంపై దానికి సార్వభౌమాధికారం లేదు. బేరసారాలు చేయడానికి ఇది దానికిచెందిన ప్రాంతంకాదు. రెండవ విషయమేమంటే తన భద్రతకు సంబంధించిన పరిస్థితులదృష్ట్యా కూడా ఇది అనవసరం. అన్నిటికంటె ముఖ్యమైన దేమంటే ఈ ఒప్పందం మనకు ఆమోదయోగ్యంకాని ప్రాతిపదికపై జరిగింది. అంటే భద్రతామండలి ముందు చర్చనీయాంశాలుగా లేనట్టి చైనా యెడల మనం ప్రదర్శించే వైఖరీ, అదికోరుతున్న భూభాగం ఆధారంగా జరిగిన ఈ ఒప్పందం మాకు ఆమోదయోగ్యం కాదు.''

రావల్పిండిలో 1962 డిశంబరు 27 వ తేదీన ఇండియా, పాకిస్తాన్ దేశాల ప్రతినిధులమధ్య, కాశ్మీర్ తత్సంబంధమైన అంశాలపై చర్చలు జరగడానికి ముందు సింకియాంగ్, పాకిస్తాన్ దురాక్రమణలో వున్న కాశ్మీర్ ప్రాంతంమధ్య సరిహద్దు విషయంలో 'సూత్రప్రాయమైన ఒప్పందాన్ని' చైనా, పాకిస్తాన్ ప్రభుత్వాలు ఒకేసారి ప్రకటించాయి. భారత ప్రతినిధి వర్గ నాయకుడు సర్దార్ స్వర్ణసింగ్ తక్షణమే పాకిస్తాన్ అధ్యక్షుడు అయూబ్‌కూ, భుట్టోకు రావల్పిండిలో మన వైఖరిని స్పష్టంగా తెలియజేశారు. జనవరి 16 వ తేదీన ఢిల్లీలో ఈ చర్చలు తిరిగి ప్రారంభమైనప్పుడు కూడా శ్రీ సింగ్ మనవైఖరిని భుట్టోకు తిరిగి స్పష్టంచేశారు.

1962 డిశంబరు 26 వ తేదీన చైనా — పాకిస్తాన్ ప్రభుత్వాలు విడుదలచేసిన సంయుక్త ప్రకటనపట్ల అధిక్షేపణ తెలుపుతూ భారత ప్రభుత్వం జనవరి 26 వ తేదీన పాకిస్తాన్ ప్రభుత్వానికి నిరసన పత్రం అందజేసింది.

పాకిస్తాన్ విదేశాంగమంత్రి శ్రీ భుట్టో పెకింగ్ సందర్శించిన ఫలితంగా మార్చి 2 వ తేదీన ఒక ఒప్పందం ప్రకటించబడింది. పాకిస్తాన్, చైనా దేశాలమధ్య కొత్తగా జరిగిన సరిహద్దు సర్దుబాట్లను చూపుతూ చిత్రపటాలు విడుదల చేయబడినాయి.

ఈ ''ఒప్పందం'' పట్ల ఆక్షేపణ తెలుపుతూ చైనా, పాకిస్తాన్ ప్రభుత్వాలకు భారత ప్రభుత్వం మళ్ళీ నిరసన పత్రాలు పంపింది.

1962 వ సం. లో ప్రచురించబడిన దాని ప్రకారం, పాకిస్తాన్ దిగువ విధంగా తన భూభాగాలను ధారాదత్తం చేసినట్టు స్పష్టమవుతుంది:-

(అ) సంప్రదాయసిద్ధమైన సరిహద్దుకు ఉత్తరాన 11,000 చదరపు మైళ్ళు.

(అ) సంప్రదాయసిద్ధమైన సరిహద్దుకూ, వాస్తవంగా పాకిస్తాన్ అధీనంలోనున్న

(తరుగతా 25 వ పేజీలో)

తమిళ కథానిక :

# ఫలించిన వైషమ్యాలు

మూలం :
నరసన్

అనువాదం :
అట్లూరి మధుసూదనరావు

అమావాసపు రోజులవి. సాయంత్రం ఆరు గంటలవేళ. సూర్యుడప్పుడే అస్తమించాడు. అంధకారం అంతటా అలుముకుంటున్నది. పాంచాలి ఇంటిపనులు ముగించుకొని ఇంట్లోనుంచి బయటి కొచ్చింది. ఆ ఇంటికి వందగజాల దూరంలో ఎదురుగా విశాలమైన సముద్రం ఘోషపెడు తున్నది. ఆమె ఆ సముద్రంవైపు పరీక్షగా చూచింది. పనిలోకి వెళ్ళిన వాళ్ళంతా తిరిగి వస్తున్నారు. కన్నమ్మభర్త తిరిగి వచ్చాడు. చోళై అన్న డింగీనుంచిదిగి తనదారిన తాను వెళ్ళిపోయాడు. ఇలా వెళ్ళిన వాళ్ళంతా బయటకువచ్చేసి వాళ్ళ వాళ్ళ యిళ్ళకు వెళ్ళి పోయారు.

మరి పాంచాలిభర్త ఏడీ? అతగాడు కన్పించడేం? పాంచాలిమనస్సు కలుక్కు మన్నది! ఆమెదృష్టి చుక్కమ్మమీద పడింది. చుక్కమ్మతండ్రి చేపలు తెచ్చాడు. ఆమె వలలోనుంచి వాటిని బయటకితీసి బుట్టలో వేస్తున్నది. చుక్కమ్మ తండ్రివైపుతిరిగి పాంచాలి — "మా ఆయనింతకుముందు మీ కేమైనా కన్పించారా?" అని కొంచెం గాభరాగా అడిగింది.

"పాంచాలీ! మీ ఆయన ధైర్యంకల వాడు. ఇవ్వాళ చాలా దూరం వెళ్ళాడు. పైగా ఇవ్వాళ సముద్రంకూడా అదేపనిగా ఘోష పెడుతున్నది. తాటిచెట్టంత అలలు అదే పనిగా లేచిపడుతున్నాయి. గాలికూడా బాగా వీస్తున్నది. మేము అతి కష్టంమీద నాలుగు మైళ్ళు వెళ్ళగలిగాం. ఆ తరువాత వెనక్కి తిరిగి వచ్చాం. మీ ఆయన అదృష్టవంతుడు. ఇవ్వాళ చాలా చేపలుపట్టి వుంటాడు. విచా రించకమ్మా, క్షేమంగా తిరిగివస్తాడు మీ ఆయన." అని చుక్కమ్మతండ్రి సమాధానం చెప్పాడు.

పాంచాలి తన కులదేవతను లోలోపల స్మరించుకుంటూ ఇంటికి తిరిగివచ్చింది.

ఎదురుగా చటయన్ కన్పించాడు అతని చేతిలో చేపఒకటి వున్నది. ఆ చేపవైపు ఆమె అదేపనిగా చూసింది. "చటియన్ భార్య ఎంత అదృష్టవంతురాలు! ఇవాళ ఎంత మంచిచేపను ఆమె రుచి చూడ బోతున్నది?" అని ఆమె లోలోపల అను కున్నది. ఆమెకు అకస్మాత్తుగా ఉదయం వెళ్ళిపోయేప్పుడు భీమన్ అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. "రేపు మన కుర్రవాడి జన్మదినంకదూ? చాలా బ్రహ్మాండంగా ఏర్పాటుచేద్దాం. ఖర్చుకు నాలుగు డబ్బులు చేతిలో వుండాలిగా. అందుకని ఇవ్వాళ నేను కొంచెం ఆలస్యంగావస్తాను. నువ్వే మీ ఖంగారుపడకు."

రాత్రి అయింది. ఎనిమిదికూడా దాటింది. కాని భీమన్ రాలేదు.

పౌర్ణిమ గడిచి మూడురోజు లయింది. వెన్నెల అంత విరియకాయడం లేదుగాని, మధ్యస్థంగా వున్నది. ఆ వెలుతురులోనే పాంచాలి తన భర్త రాకకోసం ఎదురు తెన్నులు చూస్తున్నది.

ఆమెకు కొంచెం భయమేసింది.

"భీమన్‌కు ఏం జరిగిందో ఏమో? సముద్రంమీద అంత దూరం ఎందుకు ప్రయాణం చేయాలి? అందరూ వెళ్ళినంత దూరం వెళ్ళి తిరిగి రాకూడదూ? పైగా రేపు కుర్రవాడి పుట్టినరోజు కూడా." ఆమె ఇవన్నీ ఆలోచించుకొని మరింత బెంబేలు పడింది.

చర్చిలో తొమ్మిది గంటలు మోగినాయి. ఆమె ఇంట్లో కూర్చోలేకపోయింది. కుర్ర వాడు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ఆమె బయటకి నడిచివచ్చి సముద్రపు ఒడ్డు చేరింది. కళ్ళవెంట కన్నీరు అదేపనిగా ప్రవహిస్తున్నది.

**అనువాద భారతి**

ఆమె సముద్రము వైపు తిరిగి చేతులు రెండూ జోడించి —



విచలిత అయింది.

"పాంచాలీ! పాంచాలీ!"

ఆమె చకితురాలై వెనుతిరిగి చూచింది. ఆమె స్నేహితురాలు రాజాత్తి.

"రాజాత్తీ!"

"ఏమిటి?"

"నీకీ విషయం తెలుసా?"

"ఏమిటో చెప్పు!"

విచార సాగరంలో మునిగివున్న పాంచాలి రాజాత్తి చేతులు రెండూ పుచ్చుకొని తన భర్త అంతవరకూ తిరిగిరాని విషయం సవిస్తరంగా చెప్పింది.

"హే, సాగర దేవతా! నువ్వే మాకు రక్ష. నువ్వే కరుణించాలి. ఎలాగైనా నా భర్తను రక్షించు." అని ప్రార్థించింది.

ఉవ్వెత్తున లేచిపడుతున్న అలలను చూచి ఆమె మరింత విహ్వలురాలైంది. మరింత

"అవునవును, నేనూ విన్నాను — మీ ఆయన చాలా దూరం వెళ్ళాడట! సముద్రంలో తుఫాను వచ్చిందట! అందుకే ఆలస్యమైంది. నాకింకో విషయం కూడా తెలిసింది. మీ ఆయన వలలో చాలా పెద్ద చేప ఒకటి చిక్కుకున్నదట! దాన్ని ఎలాగైనా సరే పట్టి తీసుకురావడానికి ప్రయత్నించాడట!!"

పాంచాలి రాజాత్తి చెబుతున్నవన్నీ శ్రద్ధగా వింటూనిల్చుంది — ప్రశాంతంగా!

"పాంచాలీ! వింటున్నావా? మీ ఆయన అంత పెద్దచేపను పట్టుకొనడానికి ప్రయత్నిస్తున్న సమయంలో మీ ఆయనంటే పగబట్టిన పాములాగా ద్వేషించే చటయన్ డింగీలో పక్కనే వున్నాడట. అతను కావాలంటే మీ ఆయన్ను తనతో తీసుకరావచ్చు! అతనుకూడా చాలా పెద్దచేప తెచ్చాడు. మరి అది అతను పట్టిందో లేక మీ ఆయన పట్టింది తెచ్చాడో! అంతా చెప్పుకుంటున్నారు."

పాంచాలి మారుమాట్లాడలేదు. ఏం మాట్లాడుతుంది? ఆమె మనస్సు మనసులో లేదు. ఏమీతోచక ఆమె మళ్ళు చుక్కమ్మ తండ్రి దగ్గరకు వచ్చింది.

"అయ్యో! నా బతుకేంకావాలి?'' అని ఆమె గాభరాపడుతూ చుక్కమ్మతండ్రి పాదాలు పట్టుకుంది.

"ఎందుకమ్మా ఏడుస్తావు? ఇప్పుడేం జరిగింది?''

"ఆయన సముద్రంలో ఒకవేళ ..." ఆపైని ఆమె నోటినుంచి మాటరాలేదు. వెక్కి వెక్కి ఏడవసాగింది.

"పిచ్చిదానా! ఎందుకు ఏడుపు? భీమన్ అంటే సామాన్యుడనుకున్నావా? అటువంటి బలాఢ్యుడు సాహసవంతుడు మరొకడు లేడు. నువ్వేమీ గాభరా పడనవసరంలేదు. అతను సుఖంగా తిరిగివస్తాడు." అని చుక్కమ్మతండ్రి పాంచాలిని ఓదార్చాడు.

"ఏమో! ఒకవేళ తుఫానువల్ల ఆయన డింగీ మునిగిపోయివుంటే ఏంగాను? చటయన్ కూడా ఆయన వెళ్ళినంత దూరం వెళ్ళాడట! అతను కావాలనుకుంటే ఆయన్ను రక్షించగలిగేవాడేనట. కాని ఆ దుర్మార్గుడు ఆ పని చేయలేదు.''

ఆ వాడకట్టందరికి పాంచాలి భర్త తిరిగి రాలేదనే వార్త తెలిసింది. నలుగురూ నాలుగుమాట లన్నారు. ఇక భీమన్ కనిపించనట్టేనని కొందరు దీర్ఘంగా నిట్టూర్చారు కూడాను!

'పాపం, ఇంత చిన్న వయస్సులోనే వైధవ్యమా?' అని ఒకరంటే —

'రేపు వాళ్ళ బిడ్డ పుట్టినరోజు పండగట!' అని మరొకరు సానుభూతిగా మాట్లాడారు.

'ఏనుగు అప్పుడప్పుడు మావటివాణ్ణి చంపేస్తుంది. పాములవాడూ ఒకప్పుడు పాముచేతనే కరవబడతాడు. అలాగే సముద్రం మీద చేపలు పట్టి జీవించే వాళ్ళు కూడా ఏదోఒకరోజు దానికి బలి కావలసిందే! తప్పదు. జీవితమంటే ఇదే మరి!' అని ఒక ముసలమ్మ వేదాంతం చెప్పింది.

"ఏమోనండీ — చటయన్, మా ఆయన పోట్లాడుకొనడానికి ఈ సముద్రమే కారణం! మా ఆయనతో ఒకసారి అతగాడు — 'నీ శవం ఈ సముద్రంమీద తేలుతుంది చూస్తూవుండు.' అని అన్నాడట. చివరకు అతను అన్నంతపనీ...'' పాంచాలి హృదయం తరుక్కుపోయేలా ఏడవడం సాగించింది.

ఆమె వ్యధను చూసేప్పటికి ప్రతివాళ్ళకూ బాధ వేసింది. కొంతమంది వుండబట్టలేక చటయన్ యింటికి వెళ్ళారు. అతని ఇంటి తలుపు మూసి వుంది. లోపల చటయన్ తన భార్యతో నెమ్మదిగా ఏమిటో చెబుతున్నాడు. వెళ్ళినవాళ్ళు చెవులొగ్గి విన్నారు.

'జరిగిందేమిటో నాకు వివరంగా నిజం చెప్పండి!' అని భార్య అడుగుతున్నది.

"అతను నాకు శత్రువే. కాని ప్రమాదాన్ని పంకించి అతన్ని రక్షించాలనుకున్నాను. నా వైరాన్ని మరచి అతన్ని ప్రమాదం నుంచి రక్షించడం నా కర్తవ్యంగాకూడా భావించాను. వెంటనే నీళ్ళలోకి దూకాను. కాని తీరా వెదికేప్పటికి నీళ్ళల్లో ఈ వల, వలలో చిక్కుకున్న ఈ పెద్దచేపా దొరికాయి. వలనూ, చేపనూ డింగీలోపడేసి మళ్ళా నీళ్ళల్లోదూకి భీమన్ కోసం వెదికాను. కొంచెం దూరంలో అతను సముద్రపు అలల మీద తేలుతూ, మునుగుతూ కన్పించాడు. అప్పటికే నేను బాగా అలసిపోయాను. సరీగ్గా ఆదేసమయానికి సముద్రపు పన్ను వేసే అధికార్ల పడవ ఒకటి కన్పించింది. బిగ్గరగా కేకవేసి నేను భీమన్ వైపు చూపించాను. వాళ్ళు వెంటనే భీమన్ దగ్గరకువెళ్ళి రక్షించి పడవలో ఒడ్డుకుచేర్చారు. ఆతరువాత వాళ్ళే ఆస్పత్రిలో చేర్పించారు. ఆస్పత్రికి వెళ్ళి అతన్ని చూచివస్తున్నా. ఫరవాలేదు. తెలివి వచ్చింది. రేపు ఉదయానికి పూర్తిగా కోలుకుంటాడు. గాభరాపడవలసిన అవరంలేదు.

"...నాకు తెలుసు — నలుగురూ నన్ను గురించి చెడ్డగా చెప్పుకొంటారు. ఎందుకంటే మా యిద్దరిమధ్యా శత్రుత్వం వున్నది గనుక! కాని నేను యిలా చేశాననిమాత్రం ఎవరికీ తెలియదు...ఇది భీమన్ పట్టినచేప! దీన్ని మనం ఎందుకు అట్టేపెట్టుకోవాలి? రేపు ఉదయంవెళ్ళి వాళ్ళ చేపను వాళ్ళకు ఇచ్చిరా? సముద్రంమీద ఒక రోజున మా యిద్దరిమధ్యా వైరం పెరిగింది. ఆ వైరం కాస్తా సముద్రంలోనే కలసిపోయింది. మా వైషమ్యాలు సడలిపోయాయి — ఇప్పుడు మేమిద్దరం స్నేహితులం''

భార్యాభర్తలు చెప్పుకుంటున్న ఈ మాటలు విన్నవాళ్ళు వెంటనే వెనక్కితిరిగి వచ్చారు.

ఆ రెండోరోజు ఉదయం పాంచాలి సముద్రతీరానికి వెళ్ళి చేతులు రెండూ జోడించి — "హే సాగర దేవతా! ఎంత దారుణమైన వ్యధను కలిగించి చివరకు ఆనందాంబుధిలో ఓలలాడేట్లు చేశావు. నీ మహిమ అపారమైనది!'' అని ప్రార్థించింది — కళ్ళవెంట ఆనందభాష్పాలు రాల్చుతూ!

(21 వ పేజీ తరువాయి)

ప్రాంతం హద్దుకూ మధ్య 1,600 చదరపు మైళ్ళు.

(ఇ) అఘిల్, కారాకోరం శ్రేణులమధ్య వెయ్యి చదరపుమైళ్ళకుపైగా.

అంటే సంప్రదాయికమైన సరిహద్దుకు దక్షిణాన కొంత భాగం, కాశ్మీర్‌రాష్ట్రంలో నుంచి కొంతభాగం — ఈవిధంగా దాదాపు 2700 చదరపుమైళ్ళ భారత భూభాగాన్ని పాకిస్తాన్ దత్తం చేసిందన్నమాట. ఈ ఒప్పందంలో కొన్ని మినహాయింపులు, వున్నప్పటికీ చైనీయులు తాము కొత్తగా పొందిన ప్రాంతంలో అఘిల్‌శ్రేణి దక్షిణ దిశగా కారాకోరం పర్వతాలవరకు సైనికంగాగానీ ఇతరత్రాగానీ ముందుకు వెళ్ళడానికి వారికి స్వేచ్ఛ వుంటుందనే విషయం సుస్పష్టం.

సరిహద్దు ఒప్పందంపై సంతకాలు జరిగిన పిమ్మట పాకిస్తాన్ విదేశాంగమంత్రి శ్రీ భుట్టో కొన్ని ప్రకటనలు చేశారు. ఈ ప్రకటనలు పాకిస్తాన్ అధికారికంగా వెల్లడించిన వాస్తవికాంశాలను సమర్థించలేక పోయాయి. శ్రీ భుట్టో ఈవిధంగా చేసిన ప్రకటనలలో ఒకదానిలో "పాకిస్తాన్ 750 చదరపుమైళ్ళ భూభాగం పొందింద"ని అన్నారు. ఈ ప్రకటన పూర్తిగా అసత్యమనే విషయం పాకిస్తాన్ ప్రకటించిన పటాలలోని వాస్తవంగా పాకిస్తాన్ అధీనంలోనున్న ప్రాంతాల హద్దును తెలిపే రేఖనుబట్టి తెలుసుకోవచ్చు. ఇది పాకిస్తాన్ కొత్తగా ప్రకటించిన అధికారిక పటాలకు కూడా పూర్తిగా భిన్నంగావుంది.

పాకిస్తాన్ "కొత్తగాపొందిన" భూభాగంలోని చైనీయుల కొన్ని బ్యారెకులు మొదలైనవి ఖాళీ చేయబడతాయనికూడా పాకిస్తాన్ విదేశాంగమంత్రి అన్నారు. అంటే చైనీయులు ఇదివరకే సంప్రదాయికమైన సరిహద్దు ప్రాంతానికి దక్షిణాన చాలా ముందుకు చొచ్చుకొని వచ్చారని అర్థం.

తమ ఒడంబడిక ప్రస్తుతం పాకిస్తాన్ అధీనంలోనున్న ప్రాంతాలకు మాత్రమే సంబంధించినదని చైనా, పాకిస్తాన్ ప్రభుత్వాలు రెండూ పదేపదే వెల్లడించాయి. యుద్ధ విరమణ రేఖ కారాకోరం కనుమకు నైఋతిదిశన ముగుస్తుంది. ఒకవేళ ఇది ఉత్తరాన అంతర్జాతీయ సరిహద్దును కలిసేట్లయితే కారాకోరం కనుమకు పశ్చిమాన చక్కగా కలుస్తుంది. ఈవిధంగా కారాకోరం కనుమవరకు పాకిస్తాన్ పేర్కొన్న సరిహద్దురేఖ అది చేసుకున్న ఒప్పందంలోని షరతులకు పరస్పర విరుద్ధంగావుంది. అంతేగాక కారాకోరం కనుమలను ఆనుకొని దక్షిణానకానీ, పశ్చిమానకానీవున్న ప్రాంతాలపై పాకిస్తాన్‌కు ఆధిపత్యం వుండదు కనుక చైనా, పాకిస్తాన్‌దేశాలు రెంటికీ భారతదేశంపట్ల తమ ఈర్ష్యను తెలపడానికే ఈ ఒప్పందం ప్రధానోద్దేశం అయినట్లు స్పష్టమవుతుంది. పటాలలో చూపిన సరిహద్దులనూ, అధికారపరిధి, సంప్రదాయం మొదలైన సాక్ష్యాధారాల నన్నింటినీ త్రోసిపుచ్చి సరిహద్దును కొత్తగా ఏర్పర్చుకోవల్సిన అవసరముందన్న చైనావాదాన్ని పాకిస్తాన్ ఆమోదించింది. కొత్త సరిహద్దు సంప్రదాయసిద్ధమైనరేఖ ఆధారంగా రూపొందింపబడినదంటున్నప్పటికీ ఇది పూర్తిగా యదేచ్ఛగా నిర్ణయింపబడినట్టిదే. కొన్నిచోట్ల ప్రకృతిసిద్ధమైన అంశాలను వేటినీ పాటించకుండానే ఇది సాగిపోతుంది.

## కాశ్మీర్ — ఐక్యరాజ్యసమితి

ఈ ఒప్పందంపై సంతకంచేయడం ద్వారా పాకిస్తాన్ ప్రభుత్వం తనకు మాత్రమే కాక మరో దురాక్రమణదారు అయిన చైనాకుకూడా అనుకూలంగా వుండేట్లు 1948 జనవరి 17న జరిగిన భద్రతామండలి తీర్మానం, 1948 ఆగస్టు 13న జరిగిన యు.ఎన్. కమిషన్ తీర్మానాల ప్రాతిపదికను ఏకపక్షంగా మార్చివేసింది. తాను అన్యాయంగా ఆక్రమించుకున్న ప్రాంతాన్ని ఖాళీచేయవలసిన ధర్మం దానిపై వుండగా దురాక్రమణద్వారా, న్యాయవిరుద్ధంగా ఆక్రమించుకున్న ప్రాంతంపై ఆధిపత్యం వహించడమే కాకుండా భారతదేశ ప్రాదేశిక సమగ్రతకూ, భద్రతకూ భంగకరంగా చైనాతో కలిసి కుట్రపన్ని భారత సార్వభౌమాధికారంలోని భూభాగం విషయంలో లావాదేవీలకు దిగింది. పైగా భారత, పాకిస్తాన్‌దేశాలు రెండూ ప్రక్కప్రక్కన స్నేహంగా, శాంతియుతంగా గడపగలగడానికి వీలుగా గౌరవప్రదమైన, న్యాయమైన పరిష్కారం కుదుర్చుకునే ఉద్దేశంతో భారతప్రభుత్వం పాకిస్తాన్ ప్రభుత్వంతో నేరుగా కాశ్మీర్ తత్సంబంధమైన అంశాలపై చర్చలకు పూనుకున్న ఈ తరుణంలో పాకిస్తాన్ ఈవిధంగా ప్రవర్తించింది.

భారతదేశం తన సైనికబలం పెంచుకుంటున్నదని, యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నదని, దేశంలో యుద్ధోద్రేకం రెచ్చగొడుతున్నదని, చైనా ఆదేపనిగా ప్రచారం సాగిస్తున్నది. భారతదేశానిది శాంతి లక్ష్యంకాదని, చైనాతో సరిహద్దు తగాదాని సామరస్యంతో పరిష్కరించాలనే కోరిక భారతదేశానికి లేనట్టే ఇంక నిర్ణయించుకోవాలనీ చెపుతోంది చైనా.

చైనాలో నాయకుల మాటలనే అక్కడి ప్రచారకులు విసుగూ విరామంలేకుండా ప్రచారం చేస్తారు. చైనానాయకులు చెప్పే ధోరణి యీమోస్తరుగావుంది, "మేము సాయుధబలాలు తెచ్చుకున్నాం. మీపెరటి గుమ్మందగ్గర ఆయుధాలు ఎక్కుపెట్టి కూచున్నామే అనుకోండి. కొంతమేర ఆక్రమించుకొని కూడా ఉన్నామనే అనుకోండి. అయినా మీరెందుకు అల్లరిచెయ్యాలి దీని కోసం? మీయిల్లు కాపాడుకోడానికి సరంజామా ఎందుకు తెచ్చుకోవాలి? మమ్మల్ని ఎదిరించడానికి సన్నాహం ఎందుకు చెయ్యాలి? మీరు అలాచేశారుకాబట్టి మీరు యుద్ధప్రేరేపకులు. తగాదాని శాంతిగా పరిష్కరించుకోడానికి మీరుమాతో సంప్రదింపులకు రావాలని మా అభిమతం. దీనికోసం, మీతలమీద గురిపెట్టిఉంచిన తుపాకి సంగతి మీరు పట్టించుకోకూడదు ;" ఈమోస్తరుగా ఉంది.

అకారణంగా పెద్దయెత్తున భారతదేశం మీదికి దాడిచేసిరావటం, పెద్దపెద్దభూభాగాలు ఆక్రమించుకోవటం, ఇప్పుడు మళ్లీ సరిహద్దుల్లో పెద్దసైన్యాల్ని సమీకరించడం, అదిగో పులి! అంటూ పెడబొబ్బలు పెట్టడం, ఇవన్నీచూస్తే ఒక్కటేతోస్తుంది. ఏపాపం ఏరగనట్లునటిస్తూ, సైనికబల సహాయంతో దేశాల ఆక్రమణకి తలపడటం, ఇదంతా కప్పిపుచ్చుకోడానికిచైనావేసినఎత్తు.

ఈవిధంగా మాటాడ్డానికి ఎంత ధీమా ఉండాలి! భారతదేశం యుద్ధానికి సన్నాహాలు చేస్తోందనీ, ప్రజల్లో యుద్ధోద్రేకం వ్యాపింపచేస్తోందనీ చెపుతున్నచైనా, అనేక సంవత్సరాలుగా తనదేశంలో ప్రజల్లో యుద్ధోన్మాదం పురిగొల్పడానికి యుద్ధానికి చేసినదంతా మరచిపోయిందా? యుద్ధసన్నాహాలకోసం అపార ధనం వెచ్చించిన విషయం విస్మరించిందా?

చైనా ప్రజారిపబ్లిక్‌లో రక్షణవ్యయం




1950 లో 202 కోట్లయువాన్‌లు ఉండేది. 1960 కి అది 580 కోట్లకిపెరిగింది, 1955 లో 650 కోట్లయువాన్‌లదాకా ఖర్చుపెట్టింది. యువాన్ అంటే సుమారు రెండురూపాయలకి సమానం. అంటే 1955 లో చైనా రక్షణ కోసం 1300 కోట్లు రూపాయలు ఖర్చుపెట్టిందన్నమాట. భారతదేశం మొదటి పంచవర్ష ప్రణాళిక అయిదేళ్లలోనూ కలిపి రక్షణకు మొత్తం 896 కోట్లుమాత్రం ఖర్చుపెట్టింది. 1951 మొదలు 1960 దాకా దామాషాకి వెయ్యికోట్లరూపాయలు చొప్పున చైనా రక్షణకోసం ఖర్చుపెట్టింది.

చైనా నినాదాలు.

భారతదేశంలో ఈ పదేళ్లలోనూ ఎన్నడూ సాలుకి 257 కోట్ల రూపాయలకన్న రక్షణకోసం ఖర్చుపెట్టలేదు. ఎన్నడూ జాతీయాదాయంలో నూటికి 2 వంతులకు మించలేదు. చైనాలో 1955 లో రక్షణకోసం పెట్టిన ఖర్చు జాతీయాదాయంలో నూటికి 8 వంతులు.

ముందుండు 'ముందడుగు' 'పురోభివృద్ధి' 'అభ్యుదయం' అనే వాటితో తృప్తిపడకుండా, చైనా 1958 లో ఇంకోక్రొత్త నినాదం మొదలు పెట్టింది— 'ముందుకు దూకు' అని (ది గ్రేట్ లీప్ ఫార్వర్డు) 'దేశంలో ప్రతిఒక్కడూ సైనికుడే' అని ఇంకో నినాదం, 1958 ఆగస్టు ఒకటోతేదీని చైనా సైనికదినోత్సవం సందర్భంలో, చైనాప్రజాసైన్యం అనేకచోట్లు పెరిగిందనీ, పీపుల్స్‌డెయిలీ ప్రకటించింది. దేశం దేశం అంతటినీసైనికదేశంగా మార్చివెయ్యటంలో ప్రతి రాష్ట్రం, ప్రతి పట్టణం నిర్ణీత లక్ష్యాలను అందుకున్నాయని అక్టోబరు 10 వ తేదీని నవచైనావార్తాసంస్థ ప్రకటించింది.

చైనాలో దేశవ్యాప్తంగా సైనికబల సమీకరణా, సన్నాహమూ ఏడాదిపైగా ముమ్మరంగా సాగింది. 1960 ఆఖరులో కాబోలు, ఉధృతం కొంత తగ్గింది. అప్పటికి ఈ నినాదాలు దేశంలో మారుమూలలకుకూడా ప్రాకిపోయినాయి, లక్షలాది ప్రజని సైన్యం కోసం సమీకరించారు. సైనికావసరాలకోసమేకాదు, ఆర్థికావసరాలకికూడా వీరిని వినియోగించుకున్నారు, 1960 లో రాజకీయ బోధనకి ఒక ఉద్యమం ప్రారంభమయింది, 'విశ్వసనీయమైన సైనికసమూహాన్ని'

రూపొందించడానికి ఇది తలపెట్టారని, పీపుల్స్ డెయిలీ వివరించింది.

'తత్వశాస్త్రపరిశీలన' అనే పెకింగ్ పత్రిక 1959 జనవరిలో ఇలా వ్రాసింది : 'సైనిక పద్ధతులద్వారా జాతిజాతి అంతటినీ సైనికులుగా మార్చటంలో కొన్ని ప్రయోజనాలున్నాయి. ఉత్కృష్ట రాజకీయ పరిజ్ఞానం, సైనికశిక్షణా కల సైనికవాహిని దేని కోసమైనా సరే ఉపకరిస్తుంది. శాస్త్రపద్ధతి ప్రకారం కార్మికసిబ్బంది వివిధ కార్యక్రమాలకు కేటాయించడానికి వీలుపడుతుంది. ప్రజల్లో క్రమశిక్షణ, త్యాగదీక్ష, సంకల్ప దీక్ష అలవరచడానికి వీలవుతుంది.'

## సైనిక కార్మికబలం

ప్రతి చైనా దేశస్థునీ సైనికునిగా మార్చడానికి ఈ సైనిక సిబ్బంది ఒక్కటే సాధనంగాదు. ప్రతి గ్రామంలోనూ ప్రతి సంఘంలోనూ ప్రజల్ని సైనిక కార్మిక బలంగా సమీకరిస్తున్నారు. తుపాకులు చెట్టు మొదట్లో ఉంచి, ఈ సిబ్బంది పొలాల్లో పనిచేస్తున్నారు. 1950 లో ఒక్క రాష్ట్రంలోనే 36 లక్షల మందిని కార్మిక సైనిక సిబ్బందిలోకి చేర్చుకున్నారు. 1956 జూలై 16 వ తేదీని రెడ్‌ఫ్లాగ్ అనే పత్రిక ఇలా వ్రాసింది. "సైనిక పద్ధతుల ప్రకారం వ్యవసాయ కార్మికబలాన్ని ఏర్పాటు చెయ్యడం ప్రస్తుతం వ్యవసాయంకోసం ప్రకృతిపైన యుద్ధం సాగించడానికే అయినప్పటికీ మరో తరహా యుద్ధానికి కూడా వీరినే సిద్ధపరచడానికి కష్టం ఏమాత్రం ఉండదు.

ప్రజల్లో యుద్ధభావం అనే విత్తనాన్ని నాటిన తరువాత, వారిలో కృతకంగా ఉద్దీపింపచేసిన యుద్ధ తృష్ణను తీర్చడానికి మార్గాంతరం వెతుక్కోవలసిన అగత్యం కలిగిందని కొందరు చైనా గురించి తెలిసినవారు అభిప్రాయపడుతున్నారు. చైనాలో అసలే అంతంత మాత్రంగావున్న సాధన సంపత్తిని సైనిక సన్నాహాలకోసం తరలించి అదిసమర్థించుకోడంకోసం "ఇదిగో సామ్రాజ్యవాదం" "అవిగో అభ్యుదయ నిరోధక శక్తులు" చైనా ప్రజా రిపబ్లిక్ మీద విడుచుకుపడ్డానికి సిద్ధంగా ఉన్నాయి, అంటూ లేనిపోని భయోద్రేకాలు పురిగొల్పసాగారు. ఇవి అట్టే పనిచెయ్యక పోయేసరికి, భారతదేశంపైన "సామ్రాజ్యదేశమనీ, అభ్యుదయ నిరోధక దేశమనీ అపవాదులు ఎందుకు వెయ్యగూడదు ? ఈ దేశంమీదనే ఎందుకు దాడిచెయ్యకూడదు?" అనుకున్నారు.

ఏది ఏమైనప్పటికీ, చైనా తన సైనిక బలాన్ని పదేళ్ళనించి బలపరుచుకుంటున్నదనే మాట వాస్తవం. భారతదేశంమీద జరిగిన దురాక్రమణ చూస్తేనే స్పష్టపడుతోంది, ఎంత పెద్ద యెత్తులో సైనిక సన్నాహాలు చేశారో. ఇప్పుడింక భారతదేశం ఆత్మరక్షణకోసం, ఎట్టయెదుట కనపడుతున్న ఉపద్రవాన్ని అరికట్టడంకోసం చర్యలు తీసుకుంటూవుంటే, యుద్ధానికి సిద్ధమౌతున్నదని నెపాలువేస్తున్నారు. చైనా దురాక్రమణ జరిపి ఉండకపోతే భారత దేశానికి ఇదేమీ అవసరమయ్యేదేకాదు. ప్రశాంత వాతావరణంలో తన సాధన సంపత్తిని అంతటినీ — 1962 అక్టోబరు 20 దాకా ఆర్థికాభివృద్ధికోసమే వినియోగిస్తూ ఉండేది.

భారతదేశం తన రక్షణకృషి గురించి అభూతకల్పనలూ, కుంటిసాకులూ ఏవీ చెప్పడంలేదు. దాపరికమూ, తెరచాటు కుట్రలూ ఏమీలేవు. చైనావారి నమ్మకద్రోహం అనుభవానికి వచ్చింది. తన భూభాగాన్ని చైనా కబళిస్తూవుంటే చేతులు ముడుచుకుని కూర్చో దల్చుకోలేదు. ముఖ్యంగా చెప్పవలసింది ఏమిటంటే, భారతదేశం స్వరక్షణకోసమే కాని దురాక్రమణకోసం సన్నాహాలు చెయ్యటంలేదు. ఎవరి గురించీ ఏ దేశంపట్లా దురాక్రమణ కాంక్ష, దురుద్దేశాలూ భారతదేశానికి ఇప్పుడూ లేవు, ఇదివరలోనూ ఎన్నడూ ఉండవు.

ఆత్మరక్షణకి సిద్ధపడటం, అందుకోసం సన్నాహం చెయ్యటం నేరమే అయితే జాతీయ, అంతర్జాతీయ నీతి నియమాలను ప్రపంచం తారుమారు చేసుకోవాలన్న మాట.

---

(18 వ పేజీ తరువాయి)

ఉండెదవేల నీవిటుల
నూరకచూచుచు నుక్కుగుండునీ
గుండె చలించెనే ? రిపులు
కోట్లల మానిన, వీడినారె భూ
ఖండము లాక్రమించినవి ?
కమ్మని మాటల నొప్పగింతురే ?
ఖండనమందు పెంపెసగి
ప్రక్కలు ప్రక్కలుసేయకుండినన్?

కాలముదప్పి శాత్రవనికాయము
పైబడెనేని జెండుమా
ఆలమునందు సుంత వెనుకంజను
వేయక; బొందిలోని ప్రా
ణాలను ధారవోసి యలనాడు
యశోలత పెంపుసేయడే
బాలుడు బాలచంద్రుడు
సపత్నుల మాంసపురొంపిలోపలన్

పలయ మంగళమ్ముగ,బిగియింపుమనా!
కటిబంధమింక : నీ
కేలవృథానుమానము ?
జయించెదవీవ విరోధివాహినీ
జాలము భారతధ్వజ
మజాండమునన్ తలనెత్తనిమ్ము జే
జేలు నదింప శాత్రవ
విజేతకు నుత్పలమాల వైచెదన్.

# భారతా !

టి. యన్. సి. వెంకట వరదాచార్యులు

జననికి జ్యేష్ఠ పుత్రుఁడగు
జవ్వారు యోధుఁడు శాంతశీలుఁడై
వినుఁడని చెప్పుచున్న, నవివేక
గుణంబునఁ గాలు ద్రవ్వు దు
ర్జనుల సహింతువో ! తగిన
శక్తిని వెన్కకు నెట్టఁ జూతువో !
కను మతిదీర్ఘదర్శివయి
కాలగతిన్ దలయెత్తి భారతా !

కనకనలాడు చిచ్చువలెఁ
గాలమువచ్చి హఠాత్తుగాఁ బడెన్
దనువున జీవముల్ కలుగుదాక
సహించి త్యజించి నిల్చుటో
ఘనమగు కీర్తిఁ బోఁదుడిచి
కత్తినిబట్టిన చేత మ్రొక్కుటో
మన యెదకాని నిల్చె ; తగు
మార్గముఁ జూడఁగదయ్య భారతా !

దండిగ సైన్యముల్ పెనిచి,
దక్షిణ గోగ్రహణమ్ము సేయఁగా
నుండిరి వైరు లుగ్రముగ -
నుత్తర గోగ్రహణమ్ము సేయఁగా
దుండగులై మహోగ్రముగ
దూకిరి చైనులు హద్దుమీఱి, భీ
ముండు కిరీటివై నిలిచి
పూర్వులఖ్యాతిని నిల్పు భారతా !

కోరఁగరాని కోరికలఁ గోరుచు
నిద్దరు రెండు దిక్కులన్
బోరొనరింప సేనలను వ్యూహము
దీర్చుటఁ దేటి చూడవా ?
కూరుకు చుంటివా ? కుడిచి
కూరుచు నుండుట వీరధర్మమా ?
భారము నీదిరా ! భరత పౌర
కుమార ! బిరానలేవరా !

పిడుగయి రామబాణమయి
భీముని భీషణ ముష్టిఘాతమై
మృడుని త్రినేత్రమై కదిసి
మృత్యువు శత్రుల మ్రింగుదాక, నీ
మెడమను ద్రిప్పకోయి ! మితి
మీఱిన నున్నది ధర్మరక్ష, నీ
యిడుముల కెందు ముందుఁ
జవియించని కీర్తిపథంబు భారతా !

హృదయములేని జాతులకు
హృత్కువిశంబయి నిల్చి వెల్గరా !
చెదరనిబుద్ధినీది, స్థిరచిత్తుఁడ
వీవు, జగాన దేనికిన్
బెదరని గుండెనీది తనువే
మదినెంచని జాతినీది, నీ
కెదురయి యెవ్వఁడోపు
జగదేక బలాఢ్య గుణాఢ్య భారతా !

చూపఁగదయ్యా నీ తెగువ,
చూపరులెల్లరు చోద్యమందఁగా
నీపగ దాయ గుండియలు
నీఱయి పొంఱఁగ శౌర్యధైర్యముల్
చూపిన తీరుమెచ్చి కవి
లోకము నింపుగ పద్య గద్యముల్
నీపయి వ్రాయ, వైరితతి
నిందల పాలయిపోవ భారతా!

పగిలి యుసుళ్ళపుట్టవలెఁ
బర్వత పంక్తుల దాటి భూమిపై
దిగి చెలరేగి మత్తులయి
తిందుము మిమ్మని వచ్చినారదే!
పగతురు, నిద్రమేల్కొని
శుభమ్మని యూదర శంఖరాజమున్
దిగుదురు కొండకావలను
దియ్యనిమాటలఁ బోరు, భారతా!

చీమల బారులట్లు మనసీమలఁ
గాలిడె, చైన సైన్యముల్
పాములు చేరఁబుట్టల
నపారముగా నిఁకఁ బెట్టు నిప్పుడే
చీమలబారులన్ దుడిచి
చ్ఛిందర వందరచేసి వైవఁగా
స్తోమతఁ గూర్పరా! మిగుల
శూరతఁ జూపర వీర భారతా!

ఆశను జంపలేవ, మన
హక్కులఁ జిక్కులఁ దీర్పఁ బూనవా,
దేశము నీదికాద? పర
దేశజులేలఁగఁ గంటఁ జూతువా,
దేశము దేశనాయకులు
దిగ్భ్రమఁ జెందుటఁగాంచి యోర్తువా,
దేశము శాంతి గూర్పఁగను
దీక్ష వహించర వీర భారతా!

---

(31 వ పేజీ తరువాయి)

తటపటాయించింది. అయితే తరువాత బౌద్ధ మతావలంబికురాలైంది. బుద్ధుని శిష్యురాండ్రలో ఈమె మొట్టమొదటిది. మల్లిక అను ఒక రాజ్ఞి తన భర్తకు నచ్చజెప్పి బౌద్ధ ధర్మాలను బోధించి అనేకమందిని బౌద్ధ మతం స్వీకరింప జేసింది. సుప్రియ అను ఆమె పరమ భక్తురాలు. రోగపీడితుడైన ఒక సన్యాసికి మాంసంతో చేసిన వంటకం అవసరమైనపుడు అది అంగడిలో లభించకపోవడంవల్ల ఆమె తన తొడలో నురిచి మాంసంను కోసి పెట్టింది. సుమన, సుభద్ర అను స్త్రీలు కడుంగడు సత్ప్రవర్తకులు. బుద్ధునియందు అచంచలమైన విశ్వాసం గలవారు. ఈవిధంగా స్త్రీలు బుద్ధుని కాలంలో బౌద్ధమత వ్యాప్తికై ప్రముఖ పాత్ర వహించారు.

మానవమాత్రుడైన గౌతముడే బుద్ధుడైనాడు. జ్ఞానోదయం పొందిన తరువాత నిర్వాణ ప్రశాంతి, సౌఖ్యాలకు మార్గం చూపించాడు. వాంఛలు నిర్మూలమైన ఫలితంగా సహజ సిద్ధంగా ఏర్పడు స్థాయి నిర్వాణ మని బుద్ధుడు బోధించాడు. అర్హతవుండడం బౌద్ధమత లక్ష్యం. నిర్వాణం పొందిన వ్యక్తి అర్హత సంపాదిస్తాడు. మంచి ఆరోగ్యం అమూల్యమైన వస్తువు. శాంతి అనేది ఉత్కృష్టమైన సంపద. విశ్వాసం పరమ ఆప్తమిత్రుని వంటిది. నిర్వాణం సర్వోత్కృష్ట మైనది.

బుద్ధుడు ఒక గొప్ప మార్గదర్శి. ప్రతిభావంతుడైన తత్వవేత్త. ఆయన బోధనలు పరమోత్కృష్ట మైనవి. ఆత్మ తేజస్సును ప్రకాశింపజేయు నట్టివి. ఆయన హితబోధలు "అంధకారంలో దీపం" వంటివి.

# అష్టాంగ పథం

*యస్. బి. చౌదరి*

*'వైశాఖి' లేక వైశాఖ పూర్ణిమ - బుద్ధుడు జన్మించిన పవిత్ర దినం. ఆయన జ్ఞానోదయం పొందినదీ, మహాపరి నిర్వాణం పొందినదీ ఈ రోజునే.*

బోధిని పొందినవాడు బుద్ధుడు. బోధి అంటే జ్ఞానం అన్న మాట. జ్ఞానోదయం కలిగినవాడని అర్థం. భారతావనిలో బుద్ధగయవద్ద బోధివృక్షం క్రింద జ్ఞానోదయం కలిగిన పిమ్మట గౌతమ ఋషి కీర్తి ప్రతిష్ఠలు పొందాడు. ఆయన స్వయం పరిపూర్ణం పొందిన మహనీయుడు. ఆయన జ్ఞానప్రసాదంవల్ల బౌద్ధమత చరిత్ర ఆరంభమైంది.

తనకేగాక సృష్టిలోని సకల చరాచరములకూ జ్ఞానోదయం కలగజేయడమే బౌద్ధ మతంయొక్క ఉద్దేశం. బుద్ధుడు ప్రపంచ దృష్టిని ఆకర్షించాడు. ఆయన బోధించిన నీతి సూత్రములు అతి త్వరగా సర్వత్రా వ్యాపించినాయి. నేటి మన పీడిత ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్ని పరిష్కరించడానికి ఆయన సందేశం సహాయపడగలదు. గాంధీద్వారా బుద్ధుడు నిత్యమైన సత్యాహింస ధర్మాలను ప్రబోధించి, దేశ దాస్య శృంఖలాలను ఛేదించడంలో లక్షలాది ప్రజలను విజయవంతంగా ముందుకు నడిపించాడు.

## నాలుగు సత్యాలు

పాపాలు చేయకుండుట, సన్మార్గంలో ప్రవర్తించుట, హృదయాన్ని నిర్మలత్వము గావించుట అనేవి బౌద్ధమతపు ప్రధాన ప్రబోధకాలు. ఆయన మహోదాత్తమైన నాల్గు సత్యాలను చాటించాడు. అవి యివి :—

1. జీవితాన్ని ఆవరించివున్న వ్యసనములు.
2. స్వార్థంవల్లనే వ్యసనం కలుగుతున్నది.
3. స్వార్థానికి మూలమైన కారణాన్ని తొలగించవచ్చు.
4. వాంఛల నిర్మూలనకు మార్గములు.

ఆయన చూపిన మార్గాలే అష్టాంగపథముగా వ్యవహరించబడుతున్నవి. అవి :— సరిగా అర్థం చేసుకోవడం, సరిగా ఆలోచన చేయటం లేక ఆశించటం, సరిగా మాట్లాడటం, సత్ప్రవర్తన కలిగి యుండటం, సన్మార్గములద్వారా జీవనోపాధి సంపాదించటం, సత్క్రమ మార్గంలో పాటుపడటం, సరిగా జాగరూకతతో ప్రవర్తించటం, సరియైన ధ్యానం చేయటం. ఈ అష్టాంగపథంలో అత్యున్నత స్థాయిని అందుకోవడంలో కృతకృత్యుడైన వ్యక్తిని, అతని చిరకాల వాంఛిత గమ్యస్థానంనుంచి, కాలం మాత్రమే వేరుపరుస్తుంది. పురోగమన పథంలో పరిపూర్ణత్వం క్రమక్రమంగా మాత్రమే పొందడం జరిగినప్పటికీ, ఈ అష్టాంగ మార్గములను ఏకకాలంలోనే అభ్యాసం చేయాలి.

ప్రతి వ్యక్తీ తన గతికి తానే కర్త. పాప కర్మాన్ని తొలగించుకోవడానికి బౌద్ధమతం సూచించిన ప్రబోధాలు ఇవి :—

(1) చంపవద్దు (2) దొంగతనం చేయవద్దు (3) లైంగిక సుఖాలపై మనస్సు పోనివ్వవద్దు (4) అసత్యం పలుకవద్దు (5) మత్తుపదార్థములు తీసుకోవద్దు. ఇతరులను రక్షించడం ద్వారా తన్ను తాను కాపాడుకోవడమే బౌద్ధమతంలోని ముఖ్యోద్దేశ్యం. ఇది విశ్వాని కంతటికీ వర్తించే శుభ సందేశం, "గౌతముడు అగ్రగణ్యుడైన హిందువు" అని గాంధీ అన్నారు. అహింస, ముక్తి అను హిందూ ధర్మాలను బుద్ధుడు బోధించాడు. అంటే హిందూ మతాన్ని ఆయన పరిశుద్ధం చేశాడన్నమాట.

బుద్ధుని నిర్యాణానంతరం ఆయన చేసిన ప్రబోధాలకు ఒక కొత్త రూపం కలిపించ

బడింది. హిందూ మతానికి భిన్నంగా ఒక కొత్త మతం ఏర్పడింది. బుద్ధుణ్ణి ఆయన జీవితకాలంలోనూ, ఆ తరువాతా హిందూ ఋషిగానూ, అవతార పురుషునిగాను భావించేవారు. అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించి ప్రేమ, మైత్రి, అహింసా సందేశాన్ని అన్ని పద్ధతులద్వారా ప్రచారం చేశాడు.

బుద్ధుడు మనిషినీ, మనిషినీ వేరుచేసే అడ్డంకులను నిర్మూలించాడు. ఆయన శిష్యులలో ప్రముఖులైనవారు కొంతమంది కనిష్ఠ జాతులనుంచి వచ్చినవారే. పాకీపని చేసే ధీరుడైన సుమిత్రుణ్ణి బుద్ధుడు స్వయంగా తన శిష్యకోటిలో చేర్చుకొన్నాడు. ఈయన ఋషి ఐనాడు. దోపిడిదొంగా, హంతకుడూ ఐన అంగులిమాల బౌద్ధమతాన్ని స్వీకరించి, దయార్ద్రహృదయుడైన ఋషిగా మారాడు. వేశ్య అయిన అంబపాలి బౌద్ధమతాన్ని స్వీకరించి అర్హతాధికారం పొందింది. పున్న అను దాస్య కన్యా, జింకలుపట్టే వాని కూతురు కాపయోగినులయ్యారు. ఇతరులను ద్వేషించి, నీచంగా చూచేవాడు మాత్రమే సంఘ బహిష్కారము చేయబడిన వాడని బుద్ధుడు చెప్పాడు. సామాన్య మానవునిపట్ల ఆయనకు గల ప్రేమ అపారమైనది.

## నాలుగు వర్గాలు

బౌద్ధమతం మనోభావానికన్నా బుద్ధిని ఆకర్షిస్తుంది. నీతి, సమాధి, జ్ఞానం అనే ఈ మూడు ధర్మాలు బుద్ధుడు బోధించిన వాటిలో మూల స్తంభాల వంటివి. ఉపనిషత్తులు కూడా వీటినే ప్రబోధిస్తున్నాయి. బుద్ధుడు ప్రజల్ని నాలుగు వర్గాలుగా విభజించాడు :—

1. అంధకారం నుంచి అంధకారానికి పోయేవారు.
2. అంధకారంనుంచి ప్రకాశంలోకి వెళ్ళేవారు.
3. ప్రకాశంనుంచి అంధకారంలోకి వెళ్ళేవారు.
4. ప్రకాశంనుంచి ప్రకాశంలోకి వెళ్ళేవారు.

మొదటి వర్గానికి చెందినవారిలో అనారోగ్యానికీ, ఇతర దురదృష్టాలకూ గురిఐన నిరుపేద కుటుంబీకులు చేరి వుంటారు. బౌద్ధమత సూత్రాలు వారి ప్రక్కయింటి వారు పాటించినప్పటికీ, వాటిపట్ల ఈ అభాగ్యులకు శ్రద్ధకానీ ఆసక్తికానీ వుండదు. రెండవ వర్గానికి చెందినవారు మొదటి వర్గానికి చెందినవారి వలెనే మొదట నిర్భాగ్య కుటుంబంలో జన్మించినవారే. అయితే వారు బౌద్ధ ధర్మ ప్రబోధితాలను శ్రద్ధతో వింటారు. వారికి బుద్ధునిలో విశ్వాసం ఏర్పడుతుంది. మనోవాక్కాయ కర్మలతో స్వచ్ఛందంగా సన్మార్గ ప్రవర్తకులవుతారు. ఉన్నత కుటుంబానికి చెందిన వారు మూడవ వర్గం క్రిందికి వస్తారు. వీరు ఆగర్భ శ్రీమంతులు. జీవితంలో అనుభవించవలసినవన్నీ వీరికి అందుబాటులో వుంటాయి. "రేపటికి బ్రతుకుతామో లేదో గనక ఇప్పుడు బాగా తినాలి; త్రాగాలి; కులాసాగా గడపాలి'' అనే పద్ధతిలో వీరు వుంటారు. కులాసాగా, హాయిగా జీవితం గడుస్తూ వుంటుంది గనుక వారికి బుద్ధుని ధర్మోపదేశాలు విని ఆ ప్రకారం ఆచరించాలనే సావకాశం లేదు. పూర్వజన్మ ప్రారబ్ధ విశేషాలచేత ఈ జన్మలో మంచి కర్మను సంపాదించుకొని, అమూల్యమైన మానవ జీవితాన్ని చేతులారా పాడుచేసుకొంటారు. ఇలాంటివారు ప్రకాశంలోనుంచి అంధకారానికి వెళ్ళుతారు. ప్రకాశంనుంచి ప్రకాశంలోకి వెళ్ళేవారు నాల్గవ వర్గానికి చెందుతారు. వీరు కులీనుల కుటుంబంలో జన్మించిన అదృష్టవంతులు, సిరిసంపదలతో తులతూగుతూ, ఆయురారోగ్యాలతోనూ సకల సౌఖ్యాలతోనూ వర్ధిల్లుతూ వుంటారు. మంచి హితబోధనలను ఆలకిస్తారు. ధర్మంపట్ల శ్రద్ధాసక్తులు చూపుతూ, మనోవాక్కాయ కర్మలతో దానిని ఆచరిస్తారు.

## శిష్యురాండ్రు

బౌద్ధమత వ్యాప్తికి స్త్రీలు పాటుపడినారని నాగార్జున కొండ త్రవ్వకాలలో వెలికి తీయబడ్డ వాటిని పట్టి తెలుస్తున్నది. ఋషిత్వం పొందడానికి స్త్రీ పురుష బేధాలు అడ్డురావు. "విషయ సుఖ వాంఛలకు మించిన బలవత్తరమైన కోరికలు ఏవీ లేవు" అని బుద్ధుడు చెప్పాడు. కనుక స్త్రీల పట్ల బౌద్ధుల దృక్పథం ఇది : ''ఆమె వృద్ధాంగనయా ? అయితే ఆమెను నీ మాతృ దేవతగా తలంచుము. ఆమెకు వినయ విధేయతలు వున్నాయా ? అయితే ఆమెను నీ సహోదరిగా భావించుము. ఆమె పసిపిల్లా ? అయితే ఆమెపట్ల గౌరవ మర్యాదలతో ప్రవర్తించుము.''

ఒకానొక సందర్భంలో బుద్ధుడు కోసల రాజుతో సంభాషిస్తూ వుండగా ఒక వార్తాహరుడు వచ్చి రాజుకు ఒక పుత్రిక జన్మించినదని చెప్పాడు. ఇది విని రాజు అసంతృప్తిపడ్డాడు. అప్పుడు బుద్ధుడు రాజును ఓదారుస్తూ ఇలా చెప్పాడు : —

"ఓ నృపాలకా ! స్త్రీ శిశువు పురుష సంతానానికంటే ఉత్తమమైనదని ఋజువు చేయవచ్చు."

బింబిసార మహారాజు సహధర్మచారిణి ఖేమ అను ఆమె బుద్ధుని శిష్యకోటిలో చేరిన వారిలో ప్రప్రథమురాలు. మొదట ఆమె

(మిగతా 29 వ పేజీలో)

# ప్రశ్నోత్తరావళి

*శ్రీ వై. యస్. నరసింహారావు, శ్రీకాకుళం.*

ప్రశ్న : యస్. యస్. యల్., సి. రిజిష్టర్ నుంచి కులాన్ని తెల్పాలనే విషయాన్ని తీసివేయాలని ప్రభుత్వం యోచిస్తున్నదా?

జ : విద్యాశాఖకు సంబంధించిన రిజిష్టర్లలోనూ, ఫారాలలోనూ ఇకముందు కులాలను ఉదహరించాల్సిన అవసరం లేదనీ, తమ అధ్వర్యంలోని వివిధ విద్యా సంస్థలు, ఇతర సంస్థలు దిగువ విధంగా రిజిష్టర్లనూ, ఫారాలను రూపొందించుకోవాల్సిందిగా ఆదేశించాలనీ విద్యాశాఖ అధీనంలోని శాఖలన్నింటిని 1962 సెప్టెంబరు 29వ తేదీన విద్యాశాఖ జారీచేసిన జి. ఒ. యం. యస్. నెం. 2955 ఉత్తరువులో ప్రభుత్వం పేర్కొన్నది.

(అ) జాతీయత

(ఆ) మతం

(ఇ) షెడ్యూలు కులం/షెడ్యూలు జాతి.

యస్. యస్. యల్. సి రిజిష్టర్లను క్రొత్తవి సరఫరా చేయాల్సిందిగా హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రింటింగ్ ప్రెస్ డైరెక్టరును కోరినట్టు హైద్రాబాదులోని సెకండరీ విద్యాబోర్డు కార్యదర్శి యీ కార్యాలయానికి తెలియజేశారు. సర్టిఫికెట్లు బైండింగ్ దశలో ఉన్నాయి. ఇకముందు ఇండెంటుచేసే సందర్భంలో యస్. యస్. యల్. సి. రిజిష్టరు స్పెసిమెన్ కాపీలలోని జాతీయత, మతం, కులం మొదలైనవాటిని 1962 సెప్టెంబరు 29వ తేదీన విద్యాశాఖ జారీ చేసిన జి. ఒ. యం. యస్. నెం. 2955 లో నిర్దేశించిన విధంగా మార్చడం జరుగుతుందనికూడా తెలిసింది.

ప్ర : రాష్ట్రంలో విద్యార్థుల సహకార సంఘాలు ఎన్ని ఉన్నాయి? అవి ఏవిధంగా పనిచేస్తున్నాయి?

జ : న్యూఢిల్లీలోని భారతప్రభుత్వ సమాజ వికాసం, సహకార మంత్రిత్వ శాఖ రూపొందించిన పథకానికి అనుగుణంగా రాష్ట్రంలో తమతమ పాఠశాలలలో వినియోగదారుల - సహకార సంఘాలను ఏర్పాటు చేయాలని ఇన్స్పెక్టింగ్ అధికారులద్వారా విద్యాసంస్థల అధిపతులందరికీ ఆదేశాలు జారీచేయడం జరిగింది. ఇంతవరకు ఖచ్చితంగా ఎన్ని పాఠశాలలు సహకార సంఘాలను నిర్వహిస్తున్నదీ వివరాలు అందుబాటులో లేవు. యీ విషయంలో హైద్రాబాదులోని సహకార సంఘాల రిజిష్ట్రార్‌కు వ్రాయవచ్చు.

*శ్రీ రామరాజు శివరామయ్య, పెదకొదమగుండ్ల, గుంటూరు జిల్లా.*

ప్ర : నాగార్జునసాగర్ కుడి కాలువకు ఎప్పుడు నీరు విడుస్తారు? అత్యవసర పరిస్థితిదృష్ట్యా అతి త్వరగా నీరు ఇస్తారా? ఎంతవరకు ఏ యే గ్రామాలకు నీరు ఇస్తారు? రామాపురం కాలువద్వారా ఎన్ని ఎకరాల భూమికి లాభిస్తుంది?

జ : మూడవ ప్రణాళిక ఆఖరుకు(1965_66) నాగార్జునసాగర్ కుడి కాలువకు నీరు విడువాలని ప్రతిపాదించారు. అత్యవసర పరిస్థితిదృష్ట్యా నీటి పారుదల వసరులను అతిత్వరగా ఉపయోగంలోకి తేవడానికి అన్ని విధాల కృషి చేయడం జరుగుతున్నది. అయితే మూడవ ప్రణాళిక ఆఖరుకన్నా ముందుగానే నాగార్జున సాగర్ కుడికాలువకు నీరు విడువడం సాధ్యం కాకపోవచ్చు. మూడవ ప్రణాళికలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికై ప్రస్తుతం కేటాయించిన రు. 50 కోట్లతో యీ ప్రణాళిక ఆఖరువరకు కుడికాలువ 7వ బ్లాకువరకు మాత్రమే నీరు విడువడం సాధ్యమవుతుంది. పల్నాడు తాలూకా, సత్తెనపల్లి తాలూకాలోని కొంతభాగం పై ప్రాంతంలో ఉన్నాయి. ఉత్తర విజయపురిలోని నాగార్జునసాగర్ కెనాల్ సర్కిల్ సూపరింటెండింగ్ ఇంజనీరునుంచి ఇతర వివరాలను పొందవచ్చు.

నాగార్జునసాగర్ కుడి కాలువక్రింద 5వ బ్లాకులోని రామాపురం మేజర్ క్రింద దాదాపు 8854 ఎకరాల భూమి తరీగా మార్చాలని ప్రతిపాదించారు.

*శ్రీ సి హెచ్. పరిసినాయుడు, రేపటివలస, బొబ్బిలి తాలూకా, శ్రీకాకుళం జిల్లా.*

ప్ర : మా గ్రామంలోని దాదాపు అన్ని గృహాలకు, బావులకు విద్యుచ్ఛక్తి అవసరం వుంది. విద్యుచ్ఛక్తిని పొందాలంటే మేము యేమి చేయాలి?

జ : విద్యుచ్ఛక్తి కావలసిన వినియోగదారులు గృహ, పారిశ్రామిక, వ్యవసాయ అవ

సరాలకు వలసిన లోడ్‌ను తెల్పుతూ విశాఖపట్నంలోని ఆపరేషనల్ సర్కిల్ సూపరింటెండింగ్ ఇంజనీరు (పి. బి. నెం. 58) కు దరఖాస్తు పంపాలి. ఆయన విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే అవకాశాలనుగూర్చి తగిన పరిశీలనలు జరుపుతారు. అవసరమైన అంచనాలను సిద్ధం చేసి మంజూరీకై పై అధికారులకు పంపుతారు.

విద్యుచ్ఛక్తి విస్తరణ లేక ఇతర విధాల సరఫరాచేసే అవకాశాల పరిశీలనలో సాంకేతిక విషయాలకుతోడు విద్యుచ్ఛక్తి లోడు అవసరమైన పెట్టుబడి ధనంలో 10 శాతం వార్షిక రెవిన్యూ లభిస్తుందా అనే విషయంపైకూడా యీ సమస్య ఆధారపడి ఉంటుంది.

గ్రామస్థులు, దరఖాస్తులో దీనికి సంబంధించిన నిర్ణీతఫారాలను ఉచితంగా పై తెల్పిన కార్యాలయంనుంచి పొందవచ్చు. మూడవ ప్రణాళికక్రింద గ్రామీణ విద్యుచ్ఛక్తి పథకంక్రింద తగిన మొత్తాలని కేటాయించని కారణంగా గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే పథకాల అమలు విషయంలో విద్యుచ్ఛక్తి బోర్డు కొన్ని నిర్బంధాలను విధించింది. విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే పనికి అయ్యే మొత్తం ఖర్చును విద్యుచ్ఛక్తి వినియోగదారులు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విద్యుచ్ఛక్తి బోర్డుకు రుణంగా ఇస్తే ప్రాధాన్యం ఇచ్చే ప్రాతిపదిక పై మంజూరు అయిన పథకాన్ని అమలు చేయడం జరుగుతుంది. సరఫరా చేసిన తేదీ నుంచి 5 సంవత్సరాల తర్వాత యీ రుణాన్ని తిరిగి చెల్లించడం జరుగుతుంది. సంవత్సరానికి 3 శాతం వడ్డీ కూడా ఇవ్వబడుతుంది.

---

(34 వ పేజీ తరువాయి)

చైనాలో వేలాది విద్యార్థులు చదివే ఒకానొక పుస్తకంలో ఉన్నది ఈ పటం పరుల ప్రాంతాలపట్ల పెకింగ్ ప్రభువులకి గల దురాశ ఎలాంటిదో దీనినిబట్టి గ్రహించవచ్చు. ఆసియాలో స్వతంత్రదేశాలన్నిటికీ ఇది కనువిప్పు కావాలి. ఎన్నడో క్రీస్తుకు పూర్వం రెండువందల సంవత్సరాలకు ముందే హాన్ చక్రవర్తుల కాలంలోనే ప్రారంభమయింది, మరల ప్రారంభమయింది; పరుల ప్రాంతాలను చైనా స్వాహా చేయడం. ఎన్నో పరాయి ప్రాంతాలను చైనాలో అంతర్భాగంగా చూపే ఈ దేశపటం ఉన్న పుస్తకంలో ఒకచోట మావ్ సేటుంగ్ మహాశయులు సెలవిచ్చిన వాక్యరత్నాలు కొన్ని ఉదహరించారు. యుద్ధంలో చైనాను ఓడించి సామ్రాజ్యవాద దేశాలవారు చైనాలో కొన్ని ప్రాంతాలను చైనా శోషణలో ఉన్న కొన్ని దేశాలనూ ఆక్రమించారు. కొరియా, తాయవాన్, క్యూరు దీవులు, పెస్కడోరిస్, పోర్ట్ ఆర్థర్ ప్రాంతాలను జపాన్ కైవసం చేసుకుంది. బర్మా, భూటాన్, నేపాల్, హాంకాంగ్‌లను ఇంగ్లండు వశపరచుకుంది, అస్సాంను స్వాధీనపరచుకుంది ఫ్రాన్స్. ఆఖరికి అసామకమయిన పోర్చుగల్ వంటి దేశం 'మకాహా' ని భుక్తం చేసుకుంది. అని ఆక్రోశం వెలిబుచ్చారు ఆయనగారు.

కనుక అదీ సంగతి. ఈ దేశ పటాన్ని చైనా ప్రభువులు ఆమోదించలేదు, అని నవ చైనా వార్తా సంస్థ వ్యాఖ్యానించవచ్చు గాక. మావ్ సేటుంగ్ మహాశయుని ఆలోచనలూ ఆశలూ ఏవిధంగా ఉన్నాయో ఈ పటాన్ని బట్టి గ్రహించవచ్చు. ★

"సుధాకర్ భట్"

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1963 ఫిబ్రవరిలో తెలంగాణాలో దిగువ తెల్పిన 7 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు :

(1) చెల్లాపురం ( సిద్ధిపేట తాలుకా )
(2) ఇరుకోడే ( సిద్ధిపేట తాలుకా )
(3) నాగులపల్లి (మెదకు తాలుకా)
(4) దుంపలపల్లి (సిద్ధిపేట తాలుకా)
(5) దత్తాయపల్లి (భోనగిరి తాలుకా)
(6) నర్సాపూర్ (భోనగిరి తాలుకా)
(7) రెంటచింతల భోనగిరి తాలుకా)

# చైనా చేస్తున్న దేశపటాల గారడీ

పెకింగ్ ప్రభువులు ఏపని చేసినా అందులో ఒక ప్రత్యేకత గోచరిస్తుంది. పరుల ప్రాంతాలను స్వాహా చేయడంలో మరీను. వారు ఏ ప్రాంతాన్నయితే భుక్తం చేసుకోవాలని అనుకుంటారో అది చైనాలో భాగంగానే చూపిస్తూ దేశపటాన్ని ప్రచురిస్తారు. ఇదీ వారు ముందు చేసే పని.

సుమారు పది సంవత్సరాల క్రితం అంటే చైనా ప్రధాన భూభాగంలో మావ్‌సేటుంగ్ అధ్యక్షులవారూ వారి అనుచరులూ అధికారంలోకి వచ్చిన మూడు సంవత్సరాలు గడిచాక అన్నమాట — పెకింగ్ ప్రభువులు ఒక దేశ పటాన్ని ప్రచురించారు. కేవలం సరిహద్దు ప్రదేశాలనే కాక కొన్ని ఇతర దేశాలను మొత్తం మొత్తంగానే చైనా మహా సామ్రాజ్యంలో చేర్చి చూపించారు ఈ పటంలో. ఈ పటం అంటూ గడిచిన పదేళ్ళుగా ప్రచారంలో ఉన్నట్టు తెలియడంలో అనేక ఆసియా దేశాలలో ఇటీవల కొన్ని వారాలుగా అలజడి బయలుదేరింది. ఇది ఏనాడో చింగ్‌మింగ్, ఇంకా ఇతర వంశాల చక్రవర్తులు గానీ కూమింగ్‌టాంగ్ హయాంలో కానీ తయారయిన దేశపటం కాదు సుమండీ. కేవలం ఒక దశాబ్దానికి ముందు తయారయినది మాత్రమే.

'నవచైనా సంక్షిప్త చరిత్ర' అనే పేరిట 1953 లో పెకింగ్ నుంచి వెలువడిన ఒకానొక పుస్తకంలో ఉంది ఈ దేశపటం. ఆసియా ఖండంలోని సోవియట్ రిపబ్లిక్ అయిన కజగిస్థాన్ కిర్గిస్తాన్ తాజకిస్తాన్‌లు మూడుకూడా చైనాలో అంతర్భాగాలుగానే చూపారు, దీనిలో. ఈ మూడు ప్రాంతాలనూ 1864 వ సంవత్సరంలో రష్యన్లు తమవద్ద నుంచి వశపరుచుకున్నట్టు పేర్కొన్నారు కూడా. అంతటితో ఆగారా. ఉహు. నేపాల్, సిక్కిం, భూటాన్, అస్సాం, బర్మా, మలయా, థాయ్‌లాండ్, ఉత్తర వియత్నాం, దక్షిణ వియత్నాం, లావోస్, కంబోడియా, ఫిలిప్పీన్ ద్వీప సముదాయంలోని సులు దీవులూ ఇవన్నీ కూడా చైనాలో అంతర్భాగాలుగానే చూపారు ఈ దేశపటంలో.

పది సంవత్సరాలనుంచీ దారుణమయిన ఈ పటం పెకింగ్‌లో అచ్చుఅయిన పాఠ్య పుస్తకంలో ఉంటున్నట్లు తెలుసుకొని ఆయా ఆసియా దేశాలలో అలజడి బయలుదేరడంతో పెకింగ్ రేడియో నవచైనా వార్తా సంస్థ కూడా సంజాయిషీ చెప్పుకున్నాయి. ఈ సంజాయిషీ కూడా ఎంతో అపురూపమయినది సుమండీ. ఈ దేశపటాన్ని దానిని పొందుపరిచిన పుస్తకాన్నీ కూడా ఒకానొక ప్రయివేటు పుస్తకాల షాపు ప్రచురించిందిట. పెకింగ్ రేడియో నవచైనా వార్తా సంస్థకూడా చైనా ప్రభుత్వ శాఖలే నన్న సంగతి ఇక్కడ మనం గుర్తు ఉంచుకోవలసి ఉంటుంది. చైనాలో ప్రయివేటు పుస్తకాల షాపులంటూ అసలు ఉన్నాయనీ పుస్తకాలూ, దేశ పటాలూ ప్రచురించే అధికారం వాటికి ఉన్నదనీ పెకింగ్ ప్రచార సాధనాల ద్వారా వెల్లడి కావడం ఇదే మొదటి సారి.

నవచైనా వార్తాసంస్థ మొన్న మార్చి తొమ్మిదవ తారీఖున ఒక ప్రకటన విడుదల చేస్తూ పెకింగ్‌లోని ఒకానొక ప్రయివేటు పుస్తకాల షాపువారు ప్రచురించిన ఈ దేశ పటాన్ని చైనా పాలకులు ఆమోదించలేదు అని తెలియచేసింది. ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. ఈ పటాన్ని చైనా పాలకులు ఆమోదించలేదు అని చెప్పారే తప్ప దానిని వారు స్పష్టంగా తిరస్కరించారన్న మాట ఎక్కడా లేదు. ఈ పటాన్ని ఇంతవరకు ఆమోదించక పోయినంత మాత్రాన పెకింగ్ ప్రభువులకి వచ్చిన నష్టం ఏముందిలెండి. సమయం వచ్చినప్పుడు వారు ఎటూ అంతపని చేస్తారు. ఆ సమయం ఎప్పుడు వస్తుంది అంటారా — కాలం నాడు చింగ్, మింగ్ చక్రవర్తులు పరిపాలించిన సామ్రాజ్యాన్ని పునః స్థాపించాలన్న తమ స్వప్నాలు ఫలించేందుకు తగిన తరుణం వచ్చిందని చైనా పాలకులకి తోచినప్పుడు. ఈ పటాన్ని కాదనలేదు వారు. ఇంతవరకు అదే కావలసింది. అదే ముఖ్యం కూడాను.

(మిగతా 33 వ పేజీలో)

# ఏరినముత్యాలు

కోనలు దరికొను పావకుఁ
డైన ప్రభంజనుఁడు మిత్రుఁ డల్పత దీపం
బైన శిఖ నార్చుఁ గావున
హీనుం డగువాని కెందు నెక్కడిమిత్రుల్.

డెందమునఁ దెలిసియును జే
యం డెంపరిగాక యుండునాతని తలపో
తం దీరునె యవకార్యము
మందెఱిఁగినమాత్ర తెవులు మానుట గలదే.

ఉత్సాహప్రభుమంత్ర శక్తుల
నజేయుండై పరిక్షీణసం
ధిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహముచే
దేశంబు గాలంబు సం
పత్సామగ్ర్యముఁజూచి కార్యము
దెసన్ బ్రారంభియైభూప్రజన్
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైనపతి
శశ్వచ్ఛ్రీసమేతుండగున్.

మతి శస్త్రము ప్రకృతులు మే
నతిశయధర్మంబు ప్రాణ మతిదృఢతరసం
కృతి జోడు చరులు కన్నులు
చతురుం డగుదూత మోము జననాథునకున్.

స్వామియు మంత్రియు దుర్గ
స్తోమము రాష్ట్రంబు ధనము సుహృదులు బలమున్
గా మహి సప్తాంగంబుల
నేమఱక యొనర్పవలయు నిందులరక్షల్.

ఎందును నాయాసమునకుఁ
బందయయినవాఁడు సిరికిఁ బాత్రుండగునే
మందరగిరి మోవఁడె గో
విందుఁడు మును లచ్చికొఱకు విబుధు లెఱుంగన్.

దూరమున వెరవు గదిసిన,
దారు నిలుచువారి నృపతి దగు మన్నింపన్
దూరమున బిరుదు గదిసిన
దారచ్చట లేనివారిఁ దగు వర్జింపన్.

తక్కినయాత్మఁడు గలఁడే
యెక్కుడుగా నెత్తిపలికి హితమెఱిఁగింపన్
జెక్కిలి మీటుట కూరిమి
తక్కటయే పాలుపోయుతఱి బాలునకున్.

అనురాగియు సద్వృత్తుఁడు
ఘనశక్తిత్రయము దైవికముఁ బౌరుషమున్
ధనమును దనకబ్బిన పతి
సనునది యివి లేనియట్టి జనపాలునిపై.

తనచేతఁగాని కాదను
పనికిం బ్రతినిధిగ నన్యుఁ బనిచినను దీ
రునె యౌషధంబు మా రిది
యని మూల్యం బిడిన రోగ మరుగుట గలదే.

ప్రవిమలవిక్రమ పరుఁడగు
నవనీశ్వరునంకతలమునందు రిపు శ్రీ
దవిలి కుటుంబిని పోలిక
నవిరళమై యుండు నెపుడు నంచితమహిమన్.

అరివధకుం దగునంతకు
ధరణీశుం డోర్వవలయుఁ దక్కువయైనన్
నరుఁడాటదయ్యె నుండఁడె
హరి గొల్లండనఁగఁబడఁడె యనువగుదాకన్.

[ భోజరాజు – నీతిభూషణము ]

జనపతి యాత్మాయత్తుఁడు
నొనరఁ బరాయత్త పతియు నుభయాయత్తుం
డును గలరు వీరిలోపలఁ
దనరు పరాయత్తుఁ డధమతాముసుఁ డరయన్.

ఎవ్వని ప్రసాదమున సుఖ
మెవ్వనికిం గలిగియుండు నెల్లప్పుడుఁ దా
నవ్విభునికొఱకు మృతుఁడగు
నెవ్విధమునఁ బుణ్యలోకహితము దలంపన్.

దండనీతి లేక తక్కిన విద్యలు
గలిగెనేని లేనిగతిన వొందు
రాజు దండనీతిరతుఁడైనఁ దక్కిన
విద్యలెల్ల నతని వెదకిపొందు.

ఆప్తసమ్మతముగ నఖిలకార్యంబులు
సేయువారి కెపుడుఁ జేటులేదు
అప్తుగా నెఱుంగ కాడినమంత్రభే
దనము నొంద కేల తక్కనేర్చు!

కినుకను దుష్టవేదన మొగిం గొను
నెంతయు దుష్కరంబుగా
కనుపమ నీతికోవిదుల కారయ
నెందు నసాధ్యమెందునే
యినుమును నీరుగా గరుగరే
మదకుంజర మస్తకంబునం
దొనరు మదంబు వెట్టరె సమున్నత
వృత్తి నుపాయసంపదన్.

పెద్దయైన యినుపముద్దఁ దానొక లేఁత
తీవనైన నెట్లు తెంపనేర్చు
నల్పమైన నదియు నతిశితధారచేఁ
ద్రెంప నోపు నెంత దృఢమునైన.

సన్నపువాని విచారము
సన్నపుఁ బనులందుఁగాక చతురం బగునే
మున్నెన్నఁడైన విందుమె
చెన్నుగఁ జలమూఁది రణము సేసినవారిన్.

మునుకొని దేశకాలబలముం
దగ దైవబలంబు గల్గఁగా
మొనసి విశేష మూలబలమున్
నిజ బాహుబలంబు నచ్చి పై
చని రిపులన్ జయింతురని శత్రుల
కిన్నియుఁ గల్గియున్నచోఁ
జెనయక దానమానములఁ జేసి
జయింతురు నీతికోవిదుల్.

స్థవిరుండైనను బాలిశాత్ముఁ డయినన్
స్వర్గస్థుఁడైసన్ మహీ
ధవుఁడాత్మోర్భవహీనుఁడైన
మతిమాంన్యంబొందినన్ భూమికిన్
ధవుఁడై యుండి తనర్చినం జెడు
సముద్యద్రాజ్య సంపత్తి వై
భవ మేకక్షణమాత్ర మంద
సచివ ప్రాధాన్యశూన్య స్థితిన్.

ఏలిక చెప్పిన మాటలె
పోలఁగ జెప్పుచును బనియుఁ బొందఁగఁ జేయం
జాలుట యుత్తమదూత్యము
పాలింపఁగవలయు నిదియుఁ బతిహితతతికిన్.

మతిమంతుల యంత్రంబులు
ప్రతియంత్రక్రియనె గాని పాయవు దృఢకీ
లితఘనఘటితకవాటము
ధృతిఁ దాళముచేతఁ గాక తెఱవఁగ నగునే.

తా నరులు వచ్చు తెరువున
మానుగఁగల చెఱువులందు మడువులయందున్
బూని ఘనగరళతరళము
గా నొనరింపంగ వలయుఁ గడువేగమునన్.

వేఱయొకచోట వలయొగ్గి వేఁటకాఁడు
తొలగియుండి మృగంబులఁ ద్రుంచుపగిది
రూపు సూపక శత్రువు రూపుఁ గూల్చు
టిదియె నయమార్గ మిట్లు జయింపవలయు.

[క్షేమేంద్రుడు-ముద్రామాత్యము]

(తరువాయి 44 వ పుటలో)

**మనచరిత్ర-సంస్కృతి**

# ఆంధ్రదేశంలో సంగీతం

విస్సా అప్పారావు

సంగీతం భగవదాత్మకమైనది. ఆధ్యాత్మిక వికాసానికి ఇది ఉత్తమమైన ఉపకరణంగా మన పూర్వీకులు భావించారు. సంగీతం మహత్తరమైన ఉత్తేజాన్ని కల్గించేట్టిది. సర్వోత్కృష్టమైనది. దీనికి గొప్ప నైతికవిలువలు వున్నాయి. ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రుల ప్రసక్తి వుంది. క్రీ. పూ. 3 వ శతాబ్దంలో తొలుదొల్త శాతవాహన రాజులు ఆంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించినట్లు చరిత్ర తెలుపుతున్నది. హాలుడనే రాజు గాథా సప్తశతిని కూర్పుచేశాడు. మహారాష్ట్రి ప్రాకృతిలో ఈయన శాలివాహనరాజుగా పేర్కొనబడ్డాడు. ఇందులో ఆ కాలపు జానపదవాసులు పండుగలు, వేడుకలు, వినోద కార్యకలాపాల సందర్భాలలో పాల్గొను ఆటలు, పాటలు, జానపద నృత్యాలు పేర్కొనబడ్డాయి. ఇది ప్రజల జీవితవిశేషాలను వెల్లడిచేస్తుంది. ఆ కాలంలోనూ, ఆతర్వాత కొన్ని శతాబ్దాల వరకూ, సంగీతం అనేది ఒక ప్రత్యేక కళగా గాక నృత్యానికి, నాటకానికి సహాయకారిగా మాత్రమే వుండేది. నాట్యశాస్త్రాన్ని గూర్చి భరతుడు అది నాటకం, నృత్యం, సంగీతం మిళితమైన కళగా భావిస్తూ ఒక గ్రంథం వ్రాశాడు. క్రీస్తుశకారంభ కాలంలో బహుళ ప్రచారంలోవున్న నృత్య భంగిమలు సంగీత వాద్యాలు (పిల్లనగ్రోవి, వీణ, మృదంగం వంటివి) ఎటువంటివో అమరావతీ నాగార్జునకొండలలోని శిల్పకళా ఖండాలను పరిశీలిస్తే మనకు అవగతమవుతుంది.

సంగీత కళాపోషణకు ఆంధ్రులు ఎంత సేవచేశారో, పుదుక్కోట సంస్థానంలో కుడిమియమలై వద్ద పల్లవరాజైన మహేంద్రవర్మ (క్రీ. శ. 602) చెక్కించిన శిలాఫలకంనుంచి మనం తెలుసుకోవచ్చు. విష్ణుకుండినరాజు విక్రమేంద్ర ఈయనకు మాతామహుడు. మహేంద్రవర్మ సుప్రసిద్ధ వైణికుడు. ఈ చెక్కించిన శిలాఫలకం ఏడు భాగాలలో లేక 'జాతు'లలో వుంది. ఒక్కొక్క జాతిలో * అనేకమైన చతుష్ప్రహార స్వరాగమాలలు విపులీకరించబడి ఉన్నాయి. ఎనిమిదవ శతాబ్దంలో మాతంగుడు వ్రాసిన బృహద్దేశి అనే గ్రంథంలో 'ఆంధ్రి' అనే ఒక రాగాన్ని గూర్చి ప్రస్తావించాడు. ఇది మాళవ పంచమలోని ఆరు రాగిణీలలో ఒకటని తలంచబడుతున్నది.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో భువనైకమల్ల సోమేశ్వరుడనే పశ్చిమచాళుక్య రాజు అభిలాషితార్థచింతామణి అనే గ్రంథం వ్రాశాడు. ఇందులో సంగీత, నాట్యాలపై ప్రత్యేకంగా కొన్ని అధ్యాయాలున్నాయి. వీటిని కూర్పుచేసి అనువైన వ్యాఖ్యానంతోపాటు ప్రచురించవలసివుంది. 12 వ 13 వ శతాబ్దాలలో వాడుకలో వున్న సంగీత, నృత్య, నాటక కళల స్వభావ స్వరూపాల్ని గూర్చి పండితారాధ్య చరిత్రలోనూ, బసవ పురాణంలోనూ పాలుకుర్కి సోమనాధుడు విపులంగా వివరించి వ్రాశాడు. "మార్గ", "దేశి" అను రెండురకాలైన సంగీతాన్ని గూర్చి ఆయన అభివర్ణించాడు. "మార్గ" అనేది దైవప్రార్థనలో నుంచి పుట్టుకొని వచ్చింది. స్వభావంలో భక్తిప్రేరితమైనట్టిది. మత విషయకమైనది. 'దేశి' అనే సంగీతం పండిత పామరులందరూ ఆనందించడానికి వుద్దేశించబడింది. సోమనాధుడు సంగీతశాస్త్రాన్ని గురించీ, వివిధరాగాలు, తాళాలు, వీణావాద్యాలను గురించీ వివరంగా వర్ణిస్తూ వ్రాశాడు. వీటితో ఇదే కాలంనాటి సారంగదేవుడు వ్రాసిన సంగీత రత్నాకరంలో పేర్కొన్న వాటిని పోల్చినట్లయితే, ఈ రెండు పద్ధ

---

* ఈ శిలాఫలాకాల్ని గూర్చి డా. బండార్కర్ విపులంగా విశదీకరించారు. ఇటీవల డా. మీనాక్షి కూడా వీటిని గురించి వ్రాశారు. మహేంద్రవర్మ "మకరిణి" అనే వీణను వుపయోగించాడు. శిలాఫలకాన్ని ఇంతవరకూ పూర్తిగా పరిశోధించడం జరగలేదు.

తులూ వేరువేరుగా వున్నట్లు తెలుస్తుంది. ఆ కాలంలో ఆంధ్రులు ఒక ప్రత్యేకమైన సంగీతపద్ధతిని అనుసరించేవారని ద్యోతకమవుతుంది. ఈ విషయమై ఇంకా పరిశీలన చేయవలసి వుంది.*సంగీతశాస్త్రాన్ని గురించి మాత్రమేగాక పాలుకుర్కి సోమనాథుడు తుమ్మెద పాదములు, గొబ్బి పాదములు, మేలపాదములు మున్నగు అనేక యితర సంగీత పద్ధతులను గూర్చికూడా వ్రాశాడు. పాదము అనేది అన్నిరకాల పాటలకూ పెట్టిన సాధారణమైన పేరు. ఏలపాదములు సర్వజనాదరణ పొందినట్టివి. పూజాసమయాల్లోనూ, ఇతర శుభకార్యాల్లోనూ వీటినిపాడుతూ వుండేవారు.

దేశంలో శాంతి సుస్థిరతకూ, సిరిసంపదలకూ, మంచి ప్రభుత్వానికి ఆలవాలమై సువర్ణయుగమని చెప్పుకోదగిన 14, 15 వ శతాబ్దాలలో కవిత్వం, సంగీతం శిల్ప కళలవంటి లలితకళల్లో సృజనాత్మక సృష్టి జరగడానికి దోహదం కలిగింది. ఈ కాలంలోనే ప్రఖ్యాత వాగ్గేయకారుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు తొలిసారిగా సంకీర్తనలకు గట్టి పునాది వేశారు. వివిధరీతులలో గల సంకీర్తనముల 'లక్షణ'మునుగూర్చి ఆయన వ్రాసిన గ్రంథంలో విపులంగా పేర్కొన్నాడు. ఆయన కాలానికి రెండు మూడు శతాబ్దాలకుముందునుంచీ ఇవి వాడుకలో వుండేవి. పాలుకుర్కి సోమనాథుడు కూడా వాటిని గురించి ప్రస్తావించాడు. తాళ్ళపాక అన్నమాచార్యులు సహస్రాధికమైన సంకీర్తనములు వ్రాసి తిరుమలై వేంకటేశ్వరునికి అంకితంచేశాడు. ఈ కీర్తనములలో పల్లవి, యతిప్రాసలతో మూడుచరణాలు వున్నాయి. అన్నమాచార్యుని సమకాలీనుడైన శ్రీపురందరదాసు పల్లవిని, పల్లవి అను పల్లవి అని రెండు రకాలుగా విభజించాడు.

అన్నమాచార్యుని కీర్తనములలో వైరాగ్యపూరితమైన ఆధ్యాత్మిక కీర్తనలు, శృంగార కీర్తనలు అనే రెండు రకాలు వున్నాయి. అన్నమాచార్యులు 'సంకీర్తనాచార్య,' 'ఆంధ్ర పదకవితపితామహ' అని పిలువబడేవాడు. అన్నమాచార్యుని సంకీర్తనములు తామ్రఫలకాలలో లిఖించబడి వున్నాయి. ఇవి అహోబలం, తిరుమలైలలో లభించాయి. ఈకీర్తనములలో సుమారు అరవై రాగాలు వున్నాయి. ఆయన అనంతరం అబలి, అమరసింధు, తెలుగు కాంభోజి, సమంతం, దేశాలం, పాడి, ముఖారి, పంతు, కొంత మల్హారి వంటి రాగాలు వాడుకలో లేకుండా అంతరించిపోయినాయి. ఇప్పుడు ప్రచారంలోవున్న తోడి, కల్యాణి, అరభి, ఆనందభైరవి, సహన, సురతి, బిల్హరివంటి రక్తిరాగాలు అన్నమాచార్యులు ఉపయోగించ లేదు.

చిత్తమును, మనస్సును సంబోధిస్తూ ఆయన వ్రాసిన కీర్తనములలో అనేక పాతపద్ధతులలోని పాటలు ఉదాహరణకు లాలి, సువ్వి, జోల, జో, జో, జాజర, శోభన, చందమామ, గొబ్బిపాదములు ఇతర పాటలు—వుండడం ముదావహం. ఈ సంకీర్తనముల సంగీత రూపకల్పనమునకు లభించకపోవడం దురదృష్టకరమైన విషయం. తిరుపతిలోని శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ సుమారు నూరు కీర్తనములకు సంగీత రూపకల్పన కావించారు. ఆయన చేసిన గొప్పసేవకు మనమంతా కృతజ్ఞులం. ఇదేవిధంగా గుంటూరులోని శ్రీ టి. యస్. సి. వి. నారాయణాచార్యులు ఇంచుమించు నూరు కీర్తనలకు రూపకల్పన చేసి, ఇటీవలనే ప్రచురించారు.

అన్నమాచార్యుని కుమారుడు పెద తిరుమలాచార్యుడు కూడా ప్రసిద్ధి పొందిన వాగ్గేయకారుడు. సహస్రాధిక సంకీర్తనములను వ్రాశాడు. తండ్రిగారి సంకీర్తనములనూ, తన స్వంత కీర్తనములనూ తామ్రఫలకములపై వ్రాయించినవి ఆయనే. భజనకూటాలను ఆరంభించింది తాళ్ళపాక అన్నమాచార్యులు. ఆయన పరమభక్తాగ్రేసరుడు. ఊర్ధ్వపుండ్రధారియై, హరిదాసు వేషం వేసుకుని ఒక చేతిలో తంబూరా, మరో చేతిలో చిరుతలు ధరించి, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో తన్మయత్వంతో పాటలు పాడుతూ నృత్యం చేసేవాడు. తిరుమలైలలో రాతితో కట్టిన ఒక చిన్న గదికి ఇరుప్రక్కలా హరిదాసు వేషములో వున్న అన్నమాచార్య, తిరుమలాచార్యుల శిలా ప్రతిమలు వెలసి వున్నాయి.

విజయనగరపు సాళువ నరసింహరాజు అన్నమాచార్యుని గౌరవ పురస్సరంగా ఆదరించాడు. విజయనగరం రాజులు గొప్ప సంగీత కళాపోషకులు. సంగీతం పట్ల అత్యంత ఆసక్తి వున్నట్లు ఈ కాలంతో

---

*తిరుపతిలోని ప్రాచ్య పుస్తకభాండాగారం (ఓరియంటల్ ఇనిస్టిట్యూట్ లైబ్రరీ) లో ఉమాపతి వ్రాసిన "ఔమాపతము" అను గీతాశాస్త్ర గ్రంథం ఒకటి వుంది. ఇందులోని కొన్ని విషయాలు, సోమనాథుడు వ్రాసిన వాటితో పోలివున్నాయి.

వెలసిన ప్రబంధసాహిత్యంతో పేర్కొన బడిన అనేక సందర్భాలనుపట్టి తెలుస్తుంది. వసుచరిత్ర రచించిన రామరాజ భూషణుడు సంగీతంలో గొప్ప విద్వాంసుడు. వీణావాద్యం చాలా ప్రచారంలో వుండింది. ఆ కాలంలో వీణా వాద్యాలకు సాధారణంగా మెట్లువుండేవి కావు అయితే లక్కతో మెట్లు అమర్చడం ఆరంభమైనట్లు తెలుస్తున్నది

విజయనగర రాజులకాలంలో సంగీత శాస్త్రానికి గట్టి పునాదులు వేయ బడినాయి శ్రీపురందరదాసు సయుక్తిక మైన మార్గాలలో సంగీత బోధనాపద్ధతిని రూపొందించాడు. నేటికీ ఈ పద్ధతులు అనుసరణీయంగా వున్నాయి. ఆయన కర్నాటక సంగీత వ్యవస్థాపకుడు తొలి సారిగా గీతాలను ప్రచారంలోకితెచ్చాడు కర్నాటక భాషలో అనేక భక్తిరస పూరిత గీతాలను వ్రాశాడు విద్యారణ్య స్వామి "సంగీతసారం" అనే గ్రంథం వ్రాశాడు. రాగాలను మేళములుగా వర్గీక రించే పద్ధతిని మనకు ప్రసాదించిన ప్రథముడు శ్రీకృష్ణరాయల ఆస్థాన సంగీత విద్వాంసుడైన బందరు లక్ష్మీ నారాయణుడు సంగీత సూర్యోదయ మనే గ్రంథం వ్రాశాడు ఇది ఇంకా ప్రచురింపబడవలసి వుంది కొండవీడులో సేనాధిపతిగా వున్న రామామాత్యుడు (క్రీ. శ. 1550) స్వరమేళ కళానిధి అనే గంథ్రం వ్రాశాడు. స్వరములు, మేళ ములను గురించి విపులంగా వివరించిన ప్రప్రథమ గ్రంథమిది. సుమారు క్రీ. శ. 1600 లో సోమనాథుడు రాగ విబోధం అనే పుస్తకం వ్రాశాడు. సంగీత సిద్ధాంతానికి, ముఖ్యంగా సంగీత అధ్యయ నానికి ఇది చేసిన సేవ గణనీయమైంది. అన్నామలై విశ్వవిద్యాలయం స్వరమేళ కళానిధి, రాగవిబోధ గ్రంథాలను ఆంగ్ల వ్యాఖ్యానంతో పాటు ప్రచురించింది. వెనువెంటనే వెలసిన ఈ గ్రంథరాజాలు ఆ కాలంలో సంగీతంలో త్వరితగతిన వచ్చిన పరిణామానికి నిదర్శనాలు లక్షణ సిద్ధాంతం లక్ష్యగానాలకు వెనుక బడివుంది లక్షణానికి ప్రాతిపదిక లక్ష్య మని భావించబడింది. అందువల్ల క్రొత్త గానాలను కూర్పు చేయడానికి లక్షణంలో కొన్ని మార్పులు చేరుస్తూ క్రొత్త సిద్ధాంతాలు వ్రాయవలసి వచ్చింది

విజయనగర సామ్రాజ్య పతనానంతరం సాంస్కృతిక కళాకేంద్రం నాయక రాజుల స్వాధీనమైన తంజావూరుకు మారింది తంజావూరు రాజైన రఘునాథ నాయకులు గొప్ప సంగీతాభిమాని. వీణ వాద్యానికి మెట్లు అమర్చే పద్ధతిని ప్రవేశ పెట్టిన ప్రఖ్యాత పురుషుడు గోవింద దీక్షితులు "సంగీతసుధ" ను వ్రాశాడు ఆయన కుమారుడు వేంకటామాఖీ చతుర్దండి ప్రకాశిక అను ప్రామాణికమైన గ్రంథం వ్రాశాడు. డెబ్బై రెండు మేళకర్త రాగాలను రూపొందించాడు. అప్పటినుంచి ఈ పద్ధతి అనుసరణీయంగా వుంది సంగీత సిద్ధాంతంపై వెలసిన ఈ గ్రంథాలన్నీ సంస్కృత భాషలో వున్నాయి. రాగతాళ చింతామణి అనే గ్రంథం మాత్రమే తెలుగులో వుంది. సుమారు 250 ఏండ్ల క్రితం పోలూరి గోవిందకవి దీన్ని వ్రాశాడు. ఇది ఇటీవల ప్రచురించబడింది కూడా.

పదకీర్తనములు వ్రాసిన ప్రముఖులలో క్షేత్రయ్య అగ్రగణ్యుడు. ఈయన 17 వ శతాబ్దానికి చెందినవాడు. కృష్ణాజిల్లాలోని మువ్వ గ్రామానికి చెందినవాడు. ఆయన వ్రాసిన ఇంచు మించు 4000 పదములలో మనకు ఇప్పుడు లభ్యమయినవి సుమారు 350 మాత్రమే. క్షేత్రయ్య పదాలు మువ్వలోని గోపాలదేవునికి అంకితం చేయబడ్డాయి వీటినే మువ్వగోపాల పదాలు అని అంటారు ఆయన సంస్కృతం, తెలుగు భాషలలో గొప్ప పండితుడు సంగీత నృత్యాలలో కూడా గొప్ప విద్వాంసుడు. ఆయన సుమారు 40 రక్తి రాగములలో పదాలు వ్రాశాడు. రాగాలకు ప్రత్యేక రూపకల్పన చేసిన వారిలో ప్రథముడు. అందుకనే ఆయన వ్రాసిన పదాలకు గొప్ప సంగీత విలువ వుంది పదాలు మందర స్థాయిలో నడుస్తాయి సాత్వికాభినయనానికి అను వైనవి అందుకనే నృత్యంలో నూతన పద్ధతులు, అందులోని సౌందర్యత బాగా అభివృద్ధి చెందాయి. వివిధ తరగతులకు చెందిన నాయికా నాయకుల మనః ప్రవృత్తులను తెలుసుకోవడానికి ఈ పదాలను దృష్టాంతరాలుగా తీసుకో వచ్చు పదాల సంగీతం ద్వితీయ స్వరం నుంచి ఆరంభమవుతుంది. కొన్ని సంద ర్భాలలో యెక్కువే వుంటుంది కూడా. ఇవి మందర స్థాయిలో వుండడం వల్ల, వాటిని ఆకళింపు చేసుకోవడం చాల కష్టం. ఈ పదాలను పునరుద్ధరించి, ప్రచారంలోకి తీసుకొనిరావడానికి ప్రయత్నాలు చేయాలి

తీర్థనారాయణయతీశ్వరులు సంస్కృతంలో తరంగిణి అనే యక్షగానం రచించిన గొప్ప సంగీతవిద్వాంసుడు. ఆయన కృష్ణాజిల్లాలోని వేదాద్రి నరసింహ స్వామి భక్తుడు. సన్యాసిగా తిరుపతివంటి పవిత్ర స్థలాలను సందర్శించి, చివరకు తంజావూరు జిల్లాలోని వరహూరులో

స్థిరనివాసంపర్పరచుకొన్నారు.ఇక్కడనే ఈయన కృష్ణలీల తరంగాలనురచించారు ఈ తరంగములు వేదాంత ప్రబోధక మైనవి గంభీరమైన సంస్కృతంలో వ్రాయబడ్డాయి పాటలో నేగాక నృత్యంలోకూడా వీటిని ఉపయోగించ డానికి ఇవి వుద్దేశించ బడ్డాయి అతను ఒక లయబ్రహ్మ. నారాయణతీర్థ అతిక్లిష్ట మైన శక్తివంతమైన ప్రత్యేక శబ్దములను రచించాడు కొన్ని తరంగములలో వీటిని చేర్చాడు తరంగములు, భజనమందిరా లలో పాడేకీర్తనలలో ఒక అంతర్భా గంగా వున్నాయి

నేలకొండపల్లి వాసి కంచెర్ల గోపన్న 17వ శతాబ్దానికి చెందిన మరొక వాగ్గేయ కారుడు అబ్దుల్ హసన్ తానీషా కాలంలో రెవిన్యూ అధికారిగా పనిచేశాడు ఆయన ప్రభుత్వధనంతో భద్రాద్రివద్ద శ్రీరామా లయం, మంటపాలు నిర్మించాడు ఆయన కారాగారశిక్ష అనుభవించాడు కారా గారంలో వున్న కాలంలో, తనను విముక్తి చేయవలసిందిగా శ్రీరాముని దయను అభ్యర్థిస్తూ సుమారు ఒక వంద కీర్తనలు వ్రాశాడని ప్రతీతి ఈ కీర్తనలు పరుల జీవిత చరిత్రను చిత్రీకరిస్తాయి గొప్ప భావ ప్రేరితములైనవి వీటిశైలి సులభమైనది ఇవి బహుళ ప్రచారంలో వున్నాయి ప్రజలు భజనకూటాలన్నింటిలో వీటిని పాడుతారు

సారంగపాణి అనే మరో వాగ్గేయ కారుడు 150 పండ్లక్రిందట వెలిశాడు. సాళువమహారాజు కాలంలో కార్వేటి నగర ఆస్థాన సంగీత విద్యాంసుడు కార్వేటి నగర వేణుగోపాల స్వామికి అంకితంచేస్తూ పదాలు వ్రాశాడు. ఇటీవలి వరకు కార్వేటినగరం, వేంకటగిరి దేవా లయాలలో ప్రజలు వీటిని పాడుతూ వుండేవారు దురదృష్టవశాత్తు అనేక పదాల సంగీత స్వరలిపి మనకు ఇప్పుడు లభ్యం కావడంలేదు పదాలు నాలుగు భాగాలుగా వున్నాయి —

1 *శృంగార పదాలు :* (75) ఇవి క్షేత్రజ్ఞ పదాలవంటివే.ఆయన "రాగమూలపదం" అనే గ్రంథం వ్రాశాడు అందులోని సాహిత్యంలో 20రాగాలపేర్లనుచేర్చాడు ఉదాహరణకు

"ఈ సీమలహరిణాక్షులవలెగా — దీ మోహనాంగి కన్నడసేయక నీదరబారు-గాచి యున్నది నాట నుంచి ఇదేవిధంగా పల్లవితో కల్యాణ రాగంలో "స్వరస్థాన పదం" అనే పేరుగల మరో పదం వ్రాశాడు

"దానిపాయము పదారేండ్లు నీదానిగా నేలుకోరా"

క్రింద గీతలు గీచిన అక్షరములు — "దా, ని, పా, మరియుగా" అనురాగాల స్వరస్థానాలలో కుదురుతాయి ఇదే విధంగా ఇవి. స, రి, మ అనే ఇతర మూడు స్వరాలూ పదంలోని ఇతర భాగంలో కనిపిస్తాయి

2. *దేశీయ పదాలు :* (66) ఇవి సామాన్య నాయికకు నాయకుని పట్లగల చౌకబారు సాంఘిక ప్రవర్తన, దృక్పథాన్ని వెల్ల డిస్తాయి

3. *జాతీయ పదాలు :* (16) ఆ కాలంలో సంఘంలో అట్టడుగున వుండే ప్రజలు మాట్లాడుకొనే వాడుక భాషలో ఇవి వ్రాయబడినాయి వారి అభిరుచులనూ వారి జీవిత పద్ధతులనూ ఇవి తెలియ జేస్తాయి వాటి భావాన్ని గ్రహించా లంటే కొంత ప్రయత్నం చేయాలి. ఉదా హరణకు :—

రాగం—అరభి—తాళం—చాపు

"అగ్గి తిరునాళ్ళంట అజ్జుని (అర్జుని) కథలంట -
ఔర యెంతారు సొడ్డేమి భారతకథ
క్యూర — యెన్నెన్నింతాలె
సుగ్గిజామి (సుగ్రీవ విజయము) దీని-
సూతు బలందూరు అగ్గురోరపు
ఆయ్యోర్నడిగె నైసాచిగ - అగ్గి తిరు నాళ్ళంట-"

4 *కీర్తనలు :* (43) అన్నమయ్య వ్రాసిన ఆధ్యాత్మిక కీర్తనలవలె ఇవి భక్తి పూర్వకమైనవి. వ్యావహారిక తెలుగులో, సంఘంలో ఉన్నత వర్గాలకు చెందిన ప్రజలు మాట్లాడుకొను భాషలో వ్రాయబడినాయి

కొన్ని విషయాలలో ఈ సంగీత రచనలు అపూర్వమైనవి వాటిని పరిర క్షించాలి ఇవి 96 పండ్ల క్రితం ప్రచురించ బడ్డాయి వాటిని, విపులమైన పీఠికతో పునర్ముద్రించ వలసిన అవసరం ఎంతైనా వుంది

మునిపల్లి సుబ్రహ్మణ్యకవి (క్రీ శ 1750) ఆధ్యాత్మరామాయణ కీర్తనములు (104) వ్రాశాడు ఆయన కాళహస్తిలో దామెర తిమ్మేంద్ర భూపాలుని కొలువులో వుండేవాడు తాను వ్రాసిన కీర్తనలను శేషాచలేశుని (వేంకటేశ్వరుని)కి అంకితం చేశాడు ఈ కీర్తనలలో రామాయణ కథకు వేదాంత వ్యాఖ్యానం జోడించబడింది. శివుడు పార్వతికి ఈ కథ చెప్పాడు ఇందులో యమకములు అపారం. ఇవి సంస్కృత మిశితమైన తెలుగులో వ్రాయబడ్డాయి. ప్రతి కీర్తనమూ మధ్యమ కాలం, ధృత కాలంలో పాడబడుతుంది కనుక ఇవి

వినడానికి సొంపుగా వుంటాయి. ఇవి 58 రాగములలో రచించబడ్డాయి. ఇటీవలనే ఈ కీర్తనములలో 61 ని స్వర లిపిలో ప్రచురించడం జరిగింది. ఆంధ్ర దేశంలో వాటికిగల స్థానాన్ని తిరిగీ ప్రతిష్ఠాపించాలి. తెలుగు దేశంలో 50 ఏండ్ల క్రితంవరకు ఇవి ప్రతి గ్రామంలోను, ప్రతి ఇంటిలోను పాడబడుతూ వుండేవి.

దక్షిణ భారతదేశ గాయక శిఖామణులలో అగ్రగణ్యుడైన త్యాగరాజు (1767-1847) తంజావూరు జిల్లా తిరువరూరులో జన్మించాడు. తన జీవితమంతా కావేరీ నది ఒడ్డున తిరువయ్యారులోనే గడిపాడు. పురందరదాసు, క్షేత్రయ్య గారలు శాస్త్రీయ సంగీతానికి చేసిన సేవ ఫలితంగా దక్షిణాపథంలో సంగీత, సాంస్కృతిక చరిత్ర ఉచ్ఛస్థాయిలోవున్న కాలంలో ఆయన జన్మించాడు. అంతేగాక పచ్చిమిరియం ఆదియప్పయ్య సంగీత చరిత్రలో తొలిసారిగా వర్ణం సృష్టించి పాటలు వ్రాశాడు. (భైరవిలో విరిబోని). వీరభద్రయ్య ప్రప్రథమంగా స్వరాజతీలు వ్రాశాడు. శొంఠి వేంకటసుబ్బయ్య, ఆయన కుమారుడు వేంకటరమణయ్య గారలు గొప్ప వీణావిద్వాంసులు. సంగీత చరిత్రలో స్వర్ణయుగంగా పేర్కొనదగిన ఈ కాలంలో సంగీత త్రిమూర్తులైన త్యాగయ్య, ముత్తుస్వామి దీక్షితార్, శ్యామశాస్త్రి తిరువరూరు గ్రామంలోనే జన్మించారు. తిరువరూరు తిరువయ్యారు ప్రాంతాలు ప్రకృతి సౌందర్యానికి నిలయాలు. అక్కడి ప్రకృతి అంతా వేదపాఠముల రవళితోనూ, ఆ ప్రదేశ ప్రజల సాంప్రదాయకమైన సాంస్కృతిక కార్యకలాపాలతోనూ నిండివుండేవి.

త్యాగరాజు పరమ రామభక్తుడు. తన తండ్రియైన రామబ్రహ్మంనుంచి రామ భక్తిని సంపాదించాడు. తన మాతామహ పితామహుల నుంచీ, తన తల్లి సీతమ్మ నుంచీ సంగీత ప్రతిభను సంపాదించాడు. ఆయన పాటలలో అనేక రీతులు వున్నాయి. భజన కూటములకు ఉత్సవ సాంప్రదాయ కీర్తనములు, శాస్త్రీయ పద్ధతిలో సంగీత రూపకాలు, కృతులు అన్నీ వున్నాయి. ఆయన వ్రాసిన కృతులు సంగీత పాటకుల్లో గొప్ప మార్పును తీసుకొని వచ్చాయి. భావకవిత్వం గల ఆయన కృతులు ఉత్కృష్టమైనవి. అవి చిన్నవి, వినుటకు సొంపుగా వుంటాయి. ప్రతి కృతి అంతఃకరణాన్ని ప్రేరేపించి, హృదయాన్ని చలింప చేస్తుంది.



ఇదివరకు ఉపేక్షించబడిన ఖరహరప్రియ, హరికాంభోజివంటి రాగాలను ఆయన పునరుద్ధరించాడు. 200 లకు మించిన రాగాలలో కృతులు రచించాడు. వీటి సంగీత విలువ అపూర్వమైనది. అనేక రాగాలను క్రొత్తగా సృష్టించాడుకూడా. రాగంలో అంతర్లీనమైన లక్షణాలను క్షుణ్ణంగా మథనం చేసి, ఒక్కొక్క రాగంలోగల విశిష్టతను వెలికితీయడంలో సిద్ధహస్తుడు. కడునేర్పుతో 'సంగతుల'ను ప్రవేశపెట్టి, సాహిత్య దురభిమాన దోరణిలోనే వుంటూ వచ్చిన సంగీతపాటల నుంచి సంగీతాన్ని కాపాడి ఆ కళకు ఆయన చేసినసేవ చాల గణనీయమైనది. సంగతులు అనేవి సంగీతయుతమైన పదములు. ఆరోహణాక్రమంలో ఒక దానితో ఒకటి మిళితమైపోతాయి. ఆలాపన క్రమంలో రాగంలోని వివిధ మెళకువలను తెలియజేస్తాయి. ఈ పద్ధతి ప్రవేశపెట్టడంలో సాహిత్య భావంతో పాటు రాగభావాన్ని పరిపూర్ణంగా మిళితం చేసి ఆయన ఒక అద్భుత కార్యాన్ని సాధించాడు.

నాదోపాసన ద్వారా ఆధ్యాత్మిక విద్యను సాధకం చేసిన మహామహుడు త్యాగరాజు. వేదాంతిక ప్రపంచంలో భౌతిక ప్రపంచాన్ని మేళవింపచేయడానికి నాదోపాసన ఒక ఉపకరణయని భావించబడింది. ఆయన సంగీతం అన్ని వర్గాల ప్రజలనూ ఆనందాంబుధిలో ముంచివేస్తుంది. త్యాగరాజు ఒక పదకర్త, గాయకుడు, ఋషి, నాదయోగి. ఆయన పాటలలో మానవత్వం వుట్టిపడుతుంది. భావౌన్నత్యం వుంది. ఒక్క మాటలో చెప్పాలంటే త్యాగరాజు సృజనాత్మక సంగీతాన్ని సృష్టించిన మహాపురుషుడు.

విజయనగరం, బొబ్బిలి, మాడుగుల సంస్థానాలు సంగీతాన్ని పోషించాయి. విజయనగరంలో వీణ పెదగురాచార్యులు, దుర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు, కలికోట్ల కొమరాజు, వీణ వెంకటరమణదాసు, బొబ్బిలిలో నందిగామ వెంకన్న, మాడుగులలో వాసా అప్పయ్య, వాసా సాంబయ్యగారులు

ప్రముఖ గాయక శిఖామణులుగా వెలసినారు.

వీణ పెదగురాచార్యులు, రమారమి 160 పండ్లక్రిందట తంజావూరు నుంచి విజయనగర సంస్థానానికి ఆహ్వానించబడ్డారు ఆయన కర్నాటక సంగీత పాఠశాలను ఆరంభించారు ఆయన నెలకొల్పిన సాంప్రదాయాన్ని ఇతర సంస్థానాల సంగీత విద్వాంసులు అనుసరించారు. ఆయన మనుమని కుమారుడు వీణ వేంకటరామదాసు వీణా వాయిద్యంలో గొప్ప ప్రతిభ కలవాడు.

నేను పదేండ్ల క్రితం, సంగీతాన్ని గూర్చిన అనేక అమూల్యమైన వ్రాత ప్రతులను సేకరించాను. వాటిల్లో రెండింటికి గొప్ప సంగీత విలువ వుంది అవి :-

1. రమారమి 100 కర్నాటక రాగములలో 200 గీతములు 27 హిందూస్తానీ రాగములలో 27 గీతములుగల వ్రాత ప్రతి. ప్రతిరాగానికి ఆరోహణ, అవరోహణాక్రమం ఇవ్వబడింది. పెదగురాచార్యులు ఈ గీతములనే బోధించారు

2 104 రాగములలో తానములు గల వ్రాతప్రతి : ఈ రాగములు 14 మేళరాగములకు చెందినట్టివి వేంకటామాఖి అనుసరించిన పద్ధతికంటే ఈ మేళా పద్ధతి భిన్నమైనది. నట, శ్రీ, అరభివంటి ఘన రాగములలో జంత్రమోళి, గాత్రమోళి అను రెండు రకాల తానములు వున్నాయి ఈ రెండు వ్రాతప్రతులు ముద్రణ చేయబడుతున్నాయి.

ఈ వ్రాత ప్రతులలో, హిందూస్తానీ, కర్నాటక సంగీతానికి సంబంధించిన అనేక క్రొత్త విషయాలు బయలు పడినాయి రేగుప్తి, కపి (కర్నాటక), సహానవంటి కొన్ని రాగములలో పేర్కొన్న ఆరోహణ, అవరోహణా క్రమం, ఇప్పుడు ప్రచారంలో వున్నదానికి భిన్నంగావుంది ఈ రాగముల ఆరోహణ అవరోహణ స్వరాలు పల్లవిలో ఇవ్వబడినాయన్న విషయం సువిదితమే శ్రీ త్యాగరాజు ప్రముఖ శిష్యులు నల్గురు వారిలో ఒకరైన వీణ కుప్పయ్య కుమారుడు తిరువొత్తియారు త్యాగయ్య స్వరకల్పవల్లి కూడా భిన్నంగావుంది ఈ వ్రాతప్రతుల సహాయంలో పోల్చి పరిశీలించినట్లయితే ఎన్నో ముఖ్య విషయాలు తెలుస్తాయి తానముల వ్రాత ప్రతి 80 పండ్లకు పూర్వం దుర్వాసుల సూర్యనారాయణ శాస్త్రి వ్రాసినది.

విజయనగరం దర్బారు హిందూస్తానీ సంగీతాన్ని పాశ్చాత్య సంగీతాన్ని కూడా పోషించింది. ఇందుకొరకు నిపుణులు నియమించబడ్డారు. ***అన్ని విధాల సాంస్కృతిక ఖనియని చెప్పదగిన శ్రీ ఆనంద గజపతి మహారాజ పుస్తక భాండాగారాన్ని పరిశీలించి, వాటి విషయం తెలునుకో వలసివుంది.*** ఆనందగజపతి ప్రోత్సాహంతో కర్నాటక సంగీత విద్వాంసులు మండూక శబ్దం అని పిలువబడుతున్న ఒక క్రొత్తపద్ధతిని కూర్పు చేసినట్లుగా తెలుస్తున్నది. బీథోవిన్ వ్రాసిన ప్యాస్టోరల్ (జానపద) సంగీతానికి ఇది అనుకరణ

కలికొట్ల కామరాజునంటి ప్రతిభగల సంగీత శిరోమణులు తంజావూరుకు వెళ్ళి, అక్కడ సంగీత త్రిమూర్తుల సంగీత పాటలను నేర్చుకొని, వాటిని విజయ నగరంలోనూ, ఆ చుట్టుప్రక్కలా ప్రచారంలోకి తెచ్చారు. పిఠాపురం సంస్థానంలో వుండిన తుమరాడ సంగమేశ్వర శాస్త్రి కర్నాటక, హిందూస్తానీ సంగీతాలలో వీణ వాయించగల ప్రతిభావంతుడు

రమారమి 100 పండ్లకు పూర్వం కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లి నివాసి శ్రీ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి తంజావూరుకు వెళ్ళాడు అక్కడ సంగీత శాస్త్రాన్ని అభ్యసించి, స్వగ్రామం తిరిగి వచ్చి స్వగృహంలోనే కర్నాటక సంగీత పాఠశాలను నెలకొల్పి త్యాగరాయ కృతులూ ఇతర ప్రసిద్ధ కర్నాటక పదకర్తల కృతులూ అనేకమంది శిష్యులకు నేర్పినారు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు ఆయన శిష్యులలో ప్రముఖుడు

గత 15 లేక 20 పండ్లనుంచి శాస్త్రీయ కర్నాటక సంగీతంలో ఒక మార్పు గోచరిస్తున్నది. రేడియోలు, సినిమాలు అతి శీఘ్రంగా ఇందులో మార్పును తీసుకొని వస్తున్నాయి. సంగీతంలో ప్రజాస్వామం వచ్చింది. శాస్త్రీయ సంగీతం పట్ల అభిరుచి సన్నగిల్లుతున్నది లలిత సంగీతం, సినిమా సంగీతం పట్ల అభిమానం ఎక్కువవుతున్నది ఈ మార్పులన్నీ సహజమే వాటికి తగిన విలువ వాటికి వుంది అయితే శాస్త్రీయ సంగీత ప్రమాణం పడిపోకూడదు. మన హాయాంలో త్వరితగతిన అంతరిస్తున్న పూర్వకాలపు సంగీత విద్వాంసులలో పోల్చదగిన గాయకులకు శిక్షణ యివ్వడానికి చర్యలు తీసుకోవాలి



# అంతులేని
# చైనా సామ్రాజ్య విస్తరణ కాంక్ష

"ఖుష్వంత్ సింగ్"

ఇటీవల దాదాపు పదిహేను రోజులక్రితం రాజఘాట్‌లో గాంధీమహాత్ముని సమాధి సందర్శించేందుకు వెళ్లాను నేను. మనస్సులో ఏవేవో సందేహాలతో, నైతిక సమస్యలతో సతమతమవుతున్న సమయంలో ఎవరైనా వెళ్ళి రాదగిన ప్రదేశం అది అని నా ఉద్దేశం. చక్కగా ఉంటుంది అట్టే ఎక్కువమంది జనం లేనప్పుడు. ప్రశాంతంగా కూడా ఉంటుంది. బాపు ఆత్మజ్యోతి ప్రకాశిస్తూ తేజోపుంజాన్ని విరజిమ్ముతున్నట్టే తోస్తుంది; అక్కడికి వెళ్ళినవారికి. సాక్షాత్తు ఎదుట వున్న గురువువద్ద నుంచి శిష్యునిమోస్తరే గాంధీజీ సలహాను అర్థించినట్టే ఉంటుంది వారికి. సాధారణంగాతోచే విషయమే నేను ఇంతవరకు చెప్పాను. కాని అక్కడికి నేను వెళ్ళిన రోజు మాత్రం రాజ్‌ఘాట్ ప్రశాంతంగా లేదు. విదేశీ పత్రికా విలేఖరులూ, ఫోటోగ్రాఫర్లూ ఇంకా ఇతరులూ అనేక మంది ఉన్నారు. పెకింగ్‌కి శాంతియాత్ర ప్రారంభం ఆ రోజున అక్కడ జరిగింది. అందుకోసం చేరారు వారందరూను. గాంధీజీ సమాధి దగ్గర జరిగే మిగతా కార్యక్రమాలన్నిటి మోస్తరే సాగింది ఈ ప్రారంభోత్సవంకూడా. భజనలు రామ్‌ధున్ సంకీర్తన శాంతియాత్రలో పాల్గొనేవారు కొందరి ఉపన్యాసాలూ అవీ జరిగాయి. కాని ఆ మొ కార్యక్రమం అంతటిలోకీ భారతీయుడొ-ఒకరు అన్నమాటలు నా మనస్సులో బాగా గాఢంగా నాటుకున్నాయి. గాంధీజీ గుర్తుకు వచ్చారు. ఆ రోజున నేను విన్నమాటలు ఇవి 'మహాసముద్రాలలో నీటి మోస్తరే అనంతమైన గగనసీమలో గాలిమోస్తరే భూమికూడా భగవంతునిది. మానవులెవరిదీ కాదు. భూమిపై యాజమాన్యంకోసమని వేర్వేరుదేశాలు యుద్ధానికి దిగటం పరమ మూర్ఖమేతప్పమరొకటికాదు.' ఈ మాటలలో ఇమిడివున్నభావాన్నీ సర్వోదయ వాలంటీర్ల జయ్‌జగత్ అనే నినాదం వ్యక్తం చేస్తుంది.

వసుధైక సిద్ధాంతాన్నీ భూమి యావత్తు భగవంతునిదే అన్న సూత్రాన్నీ మనలో చాలమంది ఆమోదిస్తారనే నా నమ్మకం. అయితే ఈ విషయమై చైనావారి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవడం బాగుంటుంది. ఏమంటారా — ఈ శాంతి యాత్రికుల గమ్యస్థానం చైనా రాజధాని పెకింగ్ నగరమేగా మరి. చైనాప్రభుత్వ విధానాలకూ వైఖరికీ దర్పణమని చెప్పుకోతగ్గ పీపుల్స్ డెయిలీ పత్రికలో క్రిందటివారం ఒక వ్యాసం వెలువడింది-"అసమాన ఒడంబడికలు"అనే విషయంమీద. లోగడ ఎన్నడో చైనా చక్రవర్తులు తమకంటె శక్తివంతమయిన రష్యా జార్ ప్రభువులకి సైబీరియాలోనించి దత్తంచేసిన ప్రాంతాన్ని గురించి చైనాకు గల కోర్కెలను ముఖ్యంగా ప్రస్తావించారు ఈ వ్యాసంలో. కాని ఈనాడు చైనాకీ ఇరుగు పొరుగునఉన్న మిగతా దేశాలకీ మధ్యఉన్న సంబంధాలకు కూడా అన్వయిస్తుంది అది. ఈ వ్యాసం చదివేప్పుడు మావ్ సేటుంగ్ లోగడ వెలిబుచ్చిన కోర్కెలను దృష్టిలో ఉంచుకోవలసి వుంటుంది. వరసగా కొన్ని ప్రాంతాలను పేర్కొంటూ ఆయనగారు అవి అసలు చైనాకు చెందినవనీ, సామ్రాజ్య వాదులయిన పరరాజ్యాలవారు వాటిని చైనా వద్ద నుంచి బలవంతంగా లాగివేసుకున్నారనీ సెలవిచ్చారు. బర్మా, భూటాన్, నేపాల్, హాంకాంగ్, కొరియా, ఫార్మోజా మొదలయినవి చాలావున్నాయి ఈ పట్టికలో. ఈ ప్రాంతాలన్నీ స్వతః తమకు చెందవలసినవి అని చైనా వాదించడానికి అసలు రహస్యం ఒక్కటే — దానిని రహస్యం అనే గనక అనగలిగితే — బ్రహ్మాండంగా పెరిగిపోతున్న చైనా జనాభా. సంవత్సరానికి కోటీ నలభైలక్షల మంది చొప్పున పెరిగిపోతోంది చైనాలో జనాభా. వీరు దఫాలవారీగా వ్యాపించి ఇరుగుపొరుగు దేశాలకు వలసపోతుంటారు. అనతికాలంలోనే అక్కడ మొదటినుంచీ నివశిస్తున్న వారిని మించిపోతారుకూడా. ఉదాహరణకు మంగోలియాలో ఇప్పుడు అసలు అక్కడి ప్రజలకంటె చైనీయులు పదిరెట్లు ఎక్కువ ఉన్నారు. మలయాలో మలయా జాతీయుల

(36 వ పేజీ తరువాయి)

చెలికి షడంశమున్ బ్రియకు
శేషములోపలఁ బంచమాంశమున్
బొలుపుగ దాని శేషమున
బోదకు నాల్గవపాలు నిచ్చి యం
దులఁ దనపాలు దాఁగొనియెఁ
దొమ్మిదిజేనలు రాజహంస మీ
నలిన మృణాల మెంత సుజనస్తుత
మా కెఱుఁగంగఁ జెప్పుమా!

హారుని వరప్రసాదమున
నశ్వము మూఁడవయేడునిండినన్
ధర నొక పిల్లవైచు మది దానికిఁ
బుట్టిన పిల్లపిల్లలున్
తరతర మట్లు వైచునఁట తల్లికి
ముప్పదియేండ్లు నిండినన్
నిరవుగ నీను గోడిగలు
నీనినగోడిగ లెన్ని తెల్పుమా!

[పావులూరి మల్లన—గణితము]

* * *

తాంబూలము

తలపోయఁగ రుచులాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫముం జెడు నా
కలిపుట్టు దగయుఁ జెడుఁ ద
మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్.

[నన్నెచోడుడు—కళావిలాసము]

---

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 ఫిబ్రవరి నెలలో దిగువ గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పడం జరిగింది.

చేర్యాల, ఖానాపూర్, కూసారం (హైద్రాబాదు జిల్లాలోనివి) ముత్యంపేట, చిన్నకల్వల I, చిన్నకల్వల II చినబొంకూరు, కరీంనగరం జిల్లా, ఇబ్రవెన్ను, రుద్రగూడెం, ఇటికెలపల్లి, కల్లెడ, వావిలాల, బయిరనపల్లి, అమ్మాపురం, తొర్రూరు (వరంగల్లు జిల్లాలోనివి), కుడవల్లేరు III. (కృష్ణా జిల్లా) చగనం (నెల్లూరు జిల్లా) బత్తలపల్లి, కాలసముద్రం, ధర్మవరం (అనంతపురంజిల్లాలోనివి), లతపల్లి (మహబూబునగర్ జిల్లా). ★

---

కంటె చైనావారిదే ఎక్కువ సంఖ్య. సింగపూర్ జనాభాలో అధికభాగం చైనావారే. మిగతా పొరుగుదేశాలలో జరిగే తంతు కూడా ఇదే. ఈవిధంగా జరిగిపోయిన కొన్నాళ్ళకి ఆ ప్రాంతాలన్నీ తమ భూభాగమే నని వాదానికి దిగుతారు చైనావారు. భూమి యావత్తు భగవంతునిదే అన్న మాటకు చైనావారు చెప్పే జవాబు; ఎలా ఉంటుందో ఊహించవచ్చు. ''భూమి అంతా దేవునిదే కావచ్చు'' కాని చైనాప్రభుత్వం వెళ్ళి ఆక్రమించుకుని పెత్తనం సాగించడానికి ఉద్దేశించినదే అదంతా; అని అంటారు వారు. బాగానేఉంది. కాని నిష్కారణంగా బుద్ధిపూర్వకంగా జరిగిన దురాక్రమణ ఫలితంగా చైనావారి భుక్తమయిన ప్రాంతాలలో వారు వహించవలసిన విద్యుక్తధర్మమేమిటి అని. అంతదాకా అక్కరలేదు, ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటోఅని. గాంధీజీయే గనుక ఈనాడు సజీవులుగాఉంటే మనకు అన్యాయం జరిగితే 'జరిగింది మరచిపోదాం. భూమి యావత్తు భగవంతునికి చెందిందే కాని వారికిగానీ మనకుగానీ చెందినదికాదుగదా. కనక వారు ఆక్రమించుతున్న ప్రాంతాన్ని వారికే వదలివేద్దాం,'అని అంటారా? ఎంత మాత్రం అలా అనరు. సందేహం లేదు. 'బలహీనులను క్షమించడం ధైర్యంఅనిపించుకుంటుంది. కాని బలవంతులను వదిలివేయటం పిరికితనమే అవుతుంది.' అన్న గురుగోవింద్‌సింగ్ ప్రవచనాన్ని పదేపదే పేర్కొంటూ ఉండేవారు గాంధీజీ. ★

# నిదాఘతాపము

ఎస్. టి. వి. వి రామానుజాచార్యులు



ఒక వేఁడిపోఁడిమి యుచ్ఛ్వాస నిశ్వాస
మారుతానీకంబు మాపుచుండు
ఒక తీక్ష్ణకిరణాళి యుత్తేజమొనరించు
కర్తవ్య దీక్షను గలుగఁజేసి
ఒక రక్తకిరణాళి యుల్లాసమును గూర్చు
కిసలయ పుష్పాళిఁ గెంపు బర్వ
ఒక కాంతిరేఖాళి యున్నిద్ర మొనరించు
జీవాణుతతులను జేర్చి జగతి

సకల మానవ కళ్యాణ సరణినిండ
లోకమునుగాఁచు కీర్తిని వీకఁబొంది
కరుణనింపెడి నీ మూర్తి క్రాంతినింప
వినతి గొనుమయ్య! యోసూర్య! విశ్వరూప!

*

నవవాసంతిక సౌరుగాంచి సుమబాణాయాసిత స్వాంతుఁడై
పవలెల్లం దిరుగంగసాఁగె రవి; తాపాయత్త చిత్తంబుతో
వివిధారామముల న్వెలుంగుచును, వేవేగన్ గటాక్షించుచున్
బువులంజేర్చెను మల్లె; నీరజ పతి ప్రేమంపుఁగాన్కల్వలెన్.

*

మల్లియయందు గాఢముగ మానసమున్ నిలుపంగఁజేసి యీ
పల్లెలు బట్టణాల్ గనుచుఁ బావనశైలము లెల్లదాటుచున్
మల్లెను జూచువేడ్క, మరుబాధ, సహింపఁగలేక తాపమున్
జెల్లుగ నివ్వటిల్ల, రవి; పెంచెను తాపము మానవాళిలోన్.

*

నవ మల్లికాగత పవనాంకురంబులు
పరితోషజనకమై పర్వలేదె!
నవ చందనాలేప వివిదోపచారముల్
తాపోపశాంతికిఁ దావునీవె!
నవ వారి పరిపూర్ణ నారికేళంబులు
దాహోప శాంతికిఁ దావునీవె!
నవ వధూసంగమ నవ్యాను భూతులు
సుఖలేశమాత్రంబు సూపవాయె!

ఏమి తాపంబో! భరియింప నెవరితరము!
విశ్వ సృష్టికి మూలమై వెలయురవియె
ఇట్టి తాపంబుఁబోఁద్రోల నిమ్ము వెడలి
తిరుగుచున్నాడు మనమాట తెలుపనేల? 

# భారత సైనికుడు

ఎస్. వి. సత్యనారాయణమూర్తి

మంచు ముద్దలు, ముద్దలుగా కురుస్తోంది చలిగాలి రివ్వున దారుణంగా ఎముకలు కొరికేటట్లుంది. ప్రకృతే ఆ శీతల హిమాలయ సానువులలో గడ్డకట్టుకుపోయుంటుంది. ఇక జీవులసంగతి చెప్పేదేముంది? కనుచూపుమేర దూరంలో వెలుపల ప్రాణి అన్నది కనిపించదు. దట్టమైన మంచు తెరపొరలలోనుండి మింటితారలు మిణుగురుపురుగుల్లా మెరుస్తున్నాయి. వాటి హీన కాంతి తప్పిస్తే మిగతా అంతా తారుపూసినట్లున్న కటికచీకటి. కన్నుపొడుచుకున్నా ఏమీ ఆరడుగుల అవతల కానరాదు—మెరిసే మంచుసోనలు తప్ప. ఎక్కడో ఒకప్పుడు చలిబాధకు తాళలేనట్లు రెండుమూడు జీవాల ఆరావాలు దీనంగా వినిపిస్తున్నాయి.

ఆ సమయం క్షణం యుగంగా గడిచే శీతాకాలపు రాత్రి!

ఆ స్థలం వేలాది సంవత్సరాలుగా భారత దేశానికి సరిహద్దుగానున్న హిమాలయ పర్వతప్రాంతం లడఖ్!

చరిత్రకందని పురాతనకాలంనుండి, వేద యుగానికి పూర్వంనుండి, ప్రకృతి సహజ సృష్టియైన ఆ హిమాలయ పర్వతశ్రేణి అఖండభారతానికి అనాదినుండి సాంప్రదాయ సిద్ధమైన సరిహద్దు. గంగా, సింధునదులవంటి పవిత్ర జీవనదులకు జన్మభూమై, శంకరుని నివాసమైన కైలాసమని ప్రసిద్ధిపొంది, బదరీ, కేదారాది ఆదిపుణ్యక్షేత్రనిలయమై, ఎందరో మహర్షులకు, మహాపురుషులకు ఆవాసమై, దివ్యభూమిగా పురాణేతిహాస కావ్యములలో కీర్తించబడి, కాళిదాసాది మహాకవివరుల పొగడ్తలంది, భారతజాతి సంస్కృతి చిహ్నమై, అతి విశాల పర్వత పంక్తులలో విశ్వమంతటిలోని అత్యున్నత శిఖరాగ్రములు కలిగి, ధవళహిమాచ్ఛదనంతో మెరుస్తూ ప్రాచీనకాలంనుండి ప్రపంచ ప్రశస్తిగాంచిన ఆ హిమపర్వతపంక్తి నేడు ఒక దురాక్రమణపరుని పిడికిట చిక్కుకొని, తన స్వేచ్ఛను అపహరించ వచ్చినవానిని విరోధించడానికి ప్రయత్నిస్తోంది.

భారతదేశపు కీర్తిని సూచిస్తున్నట్లు అత్యున్నత హిమగిరి శిఖరాలు గంభీరంగా గగనంలోనికి తమ తలలనెత్తి పరికిస్తున్నాయి. ఆ శిఖరాలపై తెల్లని మంచుకప్పు భారతీయుల హృదయంలోని విశ్వమానవ సోదరభావంలా అతిస్నిగ్ధంగా, స్వచ్ఛంగా పేరుకొంది.

భారతదేశం తన గడ్డపై కాలుమోపిన యెందరో ఆగంతకులను ఆదరించింది వారికి నిలువనీడ చూపింది. తనలో లీనం చేసుకుంది. కానీ తన జాతీయతను రూపుమాపాలని, ఆక్రమించుకోవాలని వచ్చిన దురాశపరులను యెప్పుడూ యెదిరిస్తూవస్తూ, తన ప్రత్యేకతను యుగయుగాలనుండి నిలుపుకొని వస్తుంది. దానిని నాశనంచేయ ప్రయత్నించినవారే నాశనమవుతూవచ్చారు. భారతదేశాన్ని జయించాలని వచ్చిన శక, హూణ, పహ్లవ, గ్రీకు, మొఘల్ మొదలైన జాతులు కాలక్రమాన తామే భారత చరిత్రకు అంకితమైపోయారు. ఆఖరి భారతీయుడు ఉన్నంతవరకూ భారత జాతీయతా, దేశం నిలిచేవుంటాయి.

ఆ నిశ్శబ్ద నీరవ నిశీధిలో ఒక చిన్న పటకుటీరంలోనుండి సన్నని కాంతిరేఖలు వెలువడుతున్నాయి. దేశ సంరక్షణకోసం కంకణంకట్టిన భారత సరిహద్దు కాపలా సైన్యంలోని ఒక పటాలం అక్కడ తమ విధి నిర్వర్తిస్తున్నారు ముగ్గురు సైనికులు బయట గస్తీ తిరుగుతూ పరస్పరం హెచ్చరించుకుంటున్నారు. ఒళ్ళు కొంకర్లుపోయే శీతల వాతావరణంలో ఉన్నికోట్లు ధరించి, భారంగా ఊపిరితీస్తూ, అంతకంటే భారంగా వున్న రైఫిల్‌నీ, మరీ భారమైన భారతదేశ సరిహద్దుసంరక్షణబాధ్యతనూ మోస్తున్నారు. వారి బూట్ల టకటకలు, అప్పుడప్పుడు ఒకరి పోకడను ఒకరికి తెలుపుకొనే సంకేతాలూ తప్ప మరేధ్వనులూ వినిపించడంలేదు.

పటకుటీరంలో లెఫ్టినెంట్ మాధవరావు సన్నని కొవ్వొత్తి కాంతిలో ఉత్తరం వ్రాస్తున్నాడు. పన్నెండుమంది సైనికులు బ్లాంకెట్లలో ముడుచుకు కూర్చొని, రైఫిల్స్‌ను ఆనుకొని కునికిపాట్లు పడుతున్నారు. ఒక ప్రక్క స్టౌపైన టీకెటిల్‌లో నీరు సలసల మరుగుతూ విచిత్రమైన ధ్వనులు వినిపిస్తోంది. అప్పుడప్పుడు దగ్గరగా వినిపించే "పహరా హుషార్" హెచ్చరింపుకు మెలకువవచ్చిన సైనికులు అటూయిటూ చూసి ఆవలిస్తున్నారు.

మాధవరావు రిస్టువాచీవంక చూసాడు. ఒకటిన్నర గంటలైంది. లేచి, బయటకు

వెళ్ళి విజిల్ వూదాడు. కాసేపట్లో గస్తీ తిరిగిన ముగ్గురు సైనికులూ తిరిగివచ్చారు. వారికిబదులు మరో ముగ్గురి జట్టును పంపి, తిరిగివచ్చిన ముగ్గురికీ విశ్రాంతి తీసుకొన డానికి అనుజ్ఞయిచ్చాడు ఆ ముగ్గురూ మంచులో తడిసి, బిర్రబిగిసిన బూట్లను విప్పేసి, తిమ్మిరెక్కినట్లున్న పాదాలను రుద్దుకున్నారు. తలోకప్పు టీ కలుపుకొని త్రాగి, సిగరెట్లు వెలిగించారు

మాధవరావు సుదీర్ఘంగా వ్రాస్తున్న లేఖను చూచి జమాదార్ విష్ణుసహాయ్ దగ్గరగా జరిగి ''ఇంటికా ?'' అన్నాడు.

"అవును." అని క్లుప్తంగా జవాబిచ్చి, తిరిగి వ్రాయడంలో లీనమైపోయాడు మాధవరావు. కలం చరచర పరిగెడుతూంది.

''నాన్నా !

నేను చెప్పకుండా యింటిలోనుంచి పారి పోయి వచ్చినందుకు మీ అందరికీ కోపమూ, విచారమూ కలిగుండవచ్చును. కానీ అందులో నా తప్పేమీ లేదు. ఆ పరిస్థితుల్లో ఎవరైనా అంతే చేస్తారేమో ?

నేను మీరు పెద్ద కట్నంతో తెచ్చిన సంబంధం కాదని, కోరిన అమ్మాయిని కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటానని అన్నందుకు యింటిల్లిపాదీ నన్ను నిందించారు. ఆ అమ్మాయినికనుక పెళ్ళిచేసుకుంటే నాకూ, మీకూ సంబంధం లేదనేంతవరకూ గొడవ జరిగింది. ఆ ఆవేశంలో ఆ నాటి రాత్రే యిల్లువిడచి వచ్చేసాను. ఇప్పటికైనా మీరు మీ మనసును మార్చుకుంటారని ఆశిస్తున్నాను.

ఇంటిదగ్గర అందరూ కులాసా అనుకుంటాను. అమ్మని నా కోసం దిగులు పెట్టుకోవద్దని చెప్పండి. నేను ప్రస్తుతం మిలిటరీలో పనిచేస్తున్నాను. నేను యింటినుండి వెళ్ళిపోయి అప్పుడే సంవత్సరం పైగా అయింది. అందర్నీ చూడాలనుంది. త్వరలో సెలవు తీసుకొని వస్తాను. ఇందులో రెండు వందల రూపాయలు పంపుతున్నాను. మీ జవాబుకోసం ఎదురుచూస్తాను.

నమస్కారములతో, మాధవరావు..

కాగితాన్ని మడచి కవర్లోపెట్టి, జేబులో వేసుకున్నాడు. రేపు వెళ్ళే పోస్టులో పంపాలనుకున్నాడు. ఒక కప్పు టీ కలుపుకొని, బ్రెడ్, బిస్కట్లు తీసుకొని కూర్చున్నాడు. ఇంతలో వైర్లెస్ సెట్ "బజ్...బజ్..." మంటూ సిగ్నల్ యివ్వసాగింది. మాధవరావు వైర్లెస్ సెట్ స్విచ్ ఆన్‌చేసాడు.

''హలో...హలో—తేజ్‌పూర్ హెడ్ క్వార్టర్స్ కాలింగ్...ఎక్స్.. త్రీ ..నాట్... వన్...హలో...హలో...తేజ్‌పూర్ హెడ్ క్వార్టర్స్ కాలింగ్ ... ఎక్స్... త్రీ ... నాట్...వన్..."

మాధవరావు వైర్లెస్ మెసేజిని ఫ్లాష్ బేక్ చేసాడు.

''ఎస్...ఎక్స్...త్రీ...నాట్...వన్... స్పీకింగ్...హియర్...''

''ఏనీ...న్యూస్...''

"నో సర్...ఆల్ ..ఈజ్...క్లియర్.."

"ఓ. కే ... థాంక్యూ ... గెటాన్ ... యువర్...డ్యూటీ...లెఫ్టినెంట్..."

మాధవరావు వైర్లెస్ సెట్‌ను ఆఫ్‌చేసి, డైరీలో మెసేజి టైమునూ, విషయాన్ని నోట్ చేసుకున్నాడు. విష్ణుసహాయ్ ఆవలించాడు.

''చైనా దళాలు ఎక్కడన్నా చొరుచుకు వచ్చాయటనా ?"

"లేదు రొటీన్ మెసేజి."

"మొన్ననే వార్త వచ్చింది. లాసా నుంచీ అక్సాయిచిన్ మీదుగా సిపా, లదక్ సరిహద్దు ప్రాంతాలకు వాళ్ళ సైనిక సంచలనానికి వీలుగా భారీయెత్తున రోడ్లు వేసారట. మొన్న ఉదయం నేనూ, సార్జెంటు రఘువీర్ డ్యూటీమీద యిక్కడకు దక్షిణంగా తిరిగివస్తూండగా, మైలు మైలున్నర ఎగువలో ఒక చైనీస్ సైనిక దళాన్ని చూసాము. వారివెంట భారీశతఘ్నులుకూడా చూసినట్టు గుర్తు. అయితే వాటి జాడ పూర్తిగా కనుగొనేలోగానే అవి కనుమరుగైపోయాయి. నా కింకా అనుమానంగానే వుంది. వారీ చుట్టుపక్కలే ఎక్కడో స్థావరాన్ని స్థాపించి ఉండవచ్చును రేపు ఉదయాన్నే బయలుదేరి పూర్తిగా పరీక్షించాలి. నిన్న మరీ దట్టంగా మంచు కురుస్తుండడంవలన వెళ్ళలేకపోయాము.''

మాధవరావు విష్ణుసహాయ్ చేతిని అదిమాడు. "అంటే వారు సరిహద్దు దాటి వచ్చారు ?" అన్నాడు ఆత్రుతగా. అవునన్నట్లు విష్ణుసహాయ్ తలూపి, "అందులో ఆనుమానానికి ఆస్కారంలేదు. రెండు మూడుమార్లు యిలాగే చైనీస్ ముగ్గురు, నలుగురు జట్లుగా సరిహద్దు దాటి వస్తుండగా గట్టిగా మందలించాము. అయితే వారు పొరపాటు జరిగిందని సంజాయిషీ యివ్వడం వలన వదలిపెట్టాము. బహుశా వారు మన కన్నుగప్పి సరిహద్దుకి యీవల స్థావరం యేర్పాటు చేసుకొనుండవచ్చును.''

మాధవరావు కాస్త అసహనంగా కదిలాడు.

''అయితే ఇది చాలా తీవ్రవిషయమే. దీనిపై రేపే తగుచర్య తీసుకోవాలి. రేపు ప్రొద్దుటే బయల్దేరడానికి అందరినీ సిద్ధం చెయ్యి. అవసరమైతే పోరాటానికి తయారుగా వుండాలి,'' అంటూ యింకా యేమో చెప్పబోయి ఆగాడు.

అక్కడి వాతావరణానికి బాగా అలవాటు పడిన అతనికి దూరంగా ఎక్కడో మోగిన తుపాకిమోత స్పష్టంగా వినిపించింది. గబ

గవా బయటకువెళ్ళి తొంగిచూశాడు. ఏమీ కనిపించలేదు. బిగ్గరగా విజిల్ వూదాడు. గస్తీతిరగబోయిన సైనికుల్లో యిద్దరు తిరిగి వచ్చారు కాస్సేపటిలో. మరి రెండుమార్లు సంకేతమిచ్చినా మూడవ సైనికుని దగ్గర నుండి ప్రత్యుత్తరంలేదు. తిరిగివచ్చిన యిద్దరూ మూడవ సైనికుని పావుగంట క్రితం ఎగువభాగంలో చూశామని చెప్పారు. మాధవరావు కంగారుగా లోనికివచ్చి "ఎమర్జెన్సీ కాల్" యిచ్చాడు. సోల్జర్లందరూ ఆదరా బాదరా సామాన్లు పేక్ చేసేసి, దుస్తులు, ఆయుధాలు ధరించారు. పటకుటీరం వూడబెరికి కేన్వాసును చకచకా మడిచేశారు. సామానంతా ఒక రహస్యస్థలంలో దాచిపెట్టి, అక్కడతాము నివసించినట్టు కనిపించే ఆనవాళ్లన్నిటినీ తుడిచిపెట్టేశారు. ఒక మేప్, అత్యవసర సామగ్రి తీసుకొని మాధవరావు సైనికులను నిశ్శబ్దంగా నడవమని ఆజ్ఞాపించాడు. వారిని మూడు జట్లుగా విడదీసి, విష్ణుసహాయ్ క్రింద ఒక జట్టును గుట్ట లోయలోగుండాను, రెండవజట్టును రఘువీర్ ఆధిపత్యంలో ఎగువకు పంపి, తను మూడవ జట్టును తీసుకొని సూటిగా బయలుదేరాడు.

సైనికులు నిశ్శబ్దంగా, మెలకువతో ముందుకు సాగుతున్నారు. అడుగులో అడుగు వేస్తూ, పొంచి నడుస్తున్నారు. క్రూరమృగాలను వేటాడబోతున్న వేటగాడిలా మాధవరావు తీక్ష్ణంగా పరికిస్తూ ముందుకి నడుస్తున్నాడు. చీమ చిటుక్కుమన్నా వినిపించే గాఢ నిశ్శబ్దం. నల్లని నిశీథిలో అక్కడక్కడ పేరుకొన్న మంచు ముద్దలు చీకట్లో చిరుమెరుపుల్లా మెరుస్తున్నాయి. మంచు నిరవధికంగా కురుస్తోంది. ఉండుండి ఒకప్పుడు ఎక్కడో విరిగిపడుతున్న మంచుగడ్డల ధ్వని వినిపిస్తోంది.

అలా రెండు ఫర్లాంగులదూరం నడిచేసరికి మాధవరావు నిశితదృష్టికి నేలమీద పడున్న నల్లని ఆకారం లీలగా కన్పట్టింది. చీకటి పొరల్లోని మంచుతెరలను చీల్చుకుంటూ అతనిచూపులు క్రిందవాలాయి.

"హాల్ట్!" అన్నాడు మాధవరావు. సైనికులు రక్కున ఆగారు. మాధవరావు టార్చిలైటుతీసి, కాంతి వెలుపలకు ప్రసరించకుండా చేయడ్డుపెట్టి, నేలమీద ఆకారం పై వెలుగు పడేటట్లు పట్టుకున్నాడు. దుస్తులను బట్టి ఆ పడున్నది తమ సైనికుడే అని గ్రహించాడు. క్రిందకువంగి పరీక్షగా చూశాడు. బోర్లాపడుకున్న సైనికుని వెల్లకిలా తిప్పాడు. మృతిచెందిన సైనికుని ఛాతీపై రెండు తుపాకిగుండ్ల గాయాలు కనిపించాయి. వాటినుండి కారినరక్తం మడుగు కట్టి భీభత్సంగా కనిపిస్తోంది. ఆ సైనికుని బిగించిన పెదిమల్లో, అదిమిపట్టుకున్న రైఫిల్ రీతిలో తుదిక్షణంవరకూ తన దేశ సరిహద్దు రక్షణకోసరం పోరితీరాలనే దృఢ నిశ్చయం, విధినిర్వహణలో విశ్వాసం గోచరిస్తున్నాయి. మృత్యువుకూడా ఆ సైనికుని అతని కర్తవ్యాన్నుండి విముఖుడిని చేయలేకపోయింది.

తమతోటి సైనికసోదరుడు ఆవిధంగా హతమార్చబడుండటం చూచి సైనికుల వదనాల్లో విషాదమేఘాలు కమ్ముకున్నాయి. ఆ విధంగా వెన్నుపోటు పొడిచిన నీచుడెవరు? ఒక సైనికుడు పళ్ళుకొరుకుతూ "చైనీస్ నక్కలు యీచుట్టుపక్కలే ఎక్కడో నక్కుండాలి.'' అన్నాడు.

మాధవరావు మృతసైనికుని ఆత్మశాంతికై దైవాన్ని స్మరిస్తూ ఒక నిమిషంపాటు మౌనంగా నిలబడ్డాడు. ఆ సైనికుని మృతి అతడిలో భయాన్నిగానీ, దుఃఖాన్నిగానీ ప్రేరేపించలేకపోయింది. పైగా అతడిలో ఆ శత్రువును సరిహద్దునుండి తరిమికొట్టాలనే నిశ్చయం బలపడింది. సైనికుని మృత్యువు ఎప్పుడూ నీడలా యుద్ధరంగంలో అనుసరిస్తూనే వుంటుంది. మృత్యువుకు భయపడే సైనికుడు తన నీడనిచూచి తనే భయపడే పిరికి మనిషివంటివాడే. భారత సైనికుని లక్ష్యం తన ప్రాణం కాపాడుకొనడం ఒక్కటేకాదు, ముఖ్యమైనది దేశ రక్షణ!

తరతరాలుగా భారతవీరుల శౌర్య, సాహసాలూ, ధర్మపరాయణత్వం, దృఢవిశ్వాసం ఔదార్యం, అభిమానం పేరుపడినవి. ఎన్నోమార్లు ఓడినా, ఎంతో జనాన్ని, ధనాన్ని కోల్పోయినా యిసుమంతైనా లొసుగు చూపక, లొంగుబాటుకాక నిరంతరం భారత జాతీయత నిలుస్తూనే వచ్చింది. స్వాతంత్ర్యం స్వేచ్ఛలకోసం పోరాడేవీరులు ఎప్పుడూ ఉద్భవిస్తూనే వచ్చారు. ఎందరో తమ దేశ భక్తికి, శౌర్యధైర్యాలకు ప్రసిద్ధిచెంది, చరిత్రపుటలకెక్కారు. ఆ వీరులలో ప్రవహించిన స్వచ్ఛమైన భారతీయ స్వేచ్ఛాభావమే యా సైనికుల రక్తంలోనూ ప్రవహిస్తోంది. ఆ భావం యేనాడూ అడుగంటదు.

మాధవరావు ఆ సైనికుని ముఖంమీదుగా గుడ్డ కప్పిలేచాడు.

"మార్చ్ ఆన్!"

అతని అనుజ్ఞవింటూనే సైనికులు చురుగ్గా కదిలారు. వారితోబాటే ప్రతీకారేచ్ఛ కదిలింది. ఆ సైనికుని హతమార్చిన దుష్టులు అక్కడికి సమీపంలోనే వున్నారనేది నిశ్చయం. ఎక్కడున్నారో మెలకువగా, వారికంట పడకుండా కనుక్కోవాలి. మాధవరావు దారిని పరిశీలిస్తూ ముందుకు సాగుతున్నాడు. అక్కడక్కడ బూట్ల ముద్రలు మట్టిలో కనిపించాయి. సైనికులకు శత్రువులు సమీపంలోనే వున్నారని సంజ్ఞచేసాడు

మాధవరావు. సైనికులు పోరాటానికి సిద్ధంగా రైఫిల్సుపట్టుకొని, చెట్లచాటుగా నడవసాగారు

అలా అరమైలు దూరం నడిచి, మాధవరావు తన జట్టును ఆపాడు. నలభై గజాల దూరంలో యిద్దరు చైనీస్ సైనికులు సబ్ మెషిన్‌గన్స్‌తో గస్తీ తిరుగుతూ కనపడ్డారు మరికాస్త దూరంలో రెండు గుడారాలూ, ఒక భారీశతఘ్నీ కనిపిస్తున్నాయి పాతికమందిదాకా గుడారం చుట్టూ కందకాలు త్రవ్వే పనిలో నిమగ్నులై వున్నారు. గుడారాలలోనుండి సన్నని దీప కాంతులు, సంభాషణం ధ్వనులూ వెలికి వస్తున్నాయి.

ఎగువభాగాన్నుండి సార్జెంటు రఘువీర్ తాము చేరుకున్నట్లు సంకేతమిచ్చాడు. వేచివుండమని తిరుగుసంకేతం యిచ్చాడు మాధవరావు

మెరుపుదాడిచేయడానికి తగిన పథకం అంతకుముందే పన్నాడు. ఆ పథక ప్రకారం వ్యూహం యేర్పరిచాడు. ఎదురుదెబ్బతీసే అవకాశం శత్రువులకి యివ్వరాదు. ఒక్కమారు తీవ్రాఘాతంతో వారికి దిగ్భ్రమ కలిగించి, స్థావరాన్నిపట్టుకొని వారందరినీ సరిహద్దు అవలకు తరిమివేయాలి.

ఎదురుదెబ్బతీసే అవకాశం శత్రువులకు లభిస్తే, తాము దెబ్బతినటం తప్పదు. సంఖ్యాబలంలో తన బలగానికి నాలుగైదు రెట్లవరకూ చైనీస్ సైనికులువుండవచ్చునని మాధవరావు అంచనావేశాడు. అంతేకాక వారు యుద్ధానికి సిద్ధపడే అత్యాధునిక మారణాయుధాలతో వచ్చారు. తాము కేవలం సరిహద్దుకాపలాలో అలవాటు ప్రకారం మామూలు రైఫిల్సుమాత్రం ధరించారు. పైగా ఎక్కువకాలం నిలిచి పోరాడ్డానికి వీలుగా కాటోలు, అప్పుడే వారు కందకాలు కూడా త్రవ్వుతున్నారు.

మాధవరావు తనజట్టును అర్థ వలయాకారంలో నిలిపి వ్యూహం పన్నాడు ఎగువనున్న రఘువీర్‌కి అదేవిధంగా అర్థవలయ వ్యూహం పన్నమని సంకేతమిచ్చాడు. అయిదు నిముషాల్లో చైనీస్ దురాక్రమణచేసి నిర్మించిన స్థావరంచుట్టూ భారతదళం చక్ర వ్యూహంపన్ని మోహరించింది. ఇక విష్ణు సహాయ్ రాగానే, అతన్ని ఎదురుదాడికిపంపి, శత్రువులదృష్టిని చెదరగొట్టి, వెంటనే వారిని చక్రవ్యూహంలో అదిమిపెట్టాలని మాధవరావు ఎత్తువేశాడు విష్ణుసహాయ్ రాబోయేమార్గం శత్రుస్థావరానికి సూటిగా, సమీపంగా వున్నది. ఏమైనా అది ప్రమాదకరమైన ప్రయత్నమే · కానీ తానిచ్చిన సూచనల ప్రకారం మెలకువగా ప్రవర్తిస్తే, శత్రువులను తిప్పికొట్టవచ్చు. అంతా విష్ణుసహాయ్‌మీద ఆధారపడుంది. అయితే విష్ణుసహాయ్‌ది దుడుకుస్వభావం. చటుక్కున వ్యూహరచనమరచి, శత్రువుల మధ్యకు చొరుచుకుపోయి పోరాడుతాడు. భారతదేశం సరిహద్దుపైన చైనీయులు దురాక్రమణ చేశారన్నవార్త విన్నప్పటి నుండి అతని గుండెలు మండిపోతున్నాయి. ఆ ఆవేశంలో అతడేమిచేసినా చేయవచ్చును అందుకనే మాధవరావు ఆందోళన పడుతున్నాడు. తను తప్పుపనిచేశాడు. ఆవంకగా రఘువీర్‌ని పంపివుండవలసింది. అయినా చైనీస్ యిక్కడున్నారని తను మొదట్లో కలగన్నాడా ?

మాధవరావు అనుకున్నంతా అయింది. విష్ణుసహాయ్‌వచ్చి, చైనీస్‌లను గుర్తిస్తూనే మెరుపులా చైనీస్ స్థావరంపై దాడిచేశాడు. చైనీస్‌లు వచ్చినదెవరో గ్రహించేలోపలే రెండు రౌండ్ల కాల్పులతో గస్తీసైనికులను. కందకాలు త్రవ్వుతున్నవారిలో కొందరిని మట్టుపెట్టారు విష్ణుసహాయ్ జట్టు. చైనీస్‌లు గాభరాతో గబగబా ఆత్మరక్షణకు పూనుకున్నారు. సబ్ మెషిన్‌గన్లతో ఎదురు కాల్పులు ప్రారంభించారు.

మాధవరావిక తటపటాయించలేదు. ''సరెండ్'' అనరిచాడు.

భారతదళం స్థావరాన్ని చక్రవ్యూహంలో చుట్టుముట్టి కాల్పులు ప్రారంభించింది. విష్ణుసహాయ్ ఎనిమిదిమందిని కూల్చి, తాను కూలిపోయాడు. ఈ అనుకొనని సంఘటనతో మాధవరావు వ్యూహం తారుమారైంది. ఒక్కమారు చుట్టుముట్టి వారిని నిరాయుధులనుచేసి బంధిద్దామనుకున్నది కాస్తా యుద్ధంగా పరిణమించింది. శత్రుదళానికి పోరాటంజరిపే అవకాశం దొరికింది.

కానీ అతని సూచనలమేరకు మాధవరావు దళం జరిపిన కాల్పులతో శత్రుబలగంలో మూడవవంతు కూలిపోయింది. మిగతావారు రక్షణ కందకాల్లోదిగి ఎదురు కాల్పులు చేయసాగారు చైనీస్ భారీశతఘ్ని నలువంకలా తిరుగుతూ నిప్పులు కక్కుతూంది. దాని తాకిడివల్ల భారతదళం చొరవగా ముందుకు చొరుకుకొని వెళ్ళలేకపోతూంది. వారు సబ్‌మెషిన్‌గన్సు, ఆటోమెటిక్ రైఫిళ్ళతో కాల్పులు చేస్తున్నంత వేగంగా భారత సైనికులు మామూలు రైఫిల్సుతో కాల్పులుచేయలేకపోతున్నారు. పైగా ఎదుటిదళం కందకాల్లో వుండడంవలన మరికొంత వ్యర్థమవుతూవచ్చింది. ఇంతలో వారి వెనుకనుండి వేరొక చైనీస్‌దళంవచ్చి తలపడింది. భారతదళం చైనీస్ అదకత్తెర వ్యూహంలో చిక్కుకుంది.

ఇక పోరాడి లాభంలేదని, పోరినట్టు నటిస్తూ, వెనక్కి తగ్గి వారి స్థావరాన్ని నాశనంచేసి తప్పుకుపోవాలని నిశ్చయించు

కున్నాడు మాధవరావు. చక్రవ్యూహం విడగొట్టేసి చైనీస్ రాగానే గొరిల్లా యుద్ధ పద్ధతి అవలంబించాడు. అతని సంకేత ప్రకారం భారతదళమంతా యిద్దరిద్దరు జట్లుగా విడిపోయి, నేలకు వ్రాలిపోయి, ప్రాకుతూ ఎగువకు చేరుకున్నారు. ముందు వెనుకలనున్న చైనీస్ సైన్యాలను భ్రమలో వుంచడానికి సార్జెంటు రఘువీర్, మరిద్దరు సైనికులు ఉండుండి అటూఇటూ కాల్పులు సాగిస్తూ వారి అడుగు కదలకండా అరికట్టారు. మాధవరావు దగ్గరనుండి మళ్ళీ సంకేతంరాగానే వారు ముగ్గురూ ఒకేవంక చేరి ఉధృతంగా కాల్పులు జరపసాగారు. చైనీస్ తమదృష్టిని, బలాన్ని అటు కేంద్రీకరించారు. అది అదనుగా తీసుకొని ఎగువ భాగంనుండి నిశ్శబ్దంగావచ్చి, అక్కడి గస్తీ సైనికులను కిక్కురుమనకుండా మట్టుపెట్టి, స్థావరంపై పిడుగులా విరుచుకుపడ్డాడు. చైనీస్ సైనికులను చెల్లాచెదురుచేసి, వారి స్థావరాన్ని, సామగ్రిని మూడు హేండ్ గ్రెనేడ్లతో ధగ్ధపటలం కావించాడు. మరో క్షణం మరలిపోయి, చీకట్లో కలిసిపోయాడు. అతని మెరపుదాడికి గొరిల్లా యుద్ధనిపుణులని పేరుపడిన చైనీస్ సైనికులే నివ్వెరపోయారు. కానీ వారు అంతసేపూ తమను నిలవరించిన రఘువీర్‌ను, మిగతా యిద్దరు భారత సైనికులను బలితీసుకున్నారు.

వెనక్కు మరలిపోతూనే మాధవరావు సార్జెంటు రఘువీర్ వీరోచిత బలిదానానికి జోహారులర్పించాడు. రఘువీర్ ఆటంకం తీరిపోగానే చైనీస్ దళం మాధవరావును వెంటాడసాగింది. వారు కొన్ని వందల సంఖ్యలో వున్నారు. వారిని మాధవరావు తనవద్ద మిగిలిన నలుగురితో నిలవరించి పోరాడడం తలకుమించినపని. అందువలన ఎలాగైనా తప్పించుకొని, హెడ్‌క్వార్టర్సుకు యీ వార్త అందించాలని నిశ్చయించుకున్నాడు మాధవరావు. ఆ తరువాతే మరేపనైనా. చైనీస్‌దళం కసిగా వెంటాడుతూంది. అక్కడక్కడ కాల్పులతో అదిలించి, చైనీస్ దళాన్ని తప్పుదారి పట్టించి, తన మునుపటి స్థావరం చెంతకు చేరుకున్నాడు మాధవరావు.

చైనీస్ సైనికులు సరైనమార్గం కనుక్కొని వచ్చేసరికి మరో అయిదు నిమిషాలు పట్టవచ్చును. ఆ వ్యవధిలో తాము తప్పించుకుపోవాలి.

మాధవరావు ఏర్పరుచుకొన్న స్థావరం రెండు గుట్టలమధ్యగావుంది. వాటి మధ్యగల మార్గంనిడివి అయిదుఅడుగులు. ఆమార్గాన్ని నిరోధిస్తే గుట్టలచుట్టూ రెండుమైళ్ళ దూరం తిరిగిరావలసుంది. మాధవరావు బాగా ఆలోచించి ఆమార్గాన్ని నిరోధించాలనే నిశ్చయించాడు. తమకు అత్యవసరమైన సామగ్రి తీసుకొని, ఒక గొయ్యిలో మిగతా సామానంతా వేసి మందుగుండూ, గ్రెనేడ్లూ దట్టించారు. అందులోనుండి గుట్టలమధ్య పాతిక గజాలవెనుకనున్న మలుపువరకూ ఫ్యూజ్‌వైర్ అమర్చి, పైన మామూలుగా మట్టి కప్పివేశారు. వారీపనంతా ముగించేటప్పటికి చైనీస్ సైనికుల తుపాకీకాల్పుల చప్పుళ్ళు, శాపనార్థాలు దగ్గరగా వినిపించసాగాయి.

మాధవరావు, నలుగురు సైనికులూ మలుపులో దాగారు. వారిని మందుగుండు దట్టించిన ప్రాంతానికి రానిచ్చి, ఫ్యూజ్‌వైర్ ముట్టించాడు మాధవరావు. చకచకా ముందుకు సాగిపోయారు. రెండు నిమిషాలలో బ్రహ్మాండమైన ధ్వనిచేస్తూ మందుగుండుప్రేలి,ఆమార్గాన్ని బండరాళ్ళతో కప్పివేసింది. చైనీస్ దళంలో ముందున్నవారు వాటిక్రింద జీవసమాధి అయిపోయారు. మిగతావారు వెనక్కి తగ్గారు.

మాధవరావు శరవేగంతో వెనక్కి మరలిపోసాగాడు. అలా నాలుగుమైళ్ళ దూరం నిర్విరామంగా నడచిన తరువాత, అలసట తీర్చుకొనేందుకు ఆగారు. విశ్రాంతి తీసుకుందామనుకుంటూండగానే వారిముందు వేరొక చైనీస్‌దళం సాక్షాత్కరించింది. అంతకుముందు తాముచూసిన చైనీస్‌దళానికి ఆహారపదార్థాలూ, మందుగుండూ, ఇతర సామాగ్రి చేరవేసేసప్లయిదళమని గుర్తించాడు మాధవరావు. వెంటనే రెండు గ్రెనేడ్లతో సామాగ్రి శకటాలను ప్రేల్చేసి, వారిపై తలపడ్డాడు. చాకచక్యంగా పోరాడి వారిని చెదరగొట్టి, అదరగొట్టాడు. చైనీస్ సరఫరాదళం యీ మెరపుదాడితో బెదరి, సామాగ్రిని దిగవిడచి పలాయనం చిత్తగించింది. వారు వదలివేసిన సామాగ్రినంతా నిరుపయోగకరంగా చేశాడు మాధవరావు. తృప్తిగా శ్వాసవిడచి, వెనక్కి తిరిగేసరికి అతడివెంట ఒకేఒక సైనికుడు ప్రాణాలతో మిగిలాడు. మిగతా ముగ్గురూ విధి నిర్వహణలో......

"సార్! వారు...'' నోటితో చెప్పలేక చేతితోచూపాడు మిగిలిన సైనికుడు తోటి వారి మృతశరీరాలను. వీరోచితంగా పోరి, మాతృదేశంకోసం ప్రాణాలు అర్పించిన వారికోసం రెండు అశ్రుకణాలను రాల్చారు. ఇంకాఆగితే మళ్ళీ చైనీస్‌దళాలు రావచ్చునని పదమని మిగిలినసైనికుని తొందరపెట్టాడు మాధవరావు. కానీ అతడు కదిలేస్థితిలో లేడు. కుడుభుజంపైనా, కుడికాలు మీదా బలమైన గాయాలు తగిలాయి. వాటి బాధతో అతడు మెలికలు తిరిగిపోతున్నాడు.

"లెఫ్టినెంట్! తాముక్షేమంగా వెళ్ళిరండి. నాగురించి ఆలోచించవద్దు.'' అన్నాడు. కానీ మాధవరావు హృదయం అతడిని ఆ

దుస్థితిలో వదలిపోవడానికి అంగీకరించలేదు. ఆతడొక భుజానా రైఫిల్ రెండవభుజానా, వేసుకొని వైర్లెస్ సెట్‌ను వీపున కట్టుకొని బయలు దేరాడు.

అలా మైలున్నర దూరం నడిచి ఒక సురక్షిత ప్రాంతానికి చేరాడు. సైనికుని క్రిందకుదించి, తన మఫ్లర్ చించి కట్లు కట్టాడు. మధ్యాహ్నం రెండుగంటలైంది. వారిద్దరికీ దాహంతో గొంతు ఆర్చుకు పోతూంది. ఆ సైనికుడు తన వేదనను వెలికి వ్యక్తపరచకుండా పండ్లు గిట్టగరిచి దిగ మింగుకుంటున్నాడు. మంచినీళ్ళకోసం వెతికి వెతికి నిరాశగా తిరిగివచ్చాడు. మంచుగడ్డలు చితక్కొట్టి చప్పరించబోయినా, అవి నోట నిలవటంలేదు. మృత్యుచ్ఛాయలలో వయ సిస్తున్న సహచరుని చూసి నిస్సహాయంగా నిట్టూర్చాడు మాధవరావు. ఆ సైనికుడు సాదరంగా మాధవరావు చేతిని అదిమి అన్నాడు :

"లెఫ్టినెంట్! నా భార్యకు నా తుది సందేశం దయచేసి వ్రాస్తారా?"

మాధవరావు జేబులోనుండి డైరీతీశాడు. సైనికుడు చెప్పసాగాడు :

నా ప్రియమైన చాందీ!

నా ఆఖరిక్షణాల్లో నా కోరికపైన నా ప్రియ మిత్రుడైన లెఫ్టినెంట్ మాధవరావుగారు యీ నా తుదిజాబు వ్రాసిపెడుతున్నారు. నా విధి నిర్వహణను నేను సంతృప్తిగా నిర్వర్తించాను. ఇక కొద్దికాలంలో నేను మరణిస్తానని నాకు తెలుసు.

చాందీ! నాకోసం బెంగపెట్టుకొని కృశించవద్దు. మన అబ్బాయి అహమద్‌ను పెంచి, పెద్దచేసి భారత సైన్యంలో చేర్పించు. అదే నా తుదికోరిక. నీవలాచేస్తే ఆత్మశాంతిని నాకు చేకూర్చినదాన వవుతావు. మరచిపోవద్దు.

అహమద్‌కు నాతుది దీవనలు. ఇందులో నా ఉంగరంకూడా పంపుతున్నాను. దాన్ని నా జ్ఞాపకచిహ్నంగా అహమద్ చేతికి అలంకరించు. అల్లా మిమ్మలను కాపాడు తాడు.

నీ

జలాలుద్దీన్.

వణికేచేత్తో ఆ సందేశంక్రింద దస్కతు చేశాడు సైనికుడు. వుంగరం తనవ్రేలినుండి తీసి యిచ్చాడు. అతనికళ్ళు కృతజ్ఞతతో తొణికిసలాడాయి.

"లెఫ్టినెంట్! వీటిని జాగ్రత్తగా మా యింటికి పంపండి. మీరు క్షేమంగా వుండాలని దైవాన్ని ప్రార్థిస్తున్నాను. జైహింద్..."

అతని కుడిచేయి నొసటివరకులేచి పడి పోయింది. మాధవరావు నిశ్చలంగా, సజల



నయనాలతో అతనివంక చూశాడు. పక్కనే గొయ్యితవ్వి, అతనిని సమాధిచేశాడు.

మాధవరావుకి తనవిధి జ్ఞప్తికివచ్చింది. వైర్లెస్ సెట్ ఆన్‌చేశాడు.

"హలో! హలో! .త్రీ...నాట్..వన్... కాలింగ్......హెడ్‌క్వార్టర్స్......హెడ్ క్వార్టర్స్...త్రీ..నాట్ ..వన్...కాలింగ్."

రిసీవర్‌లో గురగురశబ్దం తప్ప జవాబు రాలేదు.

మీటర్‌ను సరిజేసి, మళ్ళీ మెసేజిని ట్రాన్స్‌మిట్‌చేసాడు. ఈమారు ప్రసారం సరైనస్థాయిని చేరుకుంది.

"హలో...హలో....త్రీ....నాట్... వన్....కాలింగ్....హెడ్‌క్వార్టర్స్..."

"ఎస్...హెడ్‌క్వార్టర్స్...స్పీకింగ్... హియర్...రిపోర్ట్..."

"చైనీస్...హెవీ...ఎటాక్.. ఓవర్... బోర్డర్...ఫైవ్‌మైల్స్...

నార్త్...టు...బోమ్‌డిలా...సెండ్... హెల్ప్...అర్జెంట్..."

"ఎస్...లెఫ్టినెంట్...వుయ్...సెండ్... హెల్ప్...ప్లీజ్...వెయిట్."

"థాంక్యూ..."

మాధవరావు వైర్‌లెస్ సెట్‌ను ఆఫ్ చేసాడు. సహాయం వచ్చేటప్పటికి ఎంత సేపు పడుతుందోయేమో? ఎప్పుడు వస్తుందో?

క్షణాలు యుగాల్లా గడుస్తున్నాయి. దాహంతో గొంతుకెండి, నాలుక పిడచ గట్టుకొనిపోయింది. చుట్టూఉన్న ప్రకృతి గిరగిరమని తిరుగుతున్నట్లుంది కళ్లు విప్పినప్పుడు. ఏవో అస్పష్ట ఆకారాలు, రంగు రంగుల నీడలు కళ్ళెదుట కదులుతున్నాయి.

"ఏమిటవి? దెయ్యాలా?......ఛీ! ఛీ! ఏమిటీభ్రమలు? తన మనసు వశం తప్పుతోంది." అనుకుంటూ మాధవరావు నీరసంగా కళ్ళు మూసుకున్నాడు. నీరసంపై అతడికి నిద్రవచ్చింది. అలా ఎంతసేపు నిద్రపోయాడోగానీ, విమానం మోత వింటూ కళ్ళువిప్పాడు. కాలు కదిపేస్థితిలో లేడు అతడు. మొదట ఆ మోత కూడా తన భ్రమేనేమో అనుకున్నాడు. చెవులు ఎప్పటి నుండో గింగురుమంటున్నాయి.

కానీ నిజంగానే పైన విమానం ఎగురుతోంది. చిన్న హెలికాప్టరు భూమికి అతి సమీపంగా, నెమ్మదిగా సాగుతూంది. దానిపై మెరుస్తున్న ఐ.ఏ.ఎఫ్. అన్న అక్షరాలనుచూసి మాధవరావు కళ్ళు ఆశతో మెరిసాయి. వెంటనే తలమీది కేప్‌తీసి, శక్తిఅంతా కూడగట్టుకొని విమానంవంక ఊపాడు. హెలికాప్టర్ అతని ఉనికిని గుర్తించినట్లు, ఆ స్థలంపైనే మూడు చక్కర్లుకొట్టింది. మూడవచక్కర్లో భూమికి అతి సమీపంగావచ్చి ఒక బంగీని మాధవరావు చెంతకు జారవిడిచింది. దూరమైపోతున్న హెలికాప్టరువంక అభినందన సూచకంగా చేయూపి, మాధవరావు ఆ బంగీని అందుకున్నాడు. బంగీ విప్పాడు.

అందులో ఆహారపదార్థాలూ, గడ్డపాల టిన్నూ, సిగరెట్లపాకెట్లూ, ఊలుదుస్తులూ వున్నాయి. అవన్నీకాక మాధవరావు దృష్టిని వేరొక చిన్నపాకెట్టు ఆకర్షించింది.

ఆపాకెట్‌పైన లేబిల్ చదివాడు:

"ప్రియ సైనిక సోదరులకు భారత ప్రజల దీపావళి కానుక. మీకు దీపావళి శుభాభి వందనాలు."

ఆ పాకెట్లో నాలుగైదు రకాల స్వీట్లున్నాయి.

భారత ప్రజలకు తమపైగల విశ్వాసాన్ని, ఆదరాన్ని, అభిమానాన్ని తలచుకొనగానే మాధవరావు ఒళ్ళు పులకరించింది. వారు తమపై ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. వారి నమ్మకాన్ని వమ్ము చేయకూడదు.

తిరిగొచ్చిన విశ్వాసబలంతో మాధవరావు లేచి నిలబడ్డాడు. ఆహార పదార్థాలు గొంతు తడి అవుతేగానీ సహించేటట్లులేవు. కొన్ని ఆకులను నమిలి, నాలికను స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. గడ్డపాలు, రొట్టె తిని బయలుదేరాడు.

ఇంతలో అటుప్రక్క మరెవరో వస్తున్నట్లు ఆకుల గలగల వినిపించింది. మాధవరావు చటుక్కున ఒక చెట్టు చాటుకు తప్పుకొని, రైఫిల్‌ను తయారుగా పట్టుకొని, ఆ వచ్చేది చైనీస్ సైనికులైతే కాల్చిపారేయడానికి సిద్ధంగా నిలబడ్డాడు. ఆ వస్తున్నది ఎవరు?

ముందుగా అతడికి కనపడినది వేరొక తుపాకీ!

అటువంకగా రైఫిల్ గురిపెట్టి, మీటమీద వేలు నొక్కిపట్టి...

మరుక్షణంలోనే...

అవతలి వ్యక్తి ఎదురువచ్చాడు.

తక్షణం...

మాధవరావు రైఫిల్ దిగోచివేసాడు.

ఆ వచ్చినది వేరొక భారత సైనికుడు.

మాధవరావు వెళ్ళి అతడిని కలుసుకున్నాడు. అతడుకూడా సరిహద్దు రక్షణ సైన్యంలోనే పని చేస్తున్నాడనీ, చైనీస్ అర్ధరాత్రి వారి దళాన్ని ఆక్రమించగా తప్పించుకొని వచ్చాడనీ మాధవరావు తెలుసుకున్నాడు.

"నా పేరు హరామ్‌సింగ్! మీరుకూడా మాలాగే దెబ్బతిన్నారన్నమాట. బాగుంది. ఏమైనా ఆహారపదార్థాలున్నాయా? రెండు రోజులమంచి తిండిలేదు."

"నాకు గొంతుక తడుపుకొవడానికి నీళ్ళయినా దొరకలేదు" మాధవరావు నవ్వి అన్నాడు.

"ఇలాగా ! రండి. చూపిస్తాను."

హరామ్‌సింగ్ మాధవరావును ఒక సెలయేటి చెంతకు కొనిపోయాడు. మాధవరావు దప్పిక తీర్చుకొని, తనదగ్గిర వాటర్ బాటిల్ నింపుకున్నాడు. ఇద్దరూ కడుపునిండా తిని, విశ్రాంతి తీసుకున్నారు. ఆపైన మేప్ తీసి, తాము పోవలసిన మార్గం నిశ్చయించారు.

నిర్విరామంగా నడిచి వారు తేజ్‌పూర్ చేరుకున్నారు.

తేజ్‌పూర్ అంతా అల్లకల్లోలంగా వుంది. చైనీస్ తేజ్‌పూర్‌ను ముట్టడించబోతున్నారనీ, వచ్చేసారనీ అనేక వదంతులు వినిపిస్తున్నాయి. చాలామంది ఇళ్లూ, వాకిళ్ళనూ, పట్టణాన్నీ విడిచి పోతున్నారు. సైనిక శకటాలూ, తదితర వాహనాలూ ఉరకలు వేస్తూ పరిగెడుతున్నాయి. ఇదంతా చూస్తూ మాధవరావూ, హరామ్‌సింగ్ తిన్నగా ఆర్మీ హెడ్‌క్వార్టర్స్‌కు చేరుకున్నారు. అక్కడి అధికారులు వారిని సాదరంగా ఆహ్వానించి, వార్తలు అడిగారు.

మాధవరావు పట్టణంలో ప్రచారమవుతున్న వదంతులను ఖండించాడు. అవన్నీ అబద్ధమని అధికారులకి వివరించి చెప్పాడు.

''చైనీస్ అంతముందుకు చొచ్చుకొని రాలేదు. మన సైనికులు అడుగడుగుకి ప్రతిఘటించి, శత్రువుని నిలిపి పోరాడుతున్నారు. తేజ్‌పూర్‌కు ప్రస్తుతం దాడికి లోనయ్యే ప్రమాదం లేదు. మన ప్రయత్నాలను బలహీనపరిచి, ప్రజలలో అశాంతి రేకెత్తించడానికి ఎవరో దేశద్రోహులో, శత్రు గూఢచారులో యీ నీలి వార్త కలిపించారు. ఈ సంగతి వెంటనే ప్రజలకు తెలియపరచి, వదంతులను ఖండించండి.''

కొందరు అధికారులు ఆ విధి నిర్వర్తించడానికి వెళ్ళారు. యువజనులు కొందరు మురాగా యేర్పడి, తక్షణ బాధ్యతలు స్వీకరించారు. వారు ప్రజల ఆస్తిపాస్తులకు, శాంతి భద్రతలకు ముప్పు రాకుండా కట్టుదిట్టాలు చేసారు. తేజ్‌పూర్‌లో పరిస్థితిని అదుపులోనికి తీసుకువచ్చారు.

అధికారులు అతిత్వరితంగా వేరొక దళాన్ని బోమ్‌డిలా ప్రాంతాలకి పంపడానికి యేర్పాట్లు చేసారు. మాధవరావు, హరామ్‌సింగ్ కూడా ఆ దళంతో వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. మాధవరావు తను వ్రాసిన ఉత్తరాన్ని, తనతోటి సైనికుడు జలాలుద్దీన్ చనిపోతూ వ్రాయించిన లేఖనూ, ఉంగరాన్నీ యిండ్లకు పంపమని అధికారులకు అప్పగించి, బయలుదేరాడు.

బోమ్‌డిలా ప్రాంతాలలో బాగా పరిచయమున్న మాధవరావునే సర్వాయుధ సన్నిద్ధమైన కొత్త భారత దళానికి కమాండరుగా నియమించి పంపారు. అనుపానులూ, లోతుపాతులూ బాగా గ్రహించిన మాధవరావు చైనీస్ దళాలపై పిడుగులా విరుచుకుపడ్డాడు. ఈమారు తీవ్రమైన పోరాటాలు జరుపుతూ, చైనీస్ దళాలను ముందుకు చొరుచుకొని రాకుండా, వెనక్కి నెట్టసాగాడు.

ఆనాడు ఆవేశంతో చైనీస్ వ్యూహమధ్యానికి పోయి పోరాడుతూ మాధవరావు దెబ్బతిన్నాడు. అతని ఎడమచెయ్యి తీవ్రంగా గాయపడింది. తనను చుట్టుముడుతున్న శత్రువులను చూచి, రైఫిల్‌ని చెడగొట్టిమరీ లొంగిపోయాడు. నాయకుడు లేకపోయినా భారతదళం చైనీస్ దళాన్ని తరిమివేయగలిగింది. కానీ వారి చేతిలో మాధవరావు ఖైదీగా వుండిపోయాడు.

విశాల భారతదేశమంతటా చైనా దురాక్రమణపట్ల నిరసన వ్యాపించింది. "భారత్ — చైనా భాయ్ — భాయ్'' అన్న పెద్దమనుషులే యీనాడు దురాశతో దురాక్రమణకు పూనుకున్నారు. మిత్రునిలా నటిస్తూనే వెన్నుపోటు పొడిచారు. ఈ నీచ ద్రోహానికి ప్రపంచం నలుమూలలనుండీ నిరసన తెలపబడింది. భారతదేశం అంతటినుండీ రక్షణ నిధికని కనకవర్షం కురుస్తోంది. జాతీయ భావం వెల్లివిరుస్తోంది. వీరులైన మన జవానుల వీరగాధలను విని ఒళ్ళు పులకిస్తోంది.

దురాశతో దురాక్రమణ జరిపిన చైనీస్‌కు భారత సైనికులు ఆనకట్టలా అడ్డుపడ్డారు. అమెరికా, బ్రిటన్లు భారతదేశానికి తమ సత్వర సహాయాన్ని అందజేసాయి. చివరికి ఏమనుకున్నారో ఏమో? చైనా నాయకులు పైకిమాత్రం శాంతి పాఠం వల్లించి, దాడిని ఉపసంహరించుకున్నారు. ఒప్పందం చేసుకుందా మంటూనే, మరొకవంక భారత వ్యతిరేక ప్రచారం చేస్తున్నారు. కానీ యిక పైన వారి కల్లబొల్లి కబుర్లకు భారతదేశం మోసపోవడం కల్ల!

రెడ్‌క్రాస్ అధ్వర్యంలో యుద్ధ ఖైదీలను విడిపించడానికి ఏర్పాట్లు జరిగాయి. మొదటి విడత జట్టులో మాధవరావుకూడా విడుదలయ్యాడు. అతని యింటికి అతని రాకను తెలుపుతూ అధికారులు టెలిగ్రాం పంపారు. మాధవరావు తల్లీ, తండ్రీ ఆత్రుతగా తేజ్‌పూర్ చేరుకున్నారు.

ఆనాడు తేజ్‌పూర్ మహా హడావుడిగా వుంది. మళ్ళీ అక్కడి పరిపాలనా, ప్రజానీకం యధాప్రకారం తమ కార్యకలాపాలు కొనసాగించుకొంటున్నాయి. మొదటి జట్టులో విడుదలైన భారత సైనికులు తేజ్‌పూర్ చేరుకున్నారు. వారిలో గాయపడిన సైనికులు హాస్పిటల్‌లో చేర్చబడ్డారు. బంధువులు, మిత్రులు, అధికారులు వారిని పరామర్శిస్తున్నారు.

రేడియోలో వార్తలు వెలువడుతున్నాయి.

భారత సైనికుల వీరకృత్యాలను వర్ణిస్తున్నారు. ఈనాడు అఖండ భారతావని ఒకసైచైనా దురాక్రమణను గర్హిస్తోంది. అత్యుత్తమ పరాక్రమం ప్రదర్శించిన సైనికులకు పతకాలు బహూకరింప బడినాయి. మాధవరావుకి "మహావీరచక్ర" వచ్చింది.

మాధవరావు విచారిస్తున్న తల్లిని ఓదార్చాడు :

"ఎందుకమ్మా ఏడవడం ? నా వొక్క చేయి పోయినందుకేనా ? అమాటకొస్తే నా తోటి సైనికులెందరో ప్రాణాల్నే బలి పెట్టారు. పైగా ప్రభుత్వం నాకు పతకాన్ని బహూకరిస్తోంది. ఆ గౌరవం చాలదా అమ్మా ! ప్రజలు నన్ను గొప్ప వీరునిగా పొగడుతున్నారు. ఇంకా జీవితంలో కావలసినది ఏముంది ? నా దేశంకోసం అవసరమైతే ఒక్క చేతనే ఆయుధం పడతాను."

ఇంతలో భారత ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ విడుదలైన సైనికులను స్వయంగా పరామర్శించడానికి విచ్చేశారు. ఆయన కోటుపై గుచ్చిన ఎర్రగులాబీలాగనే ఆయన పెదవులపై చిరునవ్వు వికసించింది. ఒక సైనికాధికారి ఒక్కొక్క సైనికునే పరిచయం చేస్తూ, వారి వీర కృత్యాలను వివరిస్తూంటే ప్రధానమంత్రి చిరునవ్వుతో వారిని పలకరించి, అభినందిస్తున్నారు.

మాధవరావు ప్రధానమంత్రికి నమస్కరించబోయి, తనకి ఎడమచెయ్యి లేదని జ్ఞప్తికివచ్చి, కుడిచేత్తో శాల్యూట్ చేశాడు. ప్రధానమంత్రి అతడిని సాదరంగా అభినందించి, అతడి వీరకృత్యాలను మెచ్చుకున్నారు.

రేడియోలో వార్తలు కొనసాగుతున్నాయి.

"..........దూరంగా రణభేరి మ్రోగుతోంది. భారతదేశంపై ఒక దురాక్రమణ పరుని పాదం తొలగేంతవరకూ అది మ్రోగుతూనే వుంటుంది. ఇది దేశం అత్యవసర పరిస్థితి. లేచి దేశ రక్షణకు నడుం బిగించండి. మీ సహకారాన్నీ సేవనూ దేశ రక్షణ కృషికి విరివిగా అందివ్వండి. మన విజయానికి అదే నాంది. చేయి, చేయి కలిపి, అందరూ ఐకమత్యంతో, దృఢనిశ్చయంతో పురోగమించండి. జైహింద్ ! !"



## మీ ప్రేమోత్సుకత

దుర్గమమైన హిమాలయ ప్రాంతంలో ఎన్నో కష్ట పరిస్థితులలో దేశసరిహద్దులను కాపాడుతున్న వీరులైన మనసైనికులు మీరు కానుకలుగా పంపే వెచ్చని బట్టలను ఎంతో గొప్పగా పరిగణిస్తారు.

ఈ క్రింది వస్తువులను పంపండి :

ఉన్ని బట్టలు, లోపల ధరించే బనీన్లు, డ్రాయర్లు, కేప్-కంఫర్టర్లు, స్కార్ఫ్స్, మేజోళ్ళు, గ్లోవ్స్, పుల్లోవర్లు దుప్పట్లు, కాటన్ పిల్లో-స్లిప్పులు (3′ × 1½′) (తెలుపు), నూలు పక్క-దుప్పట్లు (తెలుపు) 'పజమా' సూట్లు (తెలుపు)

శస్త్ర చికిత్స కుపయోగించే కాటన్, పూలు బాండేజీలు (బూడిద, వైమానికదళనీలం, ఖాకీ లేక ఇతర "న్యూట్రల్" రంగులలో వుంటే మంచిది).

ప్యాకెట్లలో వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలపాలి. వాటిని ఈ క్రింది చిరునామాకు రవాణా చార్జీలు చెల్లించి పంపాలి.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్స్, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.

3. శ్రీ యం. హెచ్. కె. షణ్ముఖి, గవర్నర్ సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# సంగ్రహ ప్రకటనలు

## వాలంటీర్ల నమోదు

నర్సులు, క్లర్కులు, కాంటీన్ ఆర్గనైజర్లు, వంటచేసేవారు, అంబులెన్స్ డ్రైవర్లు, సంక్షేమ కార్యకర్తలు, స్టెనోగ్రాఫర్లు, వంటశాల సూపర్‌వైజర్లు, వార్డు అసిస్టెంట్లు, ట్రక్కు డ్రైవరు పనుల కొరకు జిల్లా, బ్లాకు, మునిసిపాలిటీ, గ్రామస్థాయిలలో వాలంటీర్లను నమోదు చేసుకోడానికై ఏర్పాట్లు చేయవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కలెక్టర్లకు ఉత్తర్వులు చేసింది వాలంటీర్లు దిగువ తెలిపిన వివరాలు తెలియజేయవలసి వుంటుంది.

భారత రెడ్‌క్రాస్ సొసైటీ, దాని శాఖలూ, ప్రథమచికిత్స, హోం నర్సింగ్‌లలో శిక్షణ ఇస్తున్నాయి వాలంటీర్లు ఈ పథకం నుంచి ప్రయోజనం పొందవచ్చు ఇంకా ఏదైనా ఇతర వర్గాల కార్యకర్తలకై స్థానికంగా శిక్షణా సదుపాయాలు వున్నట్లయితే ఆ అవకాశాలు వినియోగించుకోవలసిందిగా వాలంటీర్లను కోరడం జరుగుతుంది.

పూర్తిపేరు; చిరునామా, వయస్సు, అర్హతలు, అనుభవం; ఏరకం పనిచేయదలిచిందీ, దానిపేరు; ఏయే భాషలు వచ్చునో వాటిపేర్లు; ఏ స్థలంలో పని చేయదలచిందీ దానిపేరు; వివాహితులా/అవివాహితులా/వితంతువులా, సంతానం, వృత్తి; పూర్తిసమయం పనిచేయ గలుగుతారా లేక పార్ట్‌టైమ్ పనిచేస్తారా? టెలిఫోను నెంబరు; యుద్ధకాలపు సంక్షేమ కార్యకలాపాలలో ప్రత్యక్షంగా పాల్గొని అనుభవం పొందివున్నారా? ప్రథమ చికిత్స, హోంనర్సింగ్ కోర్సులలో శిక్షణ పొందివున్నారా? లేనట్లయితే వీటిలో దేనిలోనయినా శిక్షణ పొందడం మీకు సమ్మతమేనా, రిమార్కులు.

## హోంగార్డుల కంపెనీలు

హైదరాబాదు-సికింద్రాబాదు, విశాఖపట్నం జిల్లా, కర్నూలు జిల్లా, వరంగల్ జిల్లా, తూర్పు గోదావరిజిల్లా, గుంటూరు జిల్లా, కృష్ణాజిల్లా - ఈ ఏడు పట్టణ ప్రాంతాలకూ, 8 హోంగార్డ్స్ కంపెనీలను స్థాపిస్తూ రాష్ట్రప్రభుత్వం మార్చి 2వ తేదీన ఉత్తర్వులు చేసింది కొత్త ఢిల్లీలో మార్చి 5, 6వ తేదీలలో జరిగిన ప్రధాన కార్యదర్శుల సమావేశంలో, మన రాష్ట్రంలో రిక్రూట్ చేయదలిచిన హోంగార్డులసంఖ్య మన పొరుగు రాష్ట్రాలయిన మద్రాసు, మైసూరు, మధ్యప్రదేశ్‌లలో రిక్రూట్ చేయతలపెట్టిన హోంగార్డుల సంఖ్యకంటే చాలా తక్కువనీ, ప్రతి బ్లాకుకూ ఒక కంపెనీని నెలకొల్పాలన్న లక్ష్యందృష్ట్యా ఇక్కడ హోంగార్డుల సంఖ్యను చాలా పెంచాలనీ అభిప్రాయపడటం జరిగింది.

ప్రభుత్వం యీ అంశాన్ని శ్రద్ధగా పరిశీలించిన మీదట, పైలట్ పథకాల క్రింద కంపెనీల సంఖ్యను ప్రస్తుతానికి రెట్టింపు చేయడానికీ, హోంగార్డ్స్ వ్యవస్థను క్రమేణా దశలవారీగా పటిష్ఠం చేయడానికి నిశ్చయించింది. తదనుగుణ్యంగా కంపెనీల సంఖ్యను రెట్టింపు చేయడానికి అంటే పైన పేర్కొన్న ఏడు నిర్ణీత ప్రాంతాలలో ఎనిమిది కంపెనీలకు బదులు పదహారు కంపెనీలను తెరవడానికి ప్రభుత్వం ఉత్తర్వుచేసింది.

ఈ కొత్త ఉత్తర్వుల ననుసరించి, ఏ ప్రదేశంలో ఎన్ని కంపెనీలు నెలకొల్పబడేదీ దిగువ పేర్కొనబడినది.

హైదరాబాదు - సికింద్రాబాదు - నాలుగు కంపెనీలు; విశాఖపట్నంటౌన్ - రెండు కంపెనీలు, విజయవాడ పట్టణం - రెండు కంపెనీలు, గుంటూరు పట్టణం - రెండు కంపెనీలు; కాకినాడ పట్టణం - రెండు కంపెనీలు; కర్నూలు పట్టణం - రెండు కంపెనీలు; వరంగల్ పట్టణం - రెండు కంపెనీలు.

## నూరుశాతం పన్నుల వసూళ్లు

విశాఖపట్నం జిల్లా, సబ్బావరం పంచాయతీ సమితిలోని 35 పంచాయితీలూ 1962-63వ సంవత్సరంలో నూటికి నూరు వంతులు పన్నులు వసూలు చేసినట్లు ఆ బ్లాకు బి. డి. ఓ. ప్రభుత్వానికి తెలిపారు. ఈ పంచాయితీలు మున్ముందు కూడా ఇలాగే ఆదర్శప్రాయంగా వ్యవహరించగలవనీ, రాష్ట్రంలోని ఇతర పంచాయితీలుకూడా ఈ మార్గాన్ననుసరించగలవనీ ప్రభుత్వం ఆశిస్తున్నది.

## సభ్యుని కోఆప్షన్

ప్రస్తుతం సమాజాభివృద్ధి, పంచాయతీ రాజ్ సహకార (సమాజాభివృద్ధి, పంచాయతీరాజ్‌శాఖ) మంత్రిత్వశాఖ ఇన్‌ఫార్మల్ కన్సల్టేటివ్ కమిటీ సభ్య

డుగా వున్న రాజ్యసభ సభ్యుడు డాక్టర్ కె. ఎన్. నరసింహారావును, పంచాయతీ రాజ్ సమాజాభివృద్ధి కార్యక్రమాల రాష్ట్రశాసనసభ ఇన్‌ఫార్మల్ కన్సల్టేటివ్ కమిటీ సభ్యుడుగా కోఆప్ట్ చేసుకోడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది ఈ ఉత్తర్వు తక్షణమే అమల్లోనికి వస్తుంది. పై కమిటీ 1963 జనవరిలో పునర్నిర్మించబడింది.

## గనిసంస్థలకు అప్పులు

ప్రభుత్వం ఉత్పత్తిరంగాలకు అప్పులు మంజూరు చేస్తుండగా గనుల పరిశ్రమకు ఇలాంటి సౌకర్యాలు కల్పించడం లేదనీ, కనుక గనియంత్రాగారం హామీ మీద వీటికి ఆర్థిక సహాయం చేయడానికిగల అవకాశాలను, ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి సంస్థతో సంప్రదించి ప్రభుత్వం పరిశీలించాలనీ కోరుతూ ప్రభుత్వానికి విజ్ఞాపనలు చేయడం జరిగింది

ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి సంస్థ ప్రారంభంనుంచే, ఇతర పరిశ్రమలవారికి ఏ నియమనిబంధనలమీద అయితే అప్పులు యివ్వబడుతున్నాయో అలాంటి షరతుల పైననే గనిసంస్థలకు కూడా అప్పులు మంజూరు చేయడాన్ని పరిశీలిస్తున్నదని ప్రజలకు ప్రత్యేకించి గనుల యజమానులకు తెలియ జేయడమవుతున్నది.

కాబట్టి ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి సంస్థ, అప్పుల మంజూరీకై గనిసంస్థల నుంచి దరఖాస్తులు స్వీకరిస్తుంది ఈ సంస్థ నిర్దేశించే షరతులను పూర్తిచేయడంపై ఆయా గనిసంస్థలకు అప్పుపొందే అర్హతానర్హతలు ఆధారపడివుంటాయి

## భూమిశిస్తు వసూళ్ల వాయిదా

విశాఖపట్నం జిల్లాలోని 215 గ్రామాలలో వరదప్రాంతానికి గురైన ప్రాంతాలలో 1372వ ఫసలీకి వసూలు చేయవలసినవున్న భూమిశిస్తు, అప్పు కిస్తుల వసూళ్లను 1963 నవంబరు 30వ తేదీ వరకు వాయిదా వేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వుచేసింది ఈ ప్రాంతాలలో, 1372వ ఫసలీకి భూమిశిస్తు రెమిషన్ ఇవ్వడానికి కలెక్టరు ప్రతిపాదించాడు

## ప్రసూతివార్డులలో లేడీ డాక్టర్లు

ప్రభుత్వ ఆసుపత్రుల ప్రసూతివార్డులలో లేడీడాక్టర్లను నియమించడం సాధ్యంకాదని ఆరోగ్యశాఖా మంత్రి శాసనసభలో తెలిపినట్లు పత్రికలలో వెలువడిన ఒక వార్తను ఖండిస్తూ ప్రభుత్వం దిగువ అంశాలు ప్రకటించింది అన్ని ప్రసూతివార్డులలోనూ లేడీ డాక్టర్లను నియమించడం సాధ్యంకాదని మాత్రమే ఆరోగ్య మంత్రి శాసనసభలో తెలిపారు అంతేగాక హైద్రాబాదులోని ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రిలో ఒక ప్రత్యేక విభాగం వుందనీ, అందులో పేషెంట్లు కోరినట్లయితే వారిని లేడీ డాక్టర్లు మాత్రమే చూస్తారని కూడా మంత్రి వెల్లడించడం జరిగింది

ఆరోగ్యమంత్రి చెప్పినదానిని పత్రికా ప్రతినిధి తప్పుగా అర్థం చేసుకున్నట్లు స్పష్టమవుతున్నది వైద్యాధికార్ల కొరత వల్ల ముఖ్యంగా లేడీ డాక్టర్ల కొరతవల్ల, ప్రభుత్వ ఆసుపత్రుల ప్రసూతి వార్డులన్నింటిలోనూ లేడీ మెడికల్ ఆఫీసర్లను నియమించడం సాధ్యం కాలేదు

"హైద్రాబాదులోని ప్రభుత్వప్రసూతి ఆసుపత్రివంటి పెద్ద వైద్యసంస్థలలో లేడీ మెడికల్ ఆఫీసర్లను నియమించడం జరిగింది పేషెంట్లు తమను లేడీ డాక్టర్లు మాత్రమే పరీక్షించాలని కోరినచోట్లలో వారిని లేడీ డాక్టర్లు మాత్రమే పరీక్షిస్తున్నారు అర్హతగల లేడీ మెడికల్ ఆఫీసర్ల కొరతదృష్ట్యా ప్రతి ప్రభుత్వ ప్రసూతి వార్డునూ కేవలం లేడీ మెడికల్ ఆఫీసరుతో నిర్వహించడం సాధ్యపడదు. అయితే ఇలాంటివారు లభ్యమయినప్పుడల్లా వారిని నియమించడానికి ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి.



హైదరాబాదు (దక్షిణ) లోని ఆర్మీ మెడికల్ కోర్ కేంద్రంలో 1963 మార్చి 21 వ తేదీన జరిగిన కమీషనింగ్ ఉత్సవంలో కమీషన్‌ను స్వీకరిస్తున్న ఒక డాక్టర్.



నల్లగొండ జిల్లా బేతవోలులో బహిరంగ జైలుకు 1963 ఏప్రిల్ 2 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



*ప్యాకేజి పథకం* :– పశ్చిమ గోదావరి జిల్లాలోని కరుగుంట గ్రామంలో ప్యాకేజి పథకంక్రింద వేసిన తోటను భారతదేశంలోని ఫోర్డ్ ఫౌండేషన్ ప్రతినిధి శ్రీ డగ్లస్ ఎన్స్మింజర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ యం. పి. పాయ్ చూస్తున్నప్పటి చిత్రం.

*గోలకొండ దుర్గంలో* :– భారతదేశంలోని బ్రిటిష్ హైకమీషనర్ సర్ పాల్ గోరే–బూత్, ఆయన సతీమణి 1963 మార్చి 29 వ తేదీన గోలకొండ దుర్గాన్ని సందర్శించారు.



మైక్ వద్ద గిరిజనుడు :- 1963 మార్చి 25 వ తేదీన మహబూబునగర్ జిల్లా మన్ననూరులో జరిగిన గిరిజన సంక్షేమ సమావేశం సందర్భంగా ప్రసంగించిన గిరిజనులలో ఒకరు.




"నేర్పుగల యుక్తి"
"స్టేట్స్‌మన్" సౌజన్యంతో



తెలంగాణాలో గ్రామీణ వినోదాలలో "ఒగ్గు కథ" ఒకటి. మార్చి 9 వ తేదీన కరీంనగరంలో జాతీయ రక్షణ గురించి జరిగిన సంగీత నాటక సెమినార్‌లో యీ 'కథ' ను పాడిన మానకొండూరు జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాల బృందాన్ని యీ చిత్రంలో చూడవచ్చు. జిల్లా స్థాయి పోటీలలో



మార్చిలో హైద్రాబాదు విచ్చేసిన ఆఫ్ఘనిస్థాన్ యొక్క మార్షల్ షాహవాలి, 1963 మార్చి 19 వ తేదీన మక్కా మసీదును దర్శించారు.



*కార్యోరంగానికి* :- హైద్రాబాదులోని పబ్లిక్ స్కూల్ బాలలు, 1963 ఏప్రిల్ 2 వ తేదీన జరిగిన వార్షిక క్రీడా దినోత్సవం సందర్భంగా వారి ఫీల్డ్ కార్యక్రమాలను ప్రదర్శిస్తున్న చిత్రం.

# లలనావనం



అనంతర రక్షణ గృహాలను కొన్నింటిని నెలకొల్పి పతితలకు, అనాథలకు ప్రభుత్వం చక్కని ఆశ్రయాలను అభివృద్ధి పథకాలను ఏర్పరచింది.

అనంతర రక్షణ గృహములు అంటే ఏమిటి? అవి ఎందుకు నెలకొల్పబడినవి? ఏవిధంగా నడుపబడుతున్నాయి? అనే విషయాన్ని గురించి తెలుసుకుందాము.

మన సమాజంలో ఆచారాలనుబట్టి గానీ, పరిస్థితులనుబట్టి గానీ, స్త్రీలు కొన్నికొన్ని క్లిష్టపరిస్థితులకు గురి కావలసి వస్తున్నది. బాల్య వివాహాలవల్ల, వృద్ధ వివాహాలవల్ల, లేక దైవికమైన సంఘటనలవల్ల కొంత మంది చిన్న వయస్కులైన స్త్రీలు వైధవ్యాల ననుభవిస్తున్నారు. మరి కొందరు భర్తృ పరిత్యక్తలై, అనాథలవలే అల్లాడుతున్నారు. ఇటు ఆర్థిక సహాయం లేక, అటు బాధ్యతను వహించే పోషణ కర్తలు లేక, దారీతెన్నులేనివారైనారు. కొంత మంది అతి క్లిష్టమైన కుటుంబ పరిస్థితులలో దుఃఖభూయిష్టమైన జీవితమును గతిలేక అనుభవించుతున్నారు. కొన్నికొన్ని ఆత్మహత్యలుకూడా ఈ కారణముల వల్లనే జరుగుతున్నవి.

ఇంతేగాక కొందరు స్త్రీలు తమనుతాము పోషించుకొనలేక, దుర్భర జీవితాన్ని అనుభవింపలేక, నిరాధారముగా సంఘ జీవితాన్ని గడుపలేక అవినీతిపరులు కావలసిన అనివార్య పరిస్థితులకు గురి అగుతున్నారు. వ్యభిచార నిరోధక చట్టాలెన్ని ఏర్పడినా ఆ అవినీతి అరికట్టబడలేదు. కేవలం చట్టాలవల్ల ఏ పనీ పూర్ణ రూపాన్ని పొందలేదు. అది ఆస్కారము మాత్రమే. ప్రజలలో, సంఘంలో సంస్కారం రావాలి.



## అభాగినులకు ఆశ్రయాలు



ఆవుల జయప్రదాదేవి

అప్పుడే ఏ పని అయినా విజయవంతం కాగలదు.

1955 వ సంవత్సరంలో భారతదేశమంతటా పర్యటించి, అభాగ్యులైన ఇలాంటి స్త్రీల విషయమై దర్యాప్తు చేయడానికి ఒక సలహాసంఘం ఏర్పాటు చేయబడింది. వారి దర్యాప్తుద్వారా అనేక విషయములు తెలియవచ్చాయి. వారు కొన్ని సూచనలు కూడా యిచ్చారు. వారి సూచనలు కేంద్ర సంక్షేమ సంఘం ద్వారా అమలుపరుపబడుతున్నాయి.

మొత్తం ఈ వ్యభిచార వృత్తియందున్న వారిలో 100 కి 66 మంది పల్లెల నుండి వచ్చినవారే. మిగిలిన 34 గురు పట్టణ వాసులు. ఇందులోకూడా 100 కి 55 మంది కేవలం జీవన భృతికై వృత్తి చేస్తున్నవారు. ఆర్థిక స్తోమతు లేక పొట్ట తిప్పలకై అవినీతి పాలైనవారు. 100 కి 27 మంది కుటుంబ పరిస్థితులవల్ల ఈ వృత్తికి దిగినవారు. భర్తలచేత విడువబడి, పుట్టినింట ఆస్కారం లేకనో, ఆ కుటుంబంలో ఉండలేని పరిస్థితుల బట్టో వచ్చినవారు. విధవలైన స్త్రీలు కుటుంబంలో ఆస్కారంలేక బయటకువచ్చి జీవనోపాధికొరకు ఈ వృత్తి నవలంబించిన వారు ఉన్నారు. ఇక మిగిలిన 16 మంది సాంప్రదాయాలనుబట్టి వంశపారంపర్యంగా దేవదాసీల పేరుతో చెలామణి అవుతున్నారు.

ఈ పై వివరాలు మన భారతదేశంలో వున్న సుమారు 100 సంస్థలను పై గా పరిశీలించిన మీదట లభ్యమైనాయి. ఈ విధంగా నీతి దూరులైన స్త్రీలకు పునరావాసాన్ని కల్పించడానికి, అనాథలకు ఆస్కారాన్ని కల్పించడానికి "ఆఫ్టరు కేరు హోము"లు అన్న పేరుమీద ఈ రక్షణ గృహాలు నెలకొల్పబడినవి. పెడదారి పట్టిన

తరువాతకంటే పెడదారిని పడకుండా రక్షణ నివ్వడం, అనాథ స్త్రీలకు రక్షణ నివ్వడం, ప్రమాదవశాన అటువంటి ఆపదకు గురైన వారికి కూడా చట్టప్రకారం శిక్ష ననుభవించిన మీదట పునరావాసాన్ని కల్పించడం మొదలయినవి వీటి ముఖ్య కార్యక్రమాలు.

ఇటువంటి రాష్ట్రి రక్షణ గృహాలు మన రాష్ట్రంలో (1) హైదరాబాదు (2) కర్నూలు (3) రాజమండ్రి (4) మహబూబ్ నగర్‌లలో ఒక్కొక్కటి వంతున నాలుగున్నాయి. వీటిలో మొదటి రెండు ప్రదేశాలలోను ఉన్న గృహాలు, నైతిక ప్రమాదాలలో ఉన్న స్త్రీలు, ఐచ్ఛికంగా, అనగా వారంతటవారే వచ్చి ఉండేవారికి ఇవి ఉద్దేశింపబడినవి. వ్యభిచార నిరోధక చట్టం క్రింద, శిక్షల ననుభవించిన తరువాత, పునరావాసం కల్పించడం వీటి ప్రత్యేకత

ఇక, రాజమండ్రి, మహబూబ్ నగరములలోని గృహములు, అనాథ శరణాలయాలలోనుండి విడుదలైన వారికి గాను ఏర్పాటు కాబడినవి. వీటిల్లో రక్షణ కల్పింపబడిన స్త్రీలకు, ఉపాధికై చేతి పరిశ్రమలను నేర్పుతున్నారు. సంక్షిప్త విద్యావిధానాన్ననుసరించి, విద్యనుకూడా గరపుతున్నారు. ఈవిధంగా విద్య నభ్యసించినవారు, నర్సులుగా, ఉపాధ్యాయినులుగా, ఇంకా అనేకవిధాలైన పెక్కు ఉపయోగకరములైన కార్యక్రమాలలో పని చేయడానికి యోగ్యులవుతున్నారు.

ఇంతమాత్రంతోనే, అనగా, ఆర్థిక పరిస్థితి ఒక్కదానితో, యీ సాంఘిక, నైతిక సమస్యను పరిష్కరించలేము. కాబట్టి, మానసికంగా, సాంఘికంగా, ఒక స్థైర్యాన్ని, ఒక స్థాయిని వారికి నెలకొల్పవలసి వున్నది. తాము సంఘ జీవితాన్ని సక్రమంగా నిర్వహించగలమనే ఆత్మవిశ్వాసం వారికి కలగాలి. అప్పుడే, వారి జీవితం ప్రమాదాలకు లోనుకాకుండా సాగిపోగలదు. యౌవనవంతులైన స్త్రీ, పురుషులకు, వైవాహిక జీవితం చాలా అవసరం. పురుషుడికి స్త్రీ యేవిధంగా అవసరమో, స్త్రీకి కూడా పురుషుడు అట్లాగే అవసరం. ఆ అవసరాన్ననుసరించి చూస్తే, ఏదోఒక తాత్కాలికావేశంతో, తప్పటడుగు వేసిన స్త్రీలు, తిరిగి పశ్చాత్తాపాన్ని పొంది, పునరావాసాన్ని కల్పించుకోగల వాతావరణాన్ని, అవకాశాలను నిర్మించే బాధ్యత సంఘానిది. అటువంటి ఉద్దేశాలతో యీ రక్షణ గృహాలలో వుండే స్త్రీలకు, తగిన పురుషులు లభించినప్పుడు, వివాహాలుకూడా జరుపుతున్నారు.

ఈవిధంగా ప్రారంభింపబడిన, యీ ప్రణాళిక, పై నాలుగు కేంద్రాల ద్వారా, మన ఆంధ్రప్రదేశ్‌లో, నడుపబడుతున్నది. హైదరాబాదు గృహంలో ఉత్పత్తి, శిక్షణ కేంద్రం (Productive and Training unit) వున్నది. ఈ కేంద్రంలో గ్లాసు గొట్టాలు (Glass ampules), సీమసున్నపు కణికలు, రెడీమేడ్ దుస్తులు తయారు చేయడంలోను తరిఫీదు నిస్తున్నారు. దీనిలో సంక్షిప్త విద్య కూడా గరుపబడుతున్నది. రాజమండ్రి రక్షణ గృహంలో కాగితపు సంచులు, కవర్లు తయారుచేయబడుతున్నవి. ఇంతేకాక, చిన్న ముద్రణాలయాన్ని కూడా నడుపుతున్నారు. ఒక్కొక్క గృహంలోను బాలలతోసహా, వంద మందికి వసతి వున్నది.

తాత్కాలికంగా, రక్షణ నివ్వడానికి, నాలుగు జిల్లా రక్షణ గృహాలు కూడా ఏర్పాటు చేయబడ్డాయి. అవి విశాఖపట్నం, ఏలూరు, విజయవాడ, సంగారెడ్డి పట్టణాలలో ప్రారంభింపబడ్డాయి. కుటుంబాలలో గల అశాంతి కారణములవల్ల గాని, అసంతృప్తికరమైన వైవాహిక జీవితంవల్ల గాని, తన కుటుంబంనుండి దూరమైపోయిన వారికి యీ జిల్లా రక్షణ కేంద్రాలు, తాత్కాలికంగా ఆశ్రయాన్నిస్తాయి. అటువంటి స్త్రీలు యిక్కడ, మూడు మాసాలవరకు ఉండవచ్చును. అటువంటి వారికి యీ గృహాలలో ప్రవేశం, తేలికగా, పరిశీలనతో నిమిత్తం లేకుండగనే, లభ్యమవుతుంది. తరువాత అక్కడవున్న సూపరింటెండెంట్ దర్యాప్తు చేసి, వారి కుటుంబాల వారితో సంప్రదింపులు జరిపి, పొరపొచ్చములను సర్ది సమైక్య పరచడానికి ప్రయత్నించి, తగిన అవకాశం లభించిన వెంటనే తిరిగి వారిని వారి వారి కుటుంబములకు చేర్చుతారు.

ఆవిధంగానే తమవారికి చెప్పకుండా చెయ్యకుండా వ్యామోహంతో యెవరి వెంటనో వెళ్ళిపోయిన స్త్రీలకు కూడా, వారు పశ్చాత్తాపం చెంది, రక్షణకై ప్రాకులాడేటప్పుడు, యీ జిల్లా గృహాలలో రక్షణ నిస్తారు. దర్యాప్తు జరిపిన పిమ్మట, వారికి ఉచితమైన, అనగా, పునరావాసానికి అనుకూలమైన ఏర్పాటులను, శిక్షణను ఇవ్వడానికి రాష్ట్రి రక్షణ గృహానికి, వారిని పంపుతారు. ఇందులో మూడు సంవత్సరాలవరకూ వారికి రక్షణ, శిక్షణ కల్పింపబడుతుంది.

ప్రభుత్వం కల్పించిన యీ అవకాశాల్ని గుర్తించి, దురదృష్టానికి గురైన అభాగినులు, తగు రక్షణను పొంది, జీవితాలను సరిదిద్దుకొని సరైన జీవితాలను అనుభవించగలరని ఆశించుతున్నాము.

# దేశరక్షణలో స్త్రీల పాత్ర

బి. సరోజ

భారతస్త్రీ మాతగా, వీరమాతగా, సాంఘిక జీవనంలో అత్యుత్తమ సంస్కరణలు తెచ్చిన సంస్కారిణిగా అనాదినుంచీ కీర్తి సముపార్జించివుంది.

భర్తతో రణరంగమునదూకి శత్రువును పరిమార్చిన సత్యవంటి పురాణనాయికల నుంచి, భర్త నుదుట వీరతిలకముగా తన రక్తమునుదిద్ది కదనరంగమునకు పంపిన అలనాటి పలనాటి వీరవనితమాంచాల వరకూ భారతస్త్రీల ధైర్య స్థైర్యాలూ, సాహసోపేతమైన కార్యాలూ మనకు తెలుసు.

గొప్ప రాజకీయ విప్లవంతెచ్చిన ఝాన్సీ రాణీనుంచి, స్వాతంత్ర్య పోరాటంలో అసమాన ప్రజ్ఞచూపి, స్వదేశ రూపురేఖలు దిద్దిన సరోజినీనాయుడు వంటివారు భారత దేశమున పలువురుగలరు.

కాబట్టి భారతస్త్రీ ధైర్యం, సాహసం, దేశభక్తి అచంచలమైనవని గత చరిత్ర రుజువు చేస్తోంది.

మనదేశం చిరకాలంగా బానిస సంకెళ్ళతో క్రుగ్గిపోయి, చివరికి స్వాతంత్ర్య సుమాల సుగంధాల నాస్వాదిస్తోంది. మానవత్వం పునాదిగా శాంతి, సమానత, సమధర్మం, సహజీవనం అనే భవంతులు నిలుపుకొంటుంది. ఇలాంటి దశలో స్త్రీలపాత్ర దేశాభివృద్ధి సాధనలో గొప్పదిగా గుర్తించాలి.

"సంఘమనే పక్షికి స్త్రీ ఒక రెక్క, పురుషుడు మరొకరెక్క. ఏ రెక్క సమంగా పనిచెయ్యకపోయినా గమ్యానికి పక్షి చేరుకోలేదు. రెండు రెక్కలూ సమంగా పని చేసిననాడే జగతికి ప్రగతి."

కాబట్టి, స్త్రీ పురుషుల సమానబాధ్యతలు మనం గుర్తించాలి. ఎన్నో త్యాగాల, బలిదానాల అనంతరం సంపాదించిన స్వాతంత్ర్యంవల్ల, అనేకమైన హక్కులు మనకు సమకూరాయి. ఎప్పుడైతే హక్కులు దక్కాయో, నాడుమరిన్ని బాధ్యతలు మనపై ఉన్నాయనేది విస్మరించరాదు. స్వాతంత్ర్యాన్ని సంపాదించే ప్రయత్నంలో చేసిన త్యాగాలకంటె, అది కలకాలం అకలంకంగా, ఉజ్వల భవిష్యత్తువైపు తరలి వెళ్ళేదిగా నిలుపుకోడానికి గొప్ప త్యాగాలు చెయ్యవలసి వుంటుంది.

దేశ గౌరవ ప్రతిష్ఠలు నిలపటం, దాని గొప్పకీర్తి ప్రపంచం నలుమూలలా వ్యాపింప చెయ్యటం, మానవత్వానికీ, సత్యానికీ ప్రాధాన్యత నివ్వటం—ఇత్యాది విషయాలు దేశంలో పాదుకొనేట్టు చెయ్యగలవాళ్లు కేవలం స్త్రీలే అంటే అతిశయోక్తి కాదు. ఎంత పెద్ద దేశనాయకుడైనా శాస్త్రవేత్త అయినా కళాకోవిదుడైనా ఒకనాటి తల్లి అడ్డాలబిడ్డ డని, అతని తప్పటడుగులు అందాల ఒప్పు టడుగులని తల్లి సరిదిద్దిననాడే అంతటి వాడయ్యాడని గమనించాలి.

మన ముత్తవ్వలు ఉగ్గుపాలతో వీరరస ప్రధానగాథలు రంగరించి పోసేవారు. నేటికీ పల్లెప్రాంతాల వినవచ్చే జానపద సాహిత్యంలోని "కుశలవుల యుద్ధం" వంటి జానపద గీతాలూ, బాలచంద్రుని సాహసగాథా, మూరెడు మీసందువ్వి, బారెడు చాతివిరిచిన బొబ్బిలి బెబ్బులుల కథలూ తెలుగ బిడ్డలకి ధీరత్వాన్నీ, వీరత్వాన్నీ నేర్పాయి. గతాన్ని తిరిగి స్మరించుకోవలసిన కాలం ఆసన్నమైనది నేడు.

## 2

చైనా ముష్కరులు మన భూభాగంపై దురాక్రమణ జరిపేనాటికి మన దేశపరిస్థితిని ఒక్కసారి తెలుసుకుందాం.

పంచవర్ష ప్రణాళికల ప్రగతిలో మనం అభివద్ధి పథంలో ఉన్నాం. భిలాయ్, రూర్కెలా వంటి ఉక్కు కార్మాగారాలు నిర్మించాం, నిర్మిస్తున్నాం; బాక్రానంగల్, నాగార్జునవంటి ప్రాజెక్టుల నిర్మాణం అతి వేగంగా కొనసాగుతోంది, సోషలిస్టు

వ్యవస్థగా దిన దినాభివృద్ధి పొందు తోంది మనదేశం.

ఉదాహరణగా కొన్ని పరిశీలించండి :

1. 1951 వ సంవత్సరంలో పశుగణాభి వృద్ధికోసం146కీలక గ్రామాలనే కేంద్రాలుగా ఎంచుకున్నాం. 1961 నాటికి 2,000 కీలక గ్రామ కేంద్రాలే కాక, 670 కృత్రిమ పశూత్పత్తి కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. పశుగణాభివృద్ధికోసం తొలి ప్రణాళిక లో 8 కోట్లు ఖర్చుచేస్తే, తృతీయ ప్రణాళికలో 51 కోట్లు కేటాయించ బడ్డాయి.

2. తొలి ప్రణాళికా కాలంలో ఉక్కు ఉత్పత్తి 10 లక్షల టన్నులు అయితే, నేడు 100 లక్షల టన్నులకు పెరిగింది.

అన్ని రంగాలలోను దేశవ్యాప్తంగా యీ అభివృద్ధి కనబడుతోంది.

ఇక రాష్ట్రంలో చూద్దాం. ఆంధ్ర రాష్ట్రంలో కేవలం "కమ్యూనిటీ డెవలప్ మెంటు ప్రోగ్రాం," (సాంఘిక సంక్షేమ పథకాలు) క్రింద క్రిందివిధంగా ఖర్చు పెట్టటం జరిగింది.

1. ఒక్క 1961-62 సం॥ లోనే ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యాభివృద్ధికోసం 22.87 లక్షలు, జానపదకళల, కుటీర పరిశ్రమల అభివృద్ధి కోసం 32.87 లక్షలు, ప్రజారోగ్యం కోసం 46.78 లక్షలు, వ్యవసాయాభి వృద్ధికోసం 72.04 లక్షలు ఖర్చు పెట్టబడ్డాయి.

2. 1962 నాటికి ఆంధ్ర రాష్టంలో వెనుక బడిన ప్రాంతమనుకొన్న శ్రీకాకుళం జిల్లా లోనే 27 బ్లాకులు స్థాపించబడ్డాయి.

3. 1962 నాటికి ఒక్క సామర్లకోట సెంటర్‌లో 176 గురు గ్రామసేవికలు శిక్షణ పొందారు. మొత్తం నాలుగు శిక్షణ కేంద్రాలలో శిక్షణపొందిన గ్రామసేవికల సంఖ్య 479. వీరు రాష్ట్రంలోని అన్ని బ్లాకులలోనూ పనిచేస్తున్నారు.

4211 మంది విలేజి లెవిల్ వర్కర్లు శిక్షణపొందారు.

353 గ్గురు సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గ నైజర్లు ఉన్నారు.

4. 1961-62 లో ప్రజలు శ్రమ, ధన దానాల మూలంగా సాంఘిక సంక్షేమ కార్య కలాపాలకు 84,54,919 రూపాయలు సమర్పించి దేశ అభివృద్ధి పట్ల, ప్రభుత్వ కార్యాలపట్ల వారి విశ్వాసాన్ని చూపారు.

బానిసత్వమనే అంధకారాన్ని విడిచి, స్వాతంత్ర్యమనే సూర్యోదయాన్ని చూచి, దేశప్రజలు అత్యుత్సాహంతో అభివృద్ధి కార్య క్రమాలలో పాల్గొంటూ, దేశాన్ని సర్వ సమృద్ధివంతంగా చేస్తున్నారు. మన యీ అభివృద్ధి సర్వం చైనావాడి దుర్బుద్ధివల్ల కుంటువడే ప్రమాదం వుంది.

## 3

దేశం అనేక విధాల అభివృద్ధి ప్రయత్నా లలో ఉన్న సమయాన చైనా భారతదేశంపై 1962 అక్టోబరు 20 వ తారీఖున ఉత్తర సరిహద్దు ప్రాంతాన దాడి జరిపింది. నాటి వరకూ "హిందీ చీనీ భాయీ భాయీ" అని నినదించి, స్నేహ రూపాన ఉన్న శత్రువుగా రుజువు చేసుకొంది.

మిత్రరాజ్య సమితిలో సభ్యత్వం చైనాకు యివ్వాలని ప్రతిపాదించినది భారతదేశం. చైనాను తోటి స్వతంత్ర్య రాజ్యంగా గుర్తించి గౌరవించినది భారతదేశం. బాండుంగు సభలో పంచశీల సిద్ధాంతాలను అంగీకరించేట్టు చేసినది భారతదేశం. ఇన్ని సహకారాలు మననుంచి పొందిన చైనా తిరిగి మన భూభాగాన్నే ఆక్రమించుకోవా లని తలచింది. ఈ శతాబ్దిలో యుద్ధాన్ని ప్రకటించి ఆదిమ ఆటవిక జాతిలక్షణాలను బయట పెట్టుకుంది. యుద్ధాలు కాంక్షించే వారిని పశువులకంటె నీచంగా చిత్రించారు మహాతాత్వికులైన బెర్ట్రాండ్ రసెల్.

తన కోడి, కుంపటి లేకుంటే లోకానికి తెల్లవారదని నమ్మిన మూర్ఖపు ముసలమ్మలా తయారయ్యింది చైనా. నల్లమందు మత్తు, బూజుపట్టిన సామ్రాజ్యవాదతత్వం తన కింకా వదలలేదని రుజువు చేసుకొంది చైనా.

అక్టోబరు 21 వ తారీఖున తవాంగును ఆక్రమించింది చైనా. నవంబరు 13 నాటికి వలాంగు ప్రాంతానికి వచ్చి కాల్పులు జరిపింది. బోమ్‌డిలా, జాంగ్, సేలా ప్రాంతాల్లో అనేక అత్యాచారాలు జరిపింది. నవంబరు 27 న యుద్ధ విరమణ ప్రకటనా నంతరం హోసియార్‌సింగ్‌పై కాల్పులు జరిపి పొట్టను పెట్టుకొంది దుర్నీతి పాల్పడిన చైనా.

చైనా యీ సరిహద్దు పోరాటంతో మానవత్వంపై తనకెట్టి ఆశలూ లేవని ప్రపంచానికి చాటుకుంది.

శాంతి, సహజీవనం, మానవతాభ్యున్నతి కోరే ప్రతి దేశం చైనాను బాహాటంగా నిందించి, మనకు చేయూత నిచ్చింది. యుగోస్లావియా ప్రధాని టిటోతో సహా అనేక దేశాధిపతులు చైనా మూర్ఖతను బాహాటంగా ఖండించారు.

## 4

"రువ్విన ప్రతి బెడ్డకూ వీపు ఒగ్గితే వెర్రివాడే గెలిచాడు" అనే సామెత వతుగా తయారయ్యింది చైనా. నేటికీచైనా బెడద తీరినదని భావించరాదని నెహ్రూ పండితుడు చెబుతున్నాడు కావున యీ తరుణంలో భారత స్త్రీలమైన మనం దేశరక్షణ కోసం నెరవేర్చవలసిన విధులు కొన్ని వున్నాయి.

1. ఎః—పాఠశాలల్లో, కళాశాలల్లో చదివే ప్రతి బాలికా బాలురతో సమానంగా

# ప్రభుత్వ నిర్ణయాలు

మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి బడ్జెటును రూ 68.64 కోట్ల నుంచి రూ 92.55 కోట్ల వరకు అంటే రూ 24 కోట్ల మేరకు పెంచాలని ప్రభుత్వం నిర్ణయించింది.

బడ్జెటు కేటాయింపు దిగువ పేర్కొన్న విధంగా వుంటుంది :

ఎగువసీలేరు ప్రథమదశకు రూ 2 కోట్లు
రామగుండం థర్మల్ పథకానికి రూ 1.6 కోట్లు
కొత్తగూడెం, కిన్నెరసాని ప్రాజెక్టులకు రూ 7.14 కోట్లు
దిగువసీలేరుకు (ప్రాథమిక) రూ 2.25 కోట్లు
కొత్తగూడెం రెండవదశకు (ప్రాథమిక) రూ 1 కోటి
మాచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకానికి రూ 1.34 కోట్లు
ఎగువసీలేరు రెండవ దశకు రూ 25 లక్షలు
రామగుండం మూడవ దశకు రూ 50 లక్షలు

2. విశాఖపట్నం, భీమవరం, సామర్లకోట, గుంటూరు, తుని, రామచంద్రపురం, మదనపల్లి మున్సిపాలిటీలకు ఎన్నికలు జరపాలని ప్రభుత్వం నిర్ణయించింది. తుని, రామచంద్ర పురం, మదనపల్లి మునిసిపాలిటీలలో 1963 ఆగస్టు – సెప్టెంబరులో ఎన్నికలు జరుగుతాయి.

3. స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ నుంచి ప్రభుత్వ హామీపైన రూ 5 లక్షలు అప్పుగా తీసుకోవడానికి గాను చీరాల కో-ఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్స్ చేసిన ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించింది.



---

ఎ. సి. సి; యన్. సి. సి. కోర్సులలో జేరి సైనిక శిక్షణపొందాలి.

బి;–నర్సు, తదితర వైద్యపరీక్షల్లో ఉత్తీర్ణులై యుద్ధసమయాన సైనిక కేంద్రాలలో పని చెయ్యటానికి సంసిద్ధులై వుండాలి.

2. సివిల్ రైఫిల్ ట్రైనింగు క్లబ్బులలో జేరి 'ట్రిగర్ ఆపరేషన్', 'ఎయిమ్' మొదలైన విషయాలు క్షుణ్ణంగా నేర్చుకోవాలి.

3. ప్రతి స్త్రీ గృహంలో పొదుపు ఉద్యమాన్ని ఆరంభించి నెలకు కొంత డిఫెన్సు ఫండుగా యివ్వాలి; లేదా డిఫెన్సు సర్టిఫికేట్లు కొనాలి.

4. బంగారం విరివిగా దేశరక్షణకు యిచ్చి, దేవునికి నిలువుదోపిడి యిచ్చినట్టు ఆనందించాలి

5. ఎ;–కవయిత్రులూ, కళామతల్లులూ దేశభక్తినీ, సౌర్యజ్యోతినీ రగిల్చే సృష్టి చెయ్యాలి.

బి;–ప్రతి స్త్రీ తన సంతతికి వీర రసోపేతమైన గాథలు చెప్పి, దేశస్వాతంత్ర్య పరిరక్షణ కోసం ఎలాంటి త్యాగాలకైనా వెనుదీయని వీరులుగా తయారు చెయ్యాలి.

సి;–ప్రతి యిల్లూ యిల్లాలు మలిచిన చైనా దురాక్రమణ ప్రతిఘటనోద్యమ కేంద్రంగా వుండాలి.

డి;–తీరిక వేళల మఫ్లర్లు, స్వెటర్లు అల్లి, హిమవత్పర్వత ప్రాంతాల ఎముకలు కొరికే చలిలో మనకోసం మన సరిహద్దులు కాపాడుతున్న సైనికులకు పంపించాలి.

ఇ;–కనీసం పండగ సమయాల్లో పుష్టి చేసేదీ, నిలవ వుండేదీ పిండివంట చేసినపుడు సైనికులకు పంపటం మరిచిపోకూడదు. ఇవి ప్రతి స్త్రీ దేశరక్షణ కోసం చెయ్యాల్సిన కొన్ని విధులు.

5

దేశం పరాధీనమైన నాడు మన కళలూ, సంస్కృతీ, దేవతలూ – సర్వం నాశనమై పిశాచ నగ్ననృత్యం నడి వీధుల్లో చూడాల్సి వుంటుందని ప్రతి స్త్రీ గుర్తించాలి. దేశరక్షణ కోసం సర్వాన్నీ త్యాగం చెయ్యగల సౌర్య జ్యోతి ప్రతి స్త్రీ హృదయంలోనూ అచేతనంగా వెలగాలి.

స్వాతంత్ర్యం సంపాదించటం కంటె దాన్ని చిరకాలం నిలుపుకొని, దాని అత్యుత్తమ ఫలితాలు పొందగలగటం గొప్ప అన్న సంగతిని మనం గుర్తించాలి.

ఇలా చెయ్యటంవల్ల మనకూ, మన దేశానికీ మేలుచేసుకున్న వాళ్ళం అవుతాం. తద్వారా ప్రపంచ ప్రగతికి దోహదం చేసిన వాళ్ళం అవుతాం. ఇప్పుడు మన దేశంలో జరుగుతున్న అభివృద్ధి కార్యకలాపాల కెట్టి ఆటంకం లేకుండా చేసుకున్న వాళ్ళం అవుతాం.



# పారిశ్రామిక విశేషాలు

**పరిశ్రమలు :-**

### కేంద్ర రంగం

నాల్గవ ప్రణాళిక కాలంలో కేంద్ర రంగంలో సంవత్సరానికి 2½ మిలియను టన్నుల ఉత్పత్తిశక్తిగల ఒక ఉక్కు కర్మాగారాన్ని విశాఖపట్నంలో నెలకొల్పడం జరుగుతుందని కేంద్ర భారీ పరిశ్రమలు, ఉక్కు శాఖల మంత్రి శ్రీ సి. సుబ్రమణ్యం, ఇటీవల హైద్రాబాదు విచ్చేసిన సందర్భంలో తెలియజేశారు. ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాథమిక పరిశీలనలు జరుగుతున్నాయి.

### రాష్ట్ర రంగం

రాష్ట్రంలో బాల్‌టాపర్డ్ బియరింగ్స్ ప్రాజెక్టును నెలకొల్పడానికి అవసరమైన విదేశీ సహాయాన్ని పొందడానికి వీలుగా సంప్రదింపులు జరపడానికై పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టరు జపానుకు వెళ్ళుతున్నారు.

*సింగరేణి బొగ్గు గనులు:* రు 116 57 లక్షల ఖర్చుతో 18,000 కె. డబ్ల్యుల ఉత్పాదక శక్తిగల ఒక థర్మల్ స్టేషన్ను నెలకొల్పడానికి అవసరమైన యంత్ర పరికరాల సరఫరాకై రుమేనియాలోని విదేశీ వర్తక స్టేట్‌కంపెనీలయిన పారిశ్రామిక ఎగుమతుల కంపెనీతో సింగరేణీ కాలరీల కంపెనీ 1963 ఫిబ్రవరి 20 వ తేదీన ఒక ఒప్పందంపై సంతకం చేసింది. యీ థర్మల్ స్టేషన్ను తమ రామగుండం కాలరీలలో నెలకొల్పుతుంది. 1965–66 వ సంవత్సరంలో ఇది పని ప్రారంభిస్తుందని ఆశించబడుతున్నది మూడవ ప్రణాళికలో 6.1 మిలియన్ టన్నుల ఉత్పత్తి లక్ష్యాన్ని సాధించడానికి అవసరమైన విద్యుచ్ఛక్తి సరఫరాకై యీ విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని నెలకొల్పడం జరుగుతున్నది.

రామగుండం రైల్వేస్టేషన్‌నుంచి సింగరేణీ కాలరీలకు చెందిన గోదావరీ ఖని గనుల వరకు రు. 55 లక్షల ఖర్చుతో నిర్మింపబడిన 10 మైళ్ళ పొడువుగల రైల్వే సైడింగ్‌పై బొగ్గు రవాణాకు, సికింద్రాబాదులోని సెంట్రల్ రైల్వే డివిజనల్ సూపరింటెండెంటు, ఫిబ్రవరి 15 వ తేదీన ప్రారంభోత్సవంచేశారు. వివిధ విస్తరణ పథకాల క్రింద ప్రారంభించబడిన ఇటువంటి కార్యక్రమాలలో ఇది నాల్గవది.

ప్రణాళికా కాలంలో లక్ష్యించిన ఉత్పత్తిని సాధించడానికి యీ సైడింగ్ ఉపయోగపడుతుంది. రామగుండం బొగ్గు గనులవల్ల ఒక మిలియన్ టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయాలని ఉద్దేశించారు.

రోజుకు 6000 టన్నుల చొప్పున బొగ్గును సంభాళించేందుకు ఉద్దేశించిన స్క్రీనింగ్ ప్లాంటుకు సివిల్ పనులతోసహా రు. 25 లక్షలు కంపెనీకి ఖర్చు అవుతాయని అంచనా వేశారు. ఈ విధంగా రామగుండం బొగ్గు గనులలో ఉత్పత్తిని అధికం చేయడానికి యీ సైడింగ్ దోహదం చేస్తుంది.

సింగరేణీ కాలరీ గ్రూపులో 1963 జనవరిలో 2,90,731.1 టన్నుల ఉత్పత్తి జరుగగా 1963 ఫిబ్రవరి నెలలో 2,55,844.2 టన్నుల ఉత్పత్తి జరిగింది.

ఇల్లెందు కాలరీలలోని స్ట్రిట్‌పిట్ వద్ద బొగ్గు తొట్లను గుంజడానికి అవసరమైన విద్యుచ్ఛక్తితో నడిచే ఒక సింగిల్ డ్రమ్ విండర్‌నూ, భద్రతకు అవసరమైన ఇతర పరికరాలనూ రు. 3 లక్షల ఖర్చుతో కొనుగోలు చేయడానికి హంగరీలోని నికెస్ హంగేరియన్ ట్రేడింగ్ కంపెనీకి ఆర్డరు ఇవ్వడం జరిగింది. మన దేశంలోకి ఇటువంటి విండర్‌ను దిగుమతి చేసుకోవడం ఇదే ప్రథమం. హంగేరియన్ నిపుణుల అధ్వర్యంలో దీనిని నెలకొల్పడం జరుగుతుంది.

రు. 37.25 లక్షలు విలువచేసే రెండు గనిగొయ్యిల త్రవ్వకం పరికరాలకై పై హంగేరియన్ ఫర్మ్‌కు ఆర్డర్ ఇవ్వడం జరుగుతుంది. క్రొత్తగూడెం కాలరీలలోని నెం. 7,8 స్థలాలలోని గనులను అభివృద్ధి పర్చడానికి ఇవి వినియోగింపబడ్తాయి.

కొత్తగూడెం కాలరీలలోని కాలరీ పనివారల రిక్రియేషన్ క్లబ్ ఆవరణలో 1963 ఫిబ్రవరి 23 వ తేదీన జరిగిన ప్రత్యేక సమావేశంలో జాతీయరక్షణ నిధికై కాలరీల తరపున సింగరేణి కాలరీల మానేజింగ్ డైరెక్టరు, రు 5.00 లక్షల చెక్కును ముఖ్యమంత్రికి సమర్పించారు. యీ మొత్తంలో రు 4.00 లక్షలను కాలరీలకు చెందిన పనివారలు, సిబ్బందీ అధికారులు విరాళంగా ఇచ్చారు. మిగతా రు 1 లక్షను కాలరీల కంపెనీ విరాళంగా ఇచ్చింది.

### నిజాం చక్కెర ఫ్యాక్టరీ

*చెరకు క్రషింగ్ :-* యీ నెలలో 85,696 యం. టి. ల చెరకును క్రష్ చేయడం జరిగింది.

*చక్కెర ఉత్పత్తి :-* యీ నెలలో 95,103 సంచులచక్కెర ఉత్పత్తిచేయడం జరిగింది.

*చెరకుగడ సరఫరా :-* యీ నెలలో స్వంత క్షేత్రాలనుంచీ రైతులనుంచీ దిగువ విధంగా చెరకుగడ ఫ్యాక్టరీకి అందింది :

| | | |
|---|---|---|
| i. సెంట్రల్ రైల్వే | ... | 16084 |
| ii చిన్న రైల్వే | ... | 38210 |
| iii. రోడ్డు మార్గంగా | ... | 32638 |
| మొత్తం టన్నులు. | ... | 86932 |

### ఫ్యాక్టరీ సందర్శన

ఐక్యరాజ్యసమితికి చెందిన సాంఘిక సంక్షేమం ప్రాంతీయ డైరెక్టరు శ్రీ జహీర్ అహమద్, ఐ. ఎ. యస్. 1963 ఫిబ్రవరి 7 వ తేదీన ఫ్యాక్టరీని సందర్శించారు. ప్రణాళికశాఖమంత్రి డాక్టర్ యం. చెన్నారెడ్డి 1963 ఫిబ్రవరి 24 వ తేదీన ఫాక్టరీకి వచ్చారు.



# శ్రీనాథయుగము: అన్యదేశ్యములు

తూమాటి దోణప్ప

(గత సంచిక తరువాయి)

7. *కంగారు :* కలవరము ; మనఃక్షోభము. 'వెంగలి విత్తయి తిరుగుచుఁ - గంగారై చెడక' (భాగ. 9-583); యుద్ధము అని ఆంధ్రపద పారిజాతము, పు. 106 < మరాఠీ. ఖంగార్ = నాశము ; శిథిలము ; పారసి. కంగర్ = మొండి పట్టుదల ; మొఱకుఁదనము.

8 *కత్తలా (ణా)(ణి)ని :* రూ ఖత్తులాణము. ఖత్లాన దేశపు గుఱ్ఱము. A horse brought from Khatlan (బ్రౌణ్యము) ; తెల్లని గొరిజయుఁ దోఁకయు వెండ్రుకలును గల నల్ల గుఱ్ఱము (శ.ర.,పు. 197) ; కవచము తొడిగిన గుఱ్ఱము (ఆంధ్ర పద పారిజాతము, పు. 116) ; 'అమర వల్లభు హరితో - నుల్లస మాడం జాలెడు - తెల్లని యొక కత్తలాని తేజీహయమున్' 42 (నైష. 6-96), (ద్వా. 3-141) ; 'సాహిఖుల్ దెచ్చిన కత్తళాని' (వరాహ. 3-40), 'వేలుపుఁ గత్తళానికి...' (పైది. 4-145). ఇది కర్తలాణ శబ్దభవమని ఆంధ్ర నిఘంటువుల అంచనా (శ.ర.,పు. 197, వైకృత దీపిక; పు. 27; పురుషోత్తమ కవీయము, పు. 22). కాని, ఏ సంస్కృత నిఘంటువునను 'కర్తలాణ' పదము కానరాదు. తుదకు ఆంధ్రదేశీయులయిన సంస్కృత కోశకర్తలును దీనిని పేర్కొనలేదు. శ.ర.లో కర్తలాణము అను పదము నొద్ద 'సం.వి అ. పుం-తెల్లని గొరిజ తోఁక వెండ్రుకలు గల నల్ల గుఱ్ఱము, కత్తలాని' అని వ్రాయఁబడి 'పూర్వవత్సర్వ శుక్లాంగస్త్వచా కృష్ణోభవేద్యది - వరోనామ్నా సవిజ్ఞేయః కర్తలాణస్తురంగమః' అను శ్లోకము శివతత్త్వ రత్నాకరములోనిదిగా ఉదాహృతము. ఈ శివతత్త్వ రత్నాకర మెక్కడిదో ఎప్పటిదో యెఱుఁగరాదు. 'ఖత్లాన దేశపు గుఱ్ఱ'మని బ్రౌను దొరగారు చెప్పిన వ్యుత్పత్తి సంగతమగునో కాదో చూడకుండ ఉపేక్షించుట యుక్తము కాదు. < పారసి. ఖత్‌లాన్ = బదఖ్‌షాన్ దేశములోని 'ఖత్‌లాన్' అను మండలము బదఖ్‌షాన్ ఇండియా - ఖురాసాన దేశముల నడిమి దేశము; పద్మరాగములకు ప్రసిద్ధి; ఖత్‌లానీ = ఖత్‌లాన దేశ సంబంధి; 'ఖతలాన' దేశపు మేలిజాతి గుఱ్ఱము; అరబీ. ఖత్‌ల్ = కుటిల ప్రచారము, కుటిలగతి ; పొంచియుండి ఒడిసిపట్టుట. ముఖ్యముగా శృంగార నైషధ ప్రయోగ మిట పరిశీలనార్హము.

'తెల్లని యొక కత్తులాణ తేజోహయమున్' (భువనగిరి రంగయ్య శెట్టిగారి కుమారుఁడు చెన్నకేశవులు శెట్టిగారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షరశాలా ప్రచురితమగు నైషధము, అ. సరస్వతి - నృసింహాచార్యుల వారిచేఁ బరిష్కృతము, మదరాసు, 1889, పు. 96) ;

'తెల్లని యొక కర్తలాణ తేజో హయమున్' (కర్తలాణము నొద్ద నీఁబడిన శబ్దరత్నాకర పాఠము, 1885, పు. 211);

వేదమువారి సర్వంకష వ్యాఖ్యలో 'కత్తలాని' పాఠము స్వీకృతమయి కర్తలాణ శబ్దభవముగా నిరూపితము. శ.ర.లో నుదాహృతమైన శ్లోకమే యిందును ఉట్టంకితము, 1913 ;

'తెల్లని యొక కత్తులాని తేజీ హయమున్' (శ్రీమద్దేవ రాజసుధీ పరిశోధితము, కే. వేంకటశాస్త్రి విరచిత టీకా తాత్పర్య సహితము, ఆనంద ముద్రాలయ ప్రచురితము, 1914, పు. 561) ;

'తెల్లని యొక కత్తలాని తేజీ హయమున్' (ఉత్పల వేంకట నరసింహాచార్య పరిష్కృతము, వావిళ్ళ ప్రచురితము, 1927 ; వావిళ్ళ, 1951) ;

ఇఁక, తాళపత్ర ప్రతుల పాఠము లీ దిగువ ఉద్ధృతములు :

'తెల్లని యొక ఖత్తులాణి తేజీ హయమును' (ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథా

---

42. 'మహేంద్ర ముచ్చైః శ్రవసా ప్రతార్య యన్నిజేన్యపత్యాఽకృతసింధురన్వితమ్
స తద్దదేఽస్మై హయరత్నమర్పితం పురాను బద్ధుం వరుణేనబంధుతామ్'
— (శ్లో. 25, షోడశః సర్గః, నైషధ మహాకావ్యమ్ చౌఖంబాప్రతి) అన్నది దీనికి మూలము.

లయము నందలి తాళ పత్ర ప్రతి నెం. 29672,79 వ ఆకు, మొదటి వైపు, 3 వ పంక్తి) :

'తెల్లని యొక ఖత్తులాణ తేజో హయ మును' (ఆం.వి.గ్రం. తాళపత్ర ప్రతి నెం. 29800,95 వ ఆకు, రెండవవైపు, 6 వ పంక్తి) ;

'తెల్లని యొక ఖత్తులాణి తేజీ హయ మునూ' (ఆం.వి.గ్రం. తాళ పత్ర ప్రతి, నెం. 32660,80 వ ఆకు, మొదటివైపు, 3 వ పంక్తి).

"ఒక తాళపత్ర గ్రంథములో 'ఖత్తులాని తేజో హయమున్ అని పాఠ భేదము... సంస్కృత నిఘంటువులలో ఈ పదము కానరాదు. ఇంకను విచార్యము" (సూ.ని., సంపుటి II, పు. 154, 'కర్తలాణము' శబ్దము నొద్ద). శబ్ద రత్నాకరమున 'తేజీ' శబ్దము నొద్ద (చూ.శ.ర., 1885, పు.498) 'తెల్లని యొక కత్తలాని తేజీ హయమున్' అను పాఠము ఉదాహృతము. పూర్వ ముద్రణ పాఠములను, తాళపత్ర ప్రతుల పాఠములను పరిశీలింపఁగా, 'కత్తులాని/ ఖత్తులాణ' ఘటితములే మూల పాఠము లనియు, బ్రౌను దొరగా రొసంగిన వ్యుత్పత్తి సుసంగతమనియు, కర్తలాణ శబ్ద నిర్వహ ణకు శ.ర. కర్త మార్చిన నైషధీయ పాఠ మగ్రాహ్య మనియు పిండితార్థము. శ్రీరంగ మహత్త్వము (మానవల్లి సంపాదితము, జ్యోతిష్మతీ ముద్రాశాలా ప్రచురితము, చెన్నపురి, 1912) నందలి 'వెసఁగదలించి హేయనిన వ్రేల్మిదిలోనన నిల్చి...వాగె వదల్చినఁ జువ్వనన్ — జవం బెసఁగఁగ గాలి మీఱు భువి నెన్నికకెక్కిన ఖర్తులాణ ముల్' (చతుర్థా. 1009 వ పద్యము) లోని 'ఖర్తులాణము'పై శ.ర. కర్త సృష్టించిన 'కర్తలాణము' ముద్ర గాఢముగా పడినట్లు స్పష్టము.

*9. కప్పలి* :— సరకుల రవాణాకు ఉపక రించెడి ఒక దినుసు విలాతి ఓడ. '...కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగువల్లి వలికా సమ్మాన్లఁదెప్పించు ...' (హర. పీఠిక, 28). మలయా భాషలో 'కప్పల్' అనఁగా ఓడ. కర్పరశబ్ద భవముగా పేర్కొనుట (వైకృత దీపిక, పు. 28; పురుషోత్తమ కవీయము. పు. 23) ప్రామా దికము.

*10 కమరు* :— ఒడ్డాణము; మొల నూలు. '...కటి మండలము మీఁద వజ్రాల కమరు గర్వంబుసూప' (కాశీ. 3–240), '...వజ్రాల కమరునిల్పి' (పైది. 7–148). 'వజ్రాల కమరుదేవ విడంబనము సేయు నే కొండ మొలచుట్టు నిందుతనయ' (శివరా. 2–3); 'నితంబముమీఁద సవరింప వేల వజ్రాలకమరు' (పైది. 2–26). < మరాఠీ. కమర, కంబర, కమ్మర = నడుము, కటి స్థలము; కమ్మర్ బొంద్ = ఒడ్డాణము; పారసి. కమర్ = నడుము; కమర్- బంద్ = ఒడ్డాణము.

*11. కాకితము* — లేఖ, పత్రము, 'అన్నయమంత్రి శేఖరుఁడు...పారసి భాష వ్రాసినన్ — కన్నుల పండు వై యమరు కాకితమందలి వర్ణపద్ధతుల్' (భీమ. 1–74). < మరాఠీ. కాగద్ = కాకితము, పేపరు; పారసి. కాఘజ్, కాఘిజ్ = కాకితము; లేఖ; పత్రము; ఇది కాకలశబ్ద భవనమను మన పండితుల నిర్ణయము (వైకృత దీపిక, పు, 32; పురుషోత్తమ కవీయము, పు. 27; ఆంధ్ర పదపారిజాతము, పు 134; ఆంధ్ర వాచస్పత్యము, పు. 805; లక్ష్మీనారాయ ణీయము, పు. 225) నిరాధారము. కాకల శబ్ద మే సంస్కృత నిఘంటువునను గన్పట్ట లేదు. 'కాకల'శబ్దము 'కాకితము' అగుట అసంభవము. సంస్కృతమున 'కాఘజ్' పారసి మూలకముగా మోనియర్ విల్యమ్సునఁ బ్రదర్శితము.

*12. కిచ్చడి* :— నానా వస్తువులు చేర్చి వండు చిత్రాన్న విశేషము (శ. ర; సూ.ని.). '...చారులుఁ దియ్య కూరలుఁ బచ్చడులుం గిచ్చడులును...' (కాశీ.7–185) < మరాఠీ. ఖిచడీ ఖిచిడీ; పారసి. కిచ్‌రీ : పప్పు, బియ్యము, వెన్న – వీనితో తయారుచేయు భారతీయుల వంటకము.

*13 కుందనము* :– మేలిమి బంగారు. 'దశశతాక్షుఁడు తొడుగు కుందనపుఁ బైఁడి కంకటముబోలు ?' (నైష. 6–106), 'పది యారు వన్నెకుందనపుఁదగడు' (భీమ. 2–55), 'కూర్పించె నల్లిండ్లు కుందనమున' (పైది. 5–188), 'కడాని కుందనంబు' (కాశీ 7–126),'కుందనపుఁ బూదె చందాన నందమొందె' (హర. 2–115), 'కోమలి కాంతితోఁ గుందనంబు' (విక్ర, 4–19) ,'వలిచన్ను గవతళుకులు కుందనపు నిగ్గుల నొనర్ప' (రుక్మా. 3–145), 'ధగ ధగమించు కుందనమున' (నవనా. పు. 20), 'ఉలూచిదాల్చు కుందనపు మెఱుంగుఁ గమ్మలును' (జై. 7–74), 'చందనంబునఁ బుష్టంబుఁ గుందనమున' (పిశకుం. 2–62), 'అట్టి యాకుందన మొక్కచోట నిడి' (నా. పంచ. మిత్ర భే. 515), 'కుందనపుకాళ' (తాళ్ళపాక, ఆధ్యాత్మ. X, సంకీర్తన, 180), 'కుందనపుఁ గాహళం బులు' (వరాహ. 11–44); 'సకలాకల నొరసిన కుందనపు బూదెయును బోలె' (ప్రబోధ. 1–29), 'కుందనంపు హరివాణ మునన్' (వేం. పంచ. 4–356). < మరాఠీ. కుందన; గుజరాతీ, కుందన్ = మేలిమి

బంగారు; పారసి. కుందన్ = పరిశుద్ధ లోహము. కన్నడమునందలి 'కుందణ, కుందన' పదములు దేశ్యములని కిట్టెల్ కన్నడ నిఘంటువు. పు. 441.

*14* కుల్లా :— పటరచిత మకుటము. 'కుల్లా వెట్టితిఁ గోకసుట్టితి...' (శ్రీనాథుని చాటువు) < పారసి. కులాహ్ = నల్ల గొఱ్ఱెపిల్లతోలుతో కూచిగాచేసి ముస్లిము సాధువులు, దర్వేషులు ధరించెడి టోపి; కులాహ్ = రాజు, ప్రభువు; కుల్లాయి, కుళ్ళా (యయి) పదము లర్వాచీనసాహిత్యమున విరివిగాఁ బ్రయుక్తము. ఇది ఖోలక శబ్దభవమని వైకృతదీపిక, పు. 35; పురుషోత్తమ కవీయము, పు. 31; చూ. కోహళి.

*15.* కొజ్జా :— షండుఁడు, నపుంసకుఁడు. 'వీధులఁదిరగంగ వెసఁదలారులు పట్టి కొజ్జానుజేసి రోసజ్జవారి...' (భోజరా. 4-,319); 'అవుషండునకు కొజ్జాయనంగ..' (వేంకటేశాంధ్రము. మానవవర్గ. 33) < మరాఠీ. ఖోజా, ఖ్వాజా = ఫకీరు; ఏలిక. ఒక బిరుదము; పారసి. ఖ్వాజ = ధర్మదేశికుండు; పూజ్యుఁడు; ఏలిక; నపుంసకుఁడు; అంతఃపురము; ఖ్వాజసరా = నపుంసకుఁడు; ఖ్వాజ = షండుఁడు; రాణివాసపు కావలివాఁడు; ఖ్వాజా = ఆశీస్సు.

*కోహళి*:— చూ. కుల్లా = శిరాచ్ఛాదనము; ఆలవట్టము, ఉల్లడ — అని పూర్వనిఘంటువులు. 'మౌళింగోహళి సంఘటించిన క్రియన్ మధ్యాహ్న వేళన్ మహాకాళంబైన నభో విభాగమున వీఁకంగాసె బీరెండ...' (హర. 7-109). 'పార్వతీపతికిఁ బ్రభాత భూతపతి గొన్న యలరుఁగెందమ్మి కోహళి యనంగ — భానుబింబంబు గన్నులవండువయ్యె' (ఉ. హరి. 3-86). 'పయిరెండు ప్రయోగములు తక్కఁ దెలుఁగున నీపదము నాకిఁకనెక్కడను గానరాలేదు' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వ్రాఁత. (చూ. తెలుఁగు మెఱుఁగులు. పు. 120). కాని, మఱికి సింగనప్రయోగము—

'ఎసగంగ నుదయా చలేంద్రంబు మౌళి
పసిఁడికోహళి యన భానుఁడు వొదమ'

(ద్వి. భాగ. పు. 193) శ్రీ శాస్త్రిగారి చూపున కాని నట్టు కన్పట్టదు. 'మరుఁడను నైంద్ర జాలికుఁడు మానిని నీలముఖ స్తనద్వయీ-నిరుపమ కోహళీ యుగళినించి ..' (కోహళీ యుగళి = తొడుగులు, కుప్పెలు) అను 'వనమాలివిలాస' ప్రయోగము సూ ని. ఉట్టంకితము-కోహళికి ఆంధ్రశాసన ప్రయోగములు కొన్ని :

'...శ్రీ విక్రమోత్తుంగ రాజేంద్ర చక్రవతిన్ స్వస్తి శ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవరకుం బుత్తెంచిన పహిండి చతుమున్ ఖ కోహళి' (త్రిపురాంతక శాసనము, A. R. No. 170 of 1905; 2,3 పంక్తులు; క్రీ. శ. 1292);

'...ఈ దినమందు ధర్మలింగానకు పంచవక్త్ర కోహళి భంగారానం జేయించి సమప్పిన్ంచిరి' (పంచధార్ల ధర్మలింగేశ్వరాలయ శాసనము, A. R. No. 218 of 1899; 17, 18, 19 పంక్తులు; క్రీ. శ. 1422);

'...ఉత్సవ పెరుమాళ శ్రీ ముఖానకు ఐదు తులాలు ౫ భంగారానను కోహలి సమప్పిన్ంచినాడు' (శ్రీ కూర్మము శాసనము, A. R. No. 347 of 1896; క్రీ. శ. 1495). మఱి యొక ప్రయోగము కళింగ శాసనములలో నెక్కడో చూచినట్లు గుర్తు. ఇది సంస్కృత పదము కాదు. దేశ్యము కాదనుటకు దీని రూపమే ఒక తార్కాణము. తొడుగు, గొనెన అను నర్థముల 'కోహళె' కన్నడ కుమారవ్యాస భారత ప్రయుక్తము. మరాఠీ. ఖోళ = ఆచ్ఛాదనము; పొది; గుజరాతీ. ఖోళీ = గొనెన, పరుపుగలీబు. 'కులాహ్' అను పారసి పదము వర్ణ పరివర్తనమున * కుహ్లా > కొహ్లీ > కోహళి అయి యుండనగునేమో ? ఇంకను విచార్యము.

ఖత్తులాణము : చూ. కత్తలాని. వాస్తవముగా 'కత్తలాని' కిది పూర్వ రూపము. '...విగతత్రాణంబులగు ఖత్తులాణంబులను విస్తీర్ణ జీర్ణాంగంబులకు మాతంగంబులను...' (పి. శకుం. 3-114). తాళపత్రప్రతులను, ముద్రిత ప్రతులను[43] 'ఖత్తుబాణంబులు' అను పాఠము కలదు. '...విగతత్రాణంబ్బులగ్గు కత్తు బాణంబ్బులను విస్తినన్ జీనన్ంబ్బులగు మాతంగ్గంబ్బులను...' (ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతి (బొబ్బిలిప్రతి) నెం. 111,51 వఅకు, రెండవవైపు, రెండవపంక్తి). '...విగతత్రాణంబులగు ఖత్తు బాణంబులను విస్తీనన్ జీనాన్ంగంబులగు మాతంగంబులను...' (ఆం. వి. గ్రం. తాళపత్ర ప్రతి, నెం. 29434,172 వఅకు, మొదటివైపు, 3 వ పంక్తి). చతురంగబలమున మాతంగములతోపాటు తురంగములను పేర్కొనుట సంగతము కావునను, అశ్వార్థమున 'ఖత్తు

---

43. 'విగతత్రాణంబులగు ఖత్తు బాణంబులను విస్తీర్ణ జీర్ణాంగంబులగు మాతంగంబులను' — వావిళ్ళవారి 1923 ప్రతి, పు. 68; కొండపల్లివారి 1968, 1947 ప్రతులు, పు. 64.

లాణ' పదము అన్యత్ర స్థితిస్థాపకముకావు నను. ఇట 'ఖత్తులాణంబులు' అను పాఠమే యుక్తము. 'ఖత్తుబాణంబులు' లేఖ కల్పితము ; పదస్వరూపమును పరిశీలింప పాటు మాలిన పరిష్కర్తల అలసతకు ప్రతిబింబము.

*16. ఖర్చు :* వ్యయము. 'అన్నపు ఖర్చున కాకుపోకలకు - ఈనున్న దేమైన ఇపుడె యిప్పింపు' (పల్నాటి. పు. 69) < మరాఠీ. ఖర్చ = వ్యయము ; ఖర్చణేఁ = ఖర్చుచేయు ; పారసి. ఖర్చ్ = ఖర్చు ; ఖర్చీ = ప్రయాణసంబంధమైన వ్యయము ; రోవెల < అరబ్బీ.

*17. ఖాన :* ముస్లిములలో పఠాన్ తెగ వారి పట్టపుపేరు. 'ఇమ్మడి సైపఖానాది రాజ్యభార ధుర్యుండు విఠ్ఠల ప్రభువరుఁడు' (శ్రీరంగమహత్త్వము పీఠిక. 43). < మరాఠీ. ఖాన = ముస్లిము పాలకుల బిరుదము; పారసి. ఖాన్ = ఖాత. తుర్కానీ (తార్తారీ) వంశీయులగు రాజుల బిరుదము; యువరాజు; ఉత్తమ వంశీయుఁడు; ఏలిక. ప్రభువు < తుర్కీ. ఖాన్.

*18 ఖుసి :-* సంతోషము; విలాసము. 'ఖుసి మీఱన్ సురధాణి నిండు కొలువై కూర్చున్న చో...' (హర. పీఠిక. 22) < మరాఠీ. ఖుశీ, ఖుశ, ఖూశ (ష) = ఆనందము; సుఖము; పారసి. ఖుసీ.

*19. గంజాయి :-* గంజాయి ఆకుతోఁ జేసిన మత్తుపదార్థము. 'గంజాయిఁదినఁగ నుత్కంఠఁజేసినవాఁడ' (శివరా. 3-62). 'గంజాయి దినెనేమి...' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 241) < మరాఠీ. గాంజా. 'కల(శ)ంజ' పద భవమను పండితుల నిరూపణము అగ్రాహ్యము.

*20. గలబ :-* అల్లరి, సందడి, కలఁత. 'ఈ మహోత్సవంబులలో నిట్టి గలబలు పేయుదురే' (ద్వా. 7-30.) 'ఎల్లజనులం గూర్చుండనిడి గలబ పుట్టకుండ నెర నెరం దల వరుల నిలిపి' (పైడి. 7-64) < మరాఠీ. గలబలణేఁ = అల్లరియగు; గలభా=క్షోభము. ధ్వన్యనుకరణమును కావచ్చు.

*21 గసగస.* ఒక దినుసు మసాలా విత్తులు; నల్లమందు విత్తులు (ఆంధ్రపద పారిజాతము. పు. 184). 'గసగస లిపయును. (భీమ. 3-57). 'గసగస యెసకమెసఁగె' (కాశీ.3-23). 'గసగసలు' (పైడి. 7-185). 'గసగసలు చాఱపప్పు' (రుక్మాం. 3-6) < పారసి. ఖష్ఖాష్; 'గసగసాలు : the minute seeds of the poppy plants. This is corrupted from the Arabic name 'khash khash' Ainsl. 1.326 (బ్రౌణ్యము. ప్రథమ ముద్రణము. పు. 204). గసగసాలనుట పునరుక్తియను భ్రమవలన కాఁబోలు 'గసాలు' అని అనంతపుర మండలము వారి వాడుక.

*22. గస్తు :* దొంగతనము లోనగునవి జరుగకుండుటకై కావలివారుఊరుతిరిగికాచు కావాలి. 'గస్తు దిరిగి' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 252). 'అర్థరాత్రవేళ-ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ - బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు' (వేం. పంచ. 3-197) < మరాఠీ. గస్త = కావలి. పహారా; పారసి. గష్త్ = అవలోకనము; విహారము; పహారా. కావలి కాయుట; గష్తీ = కావలి; గష్తియా = కావలివాడు; గుల్ గష్త్ = విహారానుగుణమగు గులాబీలతోట; శహర్ గష్త్ = ఊరేఁగింపు.

*23 గాగరా :* స్త్రీలు కట్టుకొను పావడ. 'వన్నెల గాగరా జిలుగు వస్త్రువకుచ్చెళు లందు...' (శ్రీనాథుని చాటువు < మరాఠీ. ఘాగ్రా = స్త్రీలపావడ; ఘాగ్రీ = పిల్లల మొలనూలిగంట.

*24. గులాము :* రూ. గుల్లాము. దాసుఁడు; దాసురాలు. బానిస 'ఓసీ గులామ నన్నెఱుఁగకుండఁగ నెయ్యెడ కేఁగితి...' (నా. పంచ. మిత్రభే. 183 వ పద్యము); హీనుఁడు. 'చెలువెల్లమును కీక్షింప నిచ్చినసొమ్ము మగుడనీ లేని కోమటి గులామ' (వేం. పంచ. 1-763) < మరాఠీ. గులామ = కొండెగాఁడు; నీచుఁడు; తొత్తు కొడుకు; బానిస. పారసి. గులామ్ < అరబ్బీ.

*గుల్లాము :* చూ. గులాము. నీచురాలు. 'లంజెతల్లియె యిదియు గుల్లాముగాక' (క్రీడా. 265).

*25. గొంగడి :* కంబళి. 'గొంగడు లెగురగవైచుచు' (భాగ. 10. పూ. 437). 'ముసుఁగిడ్డ యొరగొంగడియు' (నవనా. పు. 27). 'గొంగళ్ళు' (వేం. పంచ. < మరాఠీ. ఘొంగ=దుప్పటి; ఘొంగడీ. 'కంబళ' శబ్దభవమని కవిసంశయ విచ్ఛేదము. పు. 70. ఆంధ్రపద పారిజాతము. పు. 201. ఆంధ్రవాచస్పత్యము. పు. 1108; 'పదపడియలఁతి దుప్పట్లు గొంగెడలు' (పర్వత. పు. 339) అని పండితారాధ్య చరిత్ర ప్రయోగము -

*26 గోరక్కుఁడు.* నవనాథులలో నొకఁడు; మత్స్యేంద్రనాథుని ప్రధాన శిష్యుఁడు. 'గుణరత్న నిధియును గోరక్షుఁ డనఁగ' (నవనా. పు. 254). 'అక్కడ మాని తత్పురియుపాంతమునన్ మననంబు లోన గోరక్కుఁడు మీననాథుడు...' (ద్వా. 12-48) < మరాఠీ. గోరక్ష=నవనాథులలో నొక సిద్ధుఁడు.

*27 గోవ* పశ్చిమ సముద్రతీరమునఁ గల రేవు పట్టణము; పడమటి సీమలనుండి

వచ్చు బేరపు దినుసులు ఈ రేవుగుండ దిగుమతి యయ్యెడివి. పూర్వనామము గోమంతకమఁట! 'సిందాపూర'యని మధ్య యుగముల వ్యవహారము. గోమంతకము 'గోవ' అయినదఁట! 'గోవజవ్వాది' = గోవారేపునుండి దిగుమతియయిన జవ్వాది (నైష. 6_120), 'గోవనంకుర్ద సంకుమద ద్రవముఁదెచ్చె' (హర. పీఠిక, 26), 'తరుణాసీరి తవాయి గోవరమణాస్థానంబు లన్...' (పైడి. పీఠిక, 28) > మరాఠీ గోవేఁ = గోవా పట్టణము.

*28 గోహరి :* పరాక్రమము. 'హరి కిశోరముల గోహరికి శోషిలని దుర్వార గర్వాటోప వీరభటులు' (జై. 6_154) > పారసి. గోహార్ = ప్రతిభ; అంతర్నిహిత శక్తి.

*29. చబుకు :* కొరడా. చేఁబుకోల 'వాజిశవంబుల వడిమీద నెక్కి _ చబుకుల గొట్టుచుచనుమను వారు' (పల్నాటి. పు. 119), 'సమరనముఁజూపి నెఱయఁబగ్గములు వదలి, సైంధవంబుల ధేయని చబుకు సేయ' (జై. 6_53) < మరాఠీ. చాబూక = కొరడా. పారసి. చాబుక్ = కొరడా; చాబుక్ బాజి = చబుకు సేయుట, చబుకుతోఁ గొట్టుట. 'చబుకు' గ్రామ్యమనియు, పారసి అన్యమనియు కాంబెల్. (Campbell, p 224).

*30. చవుక :* రూ. చౌక. ఎల్లిదము, లోఁకువ. 'జీవితతుల్యులం జవుకసేసి' (వేం. పంచ. 1_368) < మరాఠీ. సంవగ(ఘ)=అగ్గువ; గుజరాతీ. సోంఘు= వెల తక్కువ: అపభ్రంశ భాషలో 'సుమగ్ఘ', ( < సంస్కృత. సమర్ఘ)

*31. చాడి :_* కొండెము 'చాడిముచ్చు గొల్లెత' (తాళ్ళపాక. శృంగార సంకీర్తనలు, సంకీర్తన.118), 'చాడికి చెవిఁజేర్తురు'(వేం. పంచ. 1_532) 'చాడికి నొడంబడి యుండెడి వృత్తికన్నఁ జావుమిగుల లెస్స' (పైడి. 2_144) < మరాఠీ. చహాడీ, చాడీ. చాహాడీ=నింద; చాడ, చాడీ=తీవ్రవాంఛ; చాడ=కపటి, మాయావి.

*31. a. చామలా :_* ఒకరకమైన కడియములు. 'చామలా కడియముల్...' (పల్నాటి. పు. 72) < మరాఠీ. శామల= అబిసీనియాదేశపు సోమాలి.

*32. చావడి :_* కొలువుకూటము; రచ్చ, కార్యస్థానము. '...పెద్దసావళ్ళ _ చేరి భాషింపుచు...' (పల్నాటి. పు. 28), 'స్వప్నమనే యెడపుఁజావడిలో'(తాళ్ళపాక. ఆధ్యాత్మ. vi. 124), '...నగరిచావడి కద వాకిటఁ దురగమ్ముడిగం...' (జై. 8_80), లోపలచావిడిం గొలువున్న...' (వరాహ. 6_90), '...అద్దంకి సావడిని...' (A. R No 792 of 1922, 5వ పంక్తి క్రీ. శ. 1448) < మరాఠీ. చావడీ= కొత్వాలు చావడి; రచ్చబండ; చాహవడీ (వేళాపూర్ శిలాశాసనము) < సం. చౌహాట (మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, పు. 276).

*33. చికిలి _* తుడిచి చక్కచేయుట (శ. ర.), మెఱఁగు, పదను; శస్త్రసమ్మార్జనము 'చిఱుసానఁ బట్టించి చికిలిచేయించిన గండ్రగొడ్డలి...' (కాశీ. 1_121), 'చికిలి చేసిన యడిదంబు' (శివరా. 4_74), 'చికిలి చేసిన తామ్రంపుఁ జెంబుఁబూని' (వీధి నాటకము, 17). 'శృంగార రసమునఁ జికిలిసేయించిన కుంతు మోహన సాయకంబులన...' (రుక్మాం. 1_71), చికిలి చేసిన మదనాస్త్ర నికరమనఁగ' (పరతత్త్వ రసాయనము, 1_100) < మరాఠీ. సికల= మెఱుఁగు; గుజరాతీ. సికల్ = మెఱుఁగు; సికలీగర=ఆయుధములకు పదను పెట్టువాఁడు; పారసి. సక్కాల్ = మెరుగుపెట్టువాడు; అరబ్బీ. సకల్ = మెఱుఁగు.

*చౌక :_* చూ. చవుక. తక్కువ, లోఁకువ. 'చౌకసేయకక్రుంకి' (నవనా. పు. 205), 'వానిబ్రదుకు చౌకౌగాదే' (ద్వా. 3_194), 'ఆచారంబు చౌకసేయు' (పి. శకుం. 5_163).

*34 జబ్బు :_* అలసము, మందము (శ. ర, పు. 421), అసారము (ఆంధ్ర పదపారిజాతము, పు. 251), జడిమ 'జబ్బించుకలేని యొదలు' (శ్రీనాథుని చాటువు) < మరాఠీ. జబూన=పేదవడిన, బీదగిలిన; పారసి. జబ్బ్=కృశించుట, చిక్కిపోవుట, వట్టిపోవుట, శుష్కించుట. < అరబ్బీ: దేశ్యమనికిట్టెల్ (కిట్టెల్ కన్నడ నిఘంటువు, పు. 636).

*35. జమ్ముఖాణము :_* రంగు రంగుల నూలిపట్టెలుగల ఆస్తరణము, జముకాణము. '...వస్తువిచారుఁడు...వివేక నృపతి చరణంబులకున్ _ వినతుండై తచ్చాసనమునఁ జేరువజమ్ముఖాణమునఁ గూర్చుండెన్' (ప్రబోధ. 4_13) _ ఇది నూ. ని. పాఠము. '...జమ్ముఖాణమునఁ గూర్చుండెన్' అని ముద్రిత ప్రతిపాఠము, పు. 35. 'వస్తువిచారః॥ (ఉపసృత్య) జయతు జయతు దేవః ఏషవస్తు విచారః ప్రణమతి.

రాజా॥ ఇహోపవిశ్యతాం.

వస్తువిచారః॥ (ఉపవిశ్య) దేవః, ఏష తే కింకరస్సంప్రాప్తః, తదాజ్ఞయాఽను గృహ్యతాం' _ అని మూలము (కృష్ణమిశ్ర యతి, ప్రబోధ చంద్రోదయ _ చతుర్థాంక_, పు. 125, త్రివేంద్రమ్ సంస్కృత గ్రంథ

మాలిక, నెం. 122, సాంబశివశాస్త్రి సంపాదితము, 1936) < మరాఠీ. జమ్‌ఖాణ.44

*36 జరి* :– వెండి బంగారముల మొలాము. 'జరిగొన్న వెలిపట్టు జన్నిదంబులలుంగ' (క్రీడా. 42), 'జరివోని గడితంపుఁ జిఱుతచౌకంబుల' (పైది. 134), 'జరిగొన్న వెలిపట్టు జన్నిదంబుల తోడ రత్నాలతారహారముధరించి' (శివరా 2–90). 'వెన్నెలజరియిడ్డ వెండితీగెలఁ బోలు యజ్ఞోపవీతంబులు...' (విక్ర. 7–143) < పారసి జర్, జరీన్ = బంగారు, ధనము; జర్‌తార్ = బంగారు పోఁగుతో చేయఁబడిన; వెండి, బంగారము మొదలగు వానితో మొలాముచేసిన నూలిపోఁగు; జర్ (=బంగారు) + తార్ (=దారము); జర్ తారీ = బంగారు మొలాము చేసిన నూలి పోఁగుతో నేసినవస్త్రము; జరబాజీ (జు) = జరీవస్త్రము; తెలుఁగున జరతారు,' 'జలతారు'గా పరిణమించుట వర్ణవిభేదనము (dissimilation)కు లక్ష్యము. జలతారీ(రు), జల్తా(రీ)రు దీని రూపాంతరములు. 'జలకము + తారు' అను శ.ర. వ్యుత్పత్తి అశాస్త్రీయము, తన్మూలమున నిరాకృతము. శ. ర. 'జరి' నివైకృతమనుట నిరాధారము. వైకృతదీపికలో నీపదము కానరాదు ప్రాచీన పారసీక భాష–అవెస్తా–లో 'రన్య' అనఁగా బంగారము. అవెస్తాకు సోదరభాష యగు సంస్కృతమునందలి 'హిరణ్య', పారసిలోని 'జరన్య'కు జ్ఞాతిపదము (Cognate word). జరీకుచ్చులజీను, జరీకోక, జరీ బుటాచీర – అన్నవి తెలుఁగున అర్వాచీన ప్రయోగములు; చూ. జలపోసనము.

*37 జలనోంగి* : ఇది యే పట్టణమో యెఱుఁగరాదు ; ఆఫ్రికా తూర్పు తీరము నందలి 'జీలాన్' రేవు పట్టణము కానోపు 'జలనోంగి బంగారు మొలకఁ దెచ్చె' (హర. పీఠిక, 26).

*38. జలపోసనము* : బంగారు పై పూఁత, సువర్ణాచ్ఛాదనము ; 'బంగారు జలపోసనముతోడి ప్రస్నని సట్టు తోరము ధరించి' (క్రీడా. 42), 'పైఁడి జలపోసనపు కసీనంపు పట్టు బంతి' (కాశీ. 6–161), 'పసిఁడి జలపోసనముతోడనె సకమెసఁగు–బిసరుహాసను పుఱియ కప్పెరధరించి' (హర. 5–55), 'పైఁడి జలపోసనము వీజె' (రుక్మాం. 4–35), 'పైఁడి – జలపోసనంబులఁ జాలనొప్పారు – పల్లనంబులు...' (నవనా. పు. 143), 'సరిలేని బంగారు జలపోసము వీజె' (శ్రీరంగ మహత్త్వము. 2–70) < పారసి, జర్‌పోష్ = బంగారు లేసు పని. జర్ (=బంగారు) + పోష్ (=ఆచ్ఛాదనము, పూఁత) : గుల్‌పోష్ = గులాబీలచే అలంకృతమయిన ; జీన్‌పోష్ = జీనుమీఁది ఆచ్ఛాదనము ; పలంగ్‌పోష్ = పరపుపైని దుప్పటి ; పాయ్‌పోష్ = పాదాచ్ఛాదనము, పాదరక్ష (తెలుఁగున 'పాపచ్చులు, పాపోసులు, పాయిపోసులు) మేజ్‌పోష్ = మేజామీఁది ఆచ్ఛాదన వస్త్రము – ఇట్లు'–పోష్' అనునది పారసిలో విరివిగా ఉపయుక్తము. సర్వాంధ్ర పద ప్రదర్శని యగు ఆంధ్ర పద పారిజాతము 'జరపోసు' అను పదము నుట్టంకించి 'జరీ' అను నర్థము నిచ్చినది. (చూ.పు–251). 'జలపోసనము = జలకము (< సం. జలమ్) + పోసనము' అనువ్యుత్పత్తి (శ.ర., పు.423; ఆంధ్ర వాచస్పత్యము, పు. 1296; సూ.ని. III. పు. 407) నిర్మూలము.45

'జలపోసనముల మీఁదుల విలాసములఁ
గలశముల్ వట్టుఁ గుచ్చుఁ జిత్తరువులు'
–పండితా. పర్వత. పు. 310 ;

'సరిరత్న పంక్తుల జలపోసనములఁ
గరమొప్పు తొంగళ్ళుగల చల్లడములు'
–పైది. పు. 436 – ఇట్టి ప్రయోగములను బట్టి పండితారాధ్య చరిత్ర పంద్రెండవు శతాబ్ది రచన కానేరదు. సోమనాథుఁడు క్రీ శ. 1290 ప్రాంతము వాఁడను మల్లంపల్లి వారి నిర్ణయము (భారతి, 1945, ఫిబ్రవరి)తో ఏకీభవింపక తప్పదు.

*39. జాళువా* : మేలిమి బంగారు. 'Fine gold. Probably (like Ophir or Potosi) the name of a place. Thus జాళువా పసిడి' (బ్రౌణ్యము, పు. 327) 'కమ్మ విలుకాని జాళువా బొమ్మ యనఁగ' (శ్రీనాథుని చాటువు), 'చెలఁగుచు జాళువా చీర ధరించి – రాజిల్లు హొంబట్టు రవికను దొడిగి' (పల్నాటి. పు. 65), 'తోరపు జాళువా పసిఁడి తొట్టుల...' (వేం. పంచ 4–341). దీని మూలము అవిజ్ఞేయము. బ్రౌను దొరగారూహించినట్లు 'జాళువా' యనునది ఏదో యొక స్థల వాచక సంబంధి కానోపు. ఇంకను విచార్యము.

*40. జిరా* : ఏనుఁగులకు, ముఖ్యముగా గుఱ్ఱములకు పైని వేసెడి వస్త్ర కవచము, పక్కెర. 'వాగె వదలి జిరా గనగనం గదలించి తోలిన' (ద్వా. 8–71), 'జిరాల్ గురాలు' (వేం. పంచ. 1–188) < పారసి.

44. పారసి. జామ = మూఁత, తెర; ఆచ్ఛాదనము; ఖానహ్ = స్థానము, తావు; జామ్ = రంగు రంగుల గాజు తలుపు; జామ్‌కాన్ = స్నానాల గదులలో దుస్తులు భద్రపఱుచు అలమార; స్నాన సమయమున ధరించు ఉడుపులు; జామ్‌ఖానహ్ = నేలపై పరచునది.

45. పూజ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి ప్రభృతులు ఆమధ్య 'జలపోసనము' పై కన్నువేసి సాగించిన చర్చ యెక్కడో చదివినట్లు గుర్తు. వీ రేమి నిర్ణయించిరో స్మృతిలో లేదు. ఆకారము కొఱకు వెదకినను ఫలితము శూన్యము.

జిర, జిరహ్, జిరిహ్=కవచము; జిరిహ్ జామ=మీఁది ఉడుపులు; జిరిహి పోష్= సైనికుల దుస్తులను ధరించుట.

*41. జీబు* : వస్త్ర భేదము. '...... శ్రీరామ తోఁపులను...జీబులను......' (ద్వా. 3-188). 'చందురకావి జీబులు' (ఆముక్త. 5-90). 'హొన్నంచు పైరాణి సన్న జీబులు' (ఘటికా. 2-11). 'మాదా వళులను జీబులను' (కవి. 3-195) - అని అర్వాచీన ప్రయోగములు < పారసి. జేబ్ < తుర్కీ.

*42. జులుము* : దుండగము. అత్యాచారము. 'సతి నమ్మెదను హరిశ్చంద్రుఁడన్వాఁడ - జులుము లేటికి నొందు సుద్దులు మాని - తొలఁగుము...' (ద్వి. హరిశ్చ. ఉ., పు. 192) 'జులిమి' అని అందే అర్థ స్ఫూచిక. 'దుడుకులూటి జులిమి దుండగ మనఁదదు...' (వేంకటేశాంధ్రము. మానవవర్గు, 69). 'దుడుకులూటి జులిమి దుండగమ్మన నుద్ధతాఖ్య లౌ...' సాంబ. మానవ. 43) < మరాఠీ. జులూమ జులుమ = క్రూరపాలనము. ఉగ్ర శాసనము; అరబ్బీ. జల్మ=చెడుగా ప్రవర్తించుట; బలాత్కారము.

*43 జూటరి* : కల్లలాడు, మోసగాఁడు. 'కోటి చదువఁగవచ్చు కోపము విలుపరాదు - జూటరై వొకఁడు దన్ను సోఁక నాడితేను' (తాళ్ళపాక. అధ్యాత్మ. VII. సంకీర్తన, 240) జూటు + అరి; 'జూటు' వైకృతమని శ.ర. (పు 429) పరిగణనము. కాని, వైకృత దీపికలో ఈ పదము కానరాదు < మరాఠీ. ఝుట్, ఝూట్, ఝూట=అబద్ధము; మోసము.

*44 జోఁగు* : = వెదురు బద్దలను, పేపబెత్తములనుపేర్చి అల్లిన తెరచాపలు మూఁడు నుండి పండ్రెండు దాఁక అమర్చెడి పెద్ద ఓడ. 'మహితలావణ్య వార్ధిలో మదనుఁడెక్కు-కప్పురపు జోఁగుఁగంటిమి కంటిమనుచు - నర్మగర్భంబుగా నొక్క-నలినవదన - పొగడె సఖిచంటి మీఁది యొప్పుల నఖంబు' (నైష 3-101).[46] సుడివడ్డ ముత్యాల జోఁగువోలె' (కాశీ. 1-138). 'కదలి మొగ యక్కలిందగులు వడి చిక్కిన జోఁగునుంబోలె...' (పైది. 2-98). '...శరధిన్ గప్పలి జోఁగు వల్లి వలికా సమ్మాన్లఁ దెప్పించు నేర్పరియై ' (హర, పీఠిక, 28). ఈ 'జోంగ్' జావనీ, మలయా భాషలలోనిది. ఈ ఓడల తయారీకి చీనావారు కారకులఁట! వీని తెరచాపలను అక్కఅలేనిచో దింపివేయక చుట్టగా చుట్టి ఓడ కంబములకు కట్టివేయుదురు. నాటు పడవలు, ఓడలు కొయ్యచీలలతోడను, కొబ్బెర పీచుపురులతోడను బిగింపఁబడు చుండగా, 'జోంగు'ల కొయ్యపలకలు ఇనుప చీలలతో బిగింపఁబడి బలిష్ఠముగా నిర్మింపఁ బడుచుండెడివఁట. పదునాలుగవు శతాబ్ది వారగు ఇబ్న్ బతూతా, రషీద్-ఉద్-దీన్ మొదలగు విదేశ పర్యటకులు 'జోంగు'లను గూర్చి విస్తరించి వ్రాసిరి. మలక్కా మొదలగు ప్రాచ్య ద్వీపములలో భారతీయవర్తకులు ముఖ్యముగా చోళమండల తీరము వారగు 'జెంతూ' ( = తెలుఁగు) సెట్లు చాలమంది నివసించుచుండిరనియు కోటికి పడగలెత్తిన వీరు 'జోంగు'లను పేరుగల పెద్దపెద్ద సొంత ఓడలను సరకుల రవాణాకు వాడుచుండిరనియు బార్బోజా వ్రాతలు.[47] ఈ తెలుఁగు సెట్లలో నెల్లూరివారు, అవచి తిప్పయ్య సోదరులు చామిసెట్టి ప్రభృతులను ఉండవచ్చు- వ్యుత్పత్తి పరముగా చూచినచో సబిందుకము సాధుపాఠము, తాళపత్రప్రతుల పెక్కింటను సబిందుక రూపమే కలదు.[48] నిర్బిందుకముగా కొందఱు ఉదాహరించుట పొరపాటు.

*45. డమామి (యా)* : డిండిమము, డంకాకంటె చిన్నదియయిన చర్మవాద్యము.

---

46. ,నావాన్మరః కింహరభీతిగుప్తేః వయోధరే ఖేలతి కుంభ ఏష
ఇత్యర్ధ చంద్రాభ నఖాంక చుంచి కుచా సఖీ యత్ర సఖీభిరూచే'
— (శ్లో. 66, షష్ఠస్సర్గః, నైషధ మహాకావ్యమ్, చౌఖం బాప్రతి) అని మూలము.

47. Hobson - Jobson, p. 472.

48. 'మహితలావాణ్యవాధిన్‌లో మదనుఁ దెక్కు
కప్పురపు జోంగు గంట్టిమి కంట్టిమనుచు
నమన్‌గ భన్‌ంబుగా నొక్క నలినవదన
పొగడె సఖి చంటి మీంది యొప్పు లనఖంబు' (శృం. నై., అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29800. 42 వ ఆకు, మొదటి వైపు, 4. 5 వంక్తులు): '...జోంగు గంటిమి గంటి మనుచు...' (శృం. నై.. అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 32660, 39 వ ఆకు, మొదటివైపు, 7 వ పంక్తి);

'ద మా యీ లు' (ప ల్నా టి. పు. 4). 'తబల...దమామి...ధ్వానంబు' (వరాహ. 3-52) < మరాఠీ. ధమామి.

*46. డేరా* : గుడారము 'జ గ ద ం పు డేరాలు...' (పల్నాటి పు. 36); డేర యనఁగ వెలయు ప ట కు టీ రా ఖ్య...' (వేంకటేశాంధ్రము. మా నవ. 74) < మరాఠీ. డేరా = గుడారము.

*47. తబల* : ఒకేకన్ను కలిగి మద్దెలను బోలిన చర్మవాద్యము. 'తబల దమామి... ధ్వానంబు...' (వరాహ. 3-52) < మరాఠీ తబలా; అరబ్బీ. పారసి. తబ్లా, తబ్ల = చిన్నమద్దెల; తబ్ల్ = మద్దెల వాయించు; చిన్న మద్దెల; తబ్ల్‌జన్, తబ్ల్‌బాజ్ = మద్దెలకాఁడు.

*48. తరుణాసీరి* : బర్మాదేశము దక్షిణ భాగమున, తన్నాసరి రాష్ట్రమున, తన్నాసరి నది యొద్దునఁగల ఒక రేవుపట్టణము 'తరుణాసీరి తవాయి గోవరమణాస్థానంబు లన్...' (హర. పీఠిక, 28) 'తరుణా చీని'యను వేటూరివారి పాఠము ముద్రా రాక్షసము కాఁబోలు ; 'తర్నాసరి మలయ ద్వీపకల్పమున నొక రాష్ట్రప్రధాననగరము' అని వేటూరివారి నిర్ణయము. మలయా భాషలో 'తనాసరి'యని వాడుక. 'తనాహ్-సరి'యనఁగా 'ఆనందసీమ'అని యర్థము. బర్మీలో 'త-నెన్-థా-రి', 'తనంగ్-సరి' యని వ్యవహారము. అబ్దుర్‌రజాక్, నికో లాదీకోంతి, బార్బోజా - మొదలగు విదేశ పర్యటకుల వ్రాఁతలలో 'తన్నాస్సరి,' 'తర్నస్సరి,' 'తెనాస్సరిమ్', 'దహ్ననసరి' యను రూపములు ఉదాహృతములు (Hobson-Jobson, p. 914)

*49. తవాయి* : బర్మాదేశము దక్షిణ భాగము నందలి తన్నాసరి రాష్ట్రమున తవాయి నది తూర్పు ఒడ్డునఁ గల ఒక రేవుపట్టణము ; తవాయి జిల్లాకు ముఖ్య పట్టణము. 'చీని సింహళ తవాయి హురు ముంజి చోళంగి ప్రభృతి నానా ద్వీపనగరాక రంబులగు...' (హర. పీఠిక, 7), తరుణా సీరి తవాయి గోవరమణాస్థానంబులన్...' (వైది. 28). మలయా ద్వీపకల్పమునఁగల రేవుపట్టణమని వేటూరివారు - బర్మీభాషలో నిది 'ధ-వే','ధ-వాయ్'అని వ్యవహృతము- బర్మీ పండితులు దీనికి పలురకముల వ్యుత్పత్తి చెప్పిరి. 'ధ-వాయ్'అనఁగా ఖడ్గములను కొనెడిచోటు' ; హ్త - వాయ్' = బుద్ధునకుఁ సంబంధించిన', మలయాభాషలో 'తవాయ్' మూలరూపమున 'సయామీ' భాషలో నిదఁట ; (Hobson - Jobson, p 904) నేఁటి 'తవాయి' పట్టణము జనాభా 36 వేలకు పైబడి

*50. తాయెతు* : దండనో మెడనో మొలనో కట్టుకొను రక్షా భూష. 'మేనికి రక్షయై మించు తాయెతులు' (పల్నాటి. పు. 17). 'చెలువొందు చుండెడు చేతుల రెంట-రత్నాలు చెక్కిన రమ్యాంగదములు- దండకడియములు దంటతాయెతులు-మక్కువతోఁ గట్టి - (వైది. పు. 72). 'వక్షః స్థలంబున రక్షపూసలపేరు దండతాయెతు లును దగధరించి' (ద్వా. 7-45) < మరాఠీ. తావీజ = రక్షాభూష ; పారసి. త'వీజ్ = తాయెతు. రక్షాబంధము ; అరబ్బీ. త. అవీజ్ = శరణుకోరుట; రక్షణార్థము సర్వే శ్వరుని ప్రార్థించుట; తాయెత్తు. ద్వ. వి. (తాయి + ఎత్తు) తల్లి బిడ్డలకుఁగట్టు రక్షా బంధము అని శ. ర. (చూ. పు. 468); 'నెలవంక తాయెతులు, లక్క తాయెతులు' అని అర్వాచీన ప్రయోగములు. 'తాయెతు' పూర్తి చరిత్రకు చూ. వికృతి వివేకకర్తృ త్వము. 'భారతి', జూన్. 1959.

*తాసు* : చూ. త్రాసు. '...వాలుచును తాసువలెనున్న దిదే - తాలిమిధర్మా ధర్మ ములు' (తాళ్ళపాక. అధ్యాత్మ. సంకీర్తన, 105).

*తురక* : చూ. తుర్క 'ఓపితురకల గెలిచి ప్రతాపరుద్ర - మనుజ నాయకు కోట నేమరక కాచె' (శివయోగ సారము, పీఠిక).

*తురికి* : తుర్కీ దేశమునుండి కొని తెచ్చిన మేలిజాతి గుఱ్ఱము - 'దినమణి తేజీలకంటె నొప్పు తురికి గములుగలిగి' (భాస్క. ర. యుద్ధ. 2280). గుఱ్ఱపు నడకలలో నొకటి. 'తురికి నడయు' (ద్వా. 8-71). తురంగ శబ్దభవమని వైకృత దీపిక, పు. 59; పురుషోత్తమ కవీయము, పు. 66; చూ. తుర్క.

(సశేషం)

---

'...కప్పురపు తోడు గంటిమి శంటిమనుచు
...పొగడె నతి ఎంటిమీది యొప్పులనఖంబు' (ప్ర. నై. అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29672,36 వ ఆకు, మొదటి వైపు, 7,8 పంక్తులు);
'మహితలావణ్య వాదిన్‌లో మదనుఁడెక్కి
కప్పురపు తోగు కలకంఠి కంటిమనుచు...'అని భువనగిరివారి ముద్రిత ప్రతి. 1880, పు, 40;
సుడిపడ్డ మూర్యాల తోంగువోలె' (కాశీ ఖండము, ఆం. వి. గ్రం. లోని టొబ్బలి తాళపత్రప్రతి, 24వ ఆకు, మొదటివైపు, 3వ పంక్తి).



## ఆదిలాబాదు జిల్లా

*క్షుద్బాధానివారణ వారోత్సవం*

ఆదిలాబాదు కలెక్టరు కార్యాలయంలో మార్చి 17 వ తేదీన క్షుద్బాధనివారణ వారోత్సవానికి ప్రారంభోత్సవం జరిగింది. ఈ సందర్భంలో "సత్యమే జయం" అనే డాక్యుమెంటరీ చిత్రం ప్రదర్శించబడింది

## అనంతపురం జిల్లా

*కళాకారులకు ఋణాలు*

పరిశ్రమలకు రాష్ట్రఆర్థిక సహాయ పథకం క్రింద గుత్తి పంచాయతీ సమితిలో మార్చినెలలో వడ్రంగి కమ్మరి వృత్తులు నిర్వహించుచున్న గ్రామీణ కళాకారులకు ఎనిమిదిమందికి రు 600/- ల మేరకు అప్పులు ఇవ్వడం జరిగింది ఈ నెలలో మూడు ఎలిమెంటరీ స్కూళ్ళు ఆరంభించబడ్డాయి.

## చిత్తూరు జిల్లా

*ఉత్తమ పంచాయతీ*

1962-63 సం॥ నికి సి. టి. యం. పంచాయతీ ఉత్తమ పంచాయతి సమితిగా ఎన్నుకోబడింది

## గుంటూరు జిల్లా

*జాతీయ రక్షణనిధికి విరాళాలు*

1963 మార్చి నెలలో రాజుపాలెం పంచాయతీ సమితిలో జాతీయరక్షణ నిధికి రూ 10,200/- లు విరాళాలుగా సేకరించబడ్డాయి.

*గ్రామ సహాయక శిక్షణశిబిరం*

తురుమెళ్ళలో మార్చి 5 వ తేదీనుంచి రెండు రోజులవరకు గ్రామ సహాయక శిక్షణ శిబిరం నిర్వహించబడింది. ఈ నెలలో పేటూరివారి పాలెంలో కుటుంబనియంత్రణ విషయమై 3 రోజులవరకు ఓరియంటేషన్ శిక్షణశిబిరం నిర్వహించబడింది.

*ఉత్తమ పంచాయతీ*

సంతమాగులూరు పంచాయతీ సమితికి చెందిన గుంటుపల్లి పంచాయతీ ఉత్తమమైన పంచాయతీగా ఎన్నుకోబడింది.

*అదనపు భూమి సాగుపథకం క్రింద ఋణాలు*

వ్యవసాయ ఉత్పత్తులను అధికం చేయడానికి, అర్హతగల రైతులకు 22 సబ్సిడీ బావులు ఇవ్వబడ్డాయి. అప్పు రూపంలో ఒక ఆయిల్ ఇంజనుకూడా ఇవ్వబడించి. అంతేగాక అదనపుభూమి సాగుపథకం క్రింద రూ 5,950/- లు అప్పుగా పంచిపెట్టబడ్డాయి.

*కళాకారులకు ఋణాలు*

మేలిరకం యంత్ర పరికరాలు, ముడి పదార్థాలు కొనుగోలుచేసి తమ తమ పరిశ్రమలను అభివృద్ధి చేసుకోవడానికి వీలుగా అర్హతగల కళాకారులకు రూ 800/- లు అప్పు రూపంలో పంచిపెట్టబడ్డాయి.

## కృష్ణా జిల్లా

*గోష్ఠి - శిక్షణ తరగతి*

మార్చి 21 వ తేదీన మచిలీపట్నంలోవి జిల్లా పరిషత్తు కార్యాలయంలోని రేడియో గ్రామీణ గోష్ఠి కార్యాలయపు ఆవరణలో కృష్ణా జిల్లాలోని బ్లాకు డెవలప్మెంటు ఆఫీసర్లు, సోషల్ ఎడ్యూకేషన్ ఆర్గనైజర్లు, ముఖ్యసేవికలకు అందరికీ గోష్ఠి – శిక్షణ తరగతి నిర్వహించబడింది.. రాష్ట్రంలో ఇలాంటిది జరగడం ఇదే తొలిసారి. కృష్ణా జిల్లా పరిషత్తు అధ్యక్షులు దీనికి ప్రారంభోత్సవం జరిపారు.

*రోడ్డు నిర్మాణం*

యువకమండలి సభ్యులు 1963 మార్చి నెలలో ఇందుగుపల్లిలో శ్రమదానంచేసి 100 గజాల రోడ్డును నిర్మించారు.

## కర్నూలు జిల్లా

*సహాయక సంగీత కార్యక్రమం*

రక్షణ పొదుపు పథకం సహాయార్థం మార్చి 20 వ తేదీన ఆదోనిలోవి ఆర్ట్సు, సైన్సు కాలేజీలో సంగీత కార్యక్రమం ఏర్పాటు చేయబడింది.

*చిన్న మొత్తముల పొదుపు పథకం*

రాష్ట్ర అభివృద్ధి ఋణాలకూ, చిన్న మొత్తముల పొదుపు పథకానికీ ఆదోని రెవిన్యూ డివిజన్ ఉదారంగా డబ్బును విరాళంగా ఇస్తున్నది. ఈసారి రక్షణ పొదుపు పథకానికి రూ 3½ లక్షలు ఇచ్చింది. అంతేగాక జాతీయరక్షణ నిధికి రూ 7 లక్షలు విరాళంగా ఇచ్చింది.

# ప్రగతి పథంలో

## మహబూబు నగరం జిల్లా

*ఆరోగ్య కేంద్రానికి గవర్నరు రాక*

ఆంధ్రప్రదేశ్ గవర్నరు, జిల్లా కలెక్టరుతోపాటు మార్చి 26 వ తేదీన పాలెం గ్రామాన్ని సందర్శించి అక్కడవున్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని పరిశీలించారు.

*ఆదిమవాసుల మహాసభ*

ఆంధ్రప్రదేశ్ ఆదిమజాతుల సేవక సంఘం అధ్వర్యాన మార్చి 25 వ తేదీన మున్ననూరులో జరిగిన ప్రాంతీయ ఆదిమవాసుల మహాసభకు గవర్నరు ప్రారంభోత్సం చేశారు.

## నల్గొండ జిల్లా

*కొత్త టి.బి వార్డు*

నల్గొండలో మార్చి 30 వ తేదీన జరిగిన బహిరంగ సభలో ఆర్థికమంత్రికి జాతీయ రక్షణనిధికై సేకరించిన రూ 51,232/- లు మొత్తం సమర్పించ బడింది. రు 40000/-ల ఖర్చుతో నిర్మించబడుతున్న 20 మంచములు గల క్షయ ఆసుపత్రికి ఆర్థికమంత్రి శంకుస్థాపన చేశారు.

*కుటుంబ నియంత్రణ*

కుటుంబ నియంత్రణలో శిక్షణ ఇవ్వడానికి చేటుప్పలలో మూడు రోజుల వరకు శిక్షణ శిబిరం నిర్వహించబడింది. ఇందులో, పంచాయతీరాజ్ సంస్థలు, మహిళా మండలుల సభ్యులు, స్కూలు టీచర్లు మున్నగువారు మొత్తం 50 మంది స్త్రీ పురుషులు శిక్షణ పొందారు.

*యువజన క్లబ్*

కోదాడు పంచాయతీ సమితిలోని గుడిబండ గ్రామంలో 1963 మార్చి నెలలో యువజన క్లబ్‌కు జిల్లా పరిషత్తు అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు. ఈ క్లబ్‌లో 60 మంది సభ్యులుగా చేరారు.

## నెల్లూరు జిల్లా

*కుటుంబ నియంత్రణపై ప్రదర్శన*

చింతవరంలో మార్చి 19 వ తేదీనుంచి 3 రోజులవరకు కుటుంబ నియంత్రణ గోష్ఠి, ఓరియంటేషన్ శిక్షణ శిబిరం నిర్వహించబడ్డాయి. ఈ సందర్భంలో కుటుంబ నియంత్రణ ప్రదర్శనకూడా ఒకటి ఏర్పాటు చేయబడింది దీనికి చింతవరం పంచాయతీ అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

*గ్రామస్థుల స్వయం సహాయం*

సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద 50 శాతం స్వచ్ఛంద సేవాపద్ధతిపైన కంచర్లవారిపల్లి గ్రామస్తులు నిర్మించిన రోడ్డుకు మార్చి 5వ తేదీన కలెక్టరు ప్రారంభోత్సతం జరిపారు.

*ఆనకట్ట నిర్మాణం*

శ్రమదానంతో నెల్లివాగుకు అడ్డంగా ఆనకట్టను నిర్మించడానికి గ్రామస్తులు పూనుకొన్నారు. కలెక్టరు దీనికి శంకుస్థాపన చేశారు కూడా. ఈ ఆనకట్ట నిర్మాణానికి రూ 10,000/-లు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది.

## నిజామాబాదు జిల్లా

*బాన్సువాడ పంచాయతీ సమితి*

నిజామాబాదు జిల్లాలో బాన్సువాడ పంచాయతీ సమితికి చెందిన దాందూరు పంచాయతి 1962-63 సం॥ నికి ద్వితీయ పంచాయతీగా ఎన్నుకో బడింది.

*శిక్షణ శిబిరం*

కలెక్టరు పిట్లం గ్రామంలో కుటుంబ నియంత్రణ శిక్షణ శిబిరానికి మార్చి 22 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

*జాతీయ రక్షణనిధికి ఇతోధిక విరాళాలు*

జాతీయ రక్షణనిధికై సేకరించబడిన రూ. 34,160/-ల మొత్తాన్ని బాన్సువాడ పంచాయతీ సమితి అధ్యక్షులు మార్చి 24 వ తేదీన జరిగిన ఒక బహిరంగ సభలో వ్యవసాయ మంత్రికి సమర్పించారు

## శ్రీకాకుళం జిల్లా

*సాంగ్ అండ్ డ్రామా సెమినార్*

ప్రభుత్వ పాలీటెక్నిక్ సంస్థ ఆవరణలో మార్చి 26, 27 తేదీలలో జిల్లాస్థాయిలో శ్రీకాకుళం జిల్లా 5వ సాంగ్ అండ్ డ్రామాసెమినార్ జరిగింది. దీనికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు. ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల విద్యార్థినులు వేసిన "వీరమాంగల్యం" అను నాటకం ఉత్తమమైనదిగా ఎన్నుకోబడింది.

*గ్రామీణ స్వచ్ఛంద దళం*

జిల్లాస్థాయిలో గ్రామీణ స్వచ్ఛంద దళానికి సంబంధించిన ఓరియంటేషన్ శిక్షణ కార్యాక్రమానికి కలెక్టరు మార్చి 20 వ తేదీన శ్రీకాకుళంలో ప్రారంభోత్సవం చేశారు. కలెక్టరు తమప్రారంభోపన్యాసంలో ప్రసంగిస్తూ గ్రామీణ స్వచ్ఛంద దళంలో 68,000 మందీ, రక్షణశ్రామిక బ్యాంకులలో 48,000 మందీ చేరినారని వెల్లడించారు.

## విశాఖపట్టణం జిల్లా

*యువజన సంస్థలు*

1963 మార్చితో అంతమైన త్రైమాసిక కాలంలో రోలుగుంట పంచాయతీ సమితిలో 45 మంది సభ్యులతో మరో మూడు యువజన సంస్థలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇప్పుడు యువజన సంస్థలు మొత్తం 50 పనిచేస్తున్నాయి. ఇందులో చేరిన సభ్యులు జాతీయరక్షణ ప్రచారం, మద్యనిషేధ కార్యక్రమాల్లో పాల్గొని తీవ్రంగా కృషిచేశారు.

# జవాన్ స్వగతం

పాతూరి ప్రసన్నం

నన్నే నా పిలుస్తున్నది,
సన్నద్ధం కమ్మంటున్నది ?
ఎన్నాళ్లకు నీ కమ్మని గొంతున
విన్నానమ్మా రమ్మను పిలుపును !

దేశం కోసం నీ సందేశం
ధీరతతో నెరవేరుస్తా
ఇంకా ఈ యిల్లూ వాకిలి
సంకెళ్లను వదిలేస్తా !

హిమాలయాల్లో ఘనీభవించిన
మహాతపస్వుల మంత్రశక్తులే
నా ధ్యేయానికి ఎంతో సాయం,
నా ప్రాణానికి ప్రాణం - ఖాయం !

స్వాతంత్ర్య జ్యోతిని నిలుపగ
రక్తాన్నే ధారగపోస్తా,
రాబోయే తరాలవారికి
సర్వస్వం త్యాగం చేస్తా !

గజగజమని వణికించే
మంచు తెరలు కావమ్మా అవి,
కళకళలాడే నీ దుకూ -
లాంచల రోచిస్సులు సుమ్మా !

జన్మభూమీ - ఓ నా జననీ !
సౌభాగ్య, స్వర్గ సంధాయినీ !
జయహో శాంతిప్రదాయినీ !
జయహో క్రాంత దర్శినీ !



వారు కొమరవోలు, కె. నాయుడు పాలెంలలో గ్రామసహాయక శిబిరాలు ఏర్పాటు చేయడంలో కూడా బ్లాకు సిబ్బందికి తోడ్పడ్డారు.

### వరంగల్ జిల్లా

*ప్రపంచ ఆరోగ్య దినం*

హనుమకొండ టౌన్ హాలులో ఏప్రిల్ 7 వ తేదీన కలెక్టరు అధ్యక్షతలో ప్రపంచ ఆరోగ్య దినోత్సవం జరుపబడింది. ఈ సందర్భంలో ఒక చలనచిత్రంకూడా ప్రదర్శించబడింది.

*భారత సేవక సమాజ్*

ఘనపురం తాలూకాలో మార్చి 28 వ తేదీన నల్గొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాలతో కూడిన భారత సేవక సమాజ్ శిక్షణశిబిరం ఆరంభించ బడింది.

*గ్రామ నాయకులు*

పర్కాల బ్లాకులోని కొత్తపల్లి సర్కిల్‌కు చెందిన చిన్న కొడిపాక గ్రామంలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరం ఏర్పాటు చేయ బడింది. సుమారు 50 మందికి వివిధ అభివృద్ధి పనులలో శిక్షణ ఇవ్వబడింది.

*శ్రమదానానికి ప్రోత్సాహం*

ఈ నెలలో రక్షణశ్రామిక బ్యాంకుల అధ్వర్యాన 10 పంచాయతీలలో వివిధ పనులను చేపట్టడం ద్వారా శ్రమదానోద్యమాన్ని తీవ్రతరం చేయడానికి కృషి చేయ బడింది.

### పశ్చిమగోదావరి జిల్లా

*ఆయిల్ ఇంజనుల కొనుగోలు*

నల్లజెర్ల సమితి మార్చి 25 వ తేదీన నల్లజెర్లలో సమావేశమై 12 ఆయిల్ ఇంజనులు, ఒక ఎలెక్ట్రిక్ మోటారు కొనడానికి రూ. 38,000/-లను మంజూరు చేసింది.

నల్లజెర్ల సమితి అధ్వర్యాన వెంకట్రామన్న గూడెంలో మార్చి 24 వ తేదీనుంచి రెండు రోజులవరకు కుటుంబ నియంత్రణ శిక్షణ శిబిరం నిర్వహించబడింది.



# హిమవంతా !

—అమరవాది వెంకటశాస్త్రి

హిమవంతా ! భవదీయ ధామమున వ
హ్ని జ్వాల లా శాంత నా
శముగా రేగుచు నుండ, నీ విటు లుపే
క్షా భావముంబూని, తా
లిమితో నుండుట కేమి కారణము ? యి
ట్లే కాలిపో నుండ గా
లముకై జాలము సేయఁగాఁ దగునె చ
ల్లార్పంగ యత్నింపుమా !

హిమశైలంబున నగ్ని పుట్టె నని ము
న్నే నాడు విన్నామె ? ద
ర్పముతో రాక్షసు లాక్రమించు కొని దూ
రం జూచు చున్నార లీ
సమయం బందున నిద్రంబోయెదవు, వి
శ్వ క్షేమ సంధాన భా
రము నీపైఁబడె, లేపు మల్లుని జగ
ద్రక్షా సుదీక్షా పరున్ ॥

నీవునగాధి నేతవు వనే చర "చైనుల" దుర్మదాంధులం
జావఁగ మోదవేమి, బలశాలివి;- నీదగు కందరాలలో
నావహాదుందుభిధ్వనులహర్నిశలున్ దిశలెల్ల బ్రద్దలై
పోవఁగ మ్రోగియీభరత భూమికి ముప్పుఘటింపనోర్తువే॥

చైనావారి శతఘ్నిగోళములు
ఈశాన్యంబు నన్ బ్రేల, నీ
సాను శ్రేణులు దద్దరిల్లెగద !
భస్మంబయ్యె దివ్యౌషధుల్
దీనిన్ జూడవిదేమి ? కొండవయి
మాదేశంబునిన్నాళ్లు ర
క్షానైపుణ్యతోడఁగాచితివి వజ్ర
ప్రాయకాయంబుతో ॥

శరణుఁజొచ్చిన నీచు సజ్జనునివోలె
చేరదీయు మహాత్ముండవౌర ! నిన్ను
శరణువేడక దుడ్డు తాఁజంకఁదాల్చి
వచ్చు దుర్మార్గులను ద్రోసిపుచ్చుమయ్య ॥

చైనావారిని గెంటివేయుటకు
హస్తన్యస్తశస్త్రాస్త్రులై
సానుశ్రేణులవేల మైళ్ళపొడవున్
సంచారముంజేయు మా
సేనా వాహిని కండగానిలుపు
మోశైలాధిరాజా ! మహా
సేనా నాయకుండౌ షడాననుజగ
క్షేమ క్రియాకాంక్షతో.

# ముందడుగు

వాసిరాజు ప్రకాశం

తమ్ముళ్ళూ? చెల్లాయిలూ!

మన దేశంలో వెనుకబడిన ప్రాంతాలు కొన్ని వున్నాయి. "ప్రాంతాలేమైనా, ఎక్కడకయినా పరుగెడతాయా? వెనుకబడటానికి - ముందు బడటానికి?" అని సందేహిస్తారేమో మరి. అట్లా సందేహించకండి. మనలో అనేకమంది పల్లెటూళ్ళనుంచి బస్తీలకు, బస్తీలనుంచి పల్లెటూళ్ళకు దసరా, సంక్రాంతి సెలవుల్లోను, వేసవి శలవుల్లోను తిరుగుతూనే వుంటారు. పల్లెటూళ్ళనుంచి బస్తీలకు చేరేసరికి, మనకు కనుపించే మంచి మంచి తారురోడ్లు, సిమెంటు రోడ్లు, మందరాలై, మహోన్నతాలై అనేక పద్ధతుల్లో కట్టబడిన డాబాలు, మేడలు, చక్కని పార్కులు మన కళ్ళకు కనుపించి మనల్ని ఆశ్చర్య సంభ్రమాల్లో ముంచి వేస్తూ వుంటాయి. అక్కడవున్న యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, బాల బాలికలు అనేక విధాలైన ఆకర్షణీయమైన 'ఫ్యాషన్ల'తో వున్న రకరకాల రంగుల దుస్తులతో కనుపించి, కనుల పండుగ చేస్తారు. అబ్బ! ఎంతెంత మంచిమంచి బట్టలు వేసికొన్నారు? ఇలాంటివి మన వూళ్ళలో వుండవేం? అమ్మా, నాన్నా మనకు కొనిపెట్టరేం? అని ఆలోచనలు రేకెత్తేటంతగా మురిపింప చేస్తాయి. విసురుగావచ్చి, యీ పక్కనుంచి ఆపక్కకు ఒకదాని వెనుకగా ఒకటి దూసుకపోతూవుండే బస్సులు, చిన్నకార్లు, లారీలు, జట్కాబండ్లు, రిక్షాలు అనేకం కనుపిస్తాయి. మనల్ని వూపిరి తిరగకుండాచేసి బుర్రంతా ఖాళీ అయిపోయిందా అన్నట్లుగా, ఆలోచనలకే అవకాశం లేకుండా చేస్తుంది - ఎవరి కార్యక్రమాల్లో వారు నిమగ్నమయి వుండే జనసందోహం. ఆయాపట్టణాల్లో రైల్వే స్టేషనుకూడా వుందో - వచ్చే, పోయే రైళ్ళతో, ఎక్కే దిగే జనంతో - పెట్టెలను విడిచిపెట్టటం, తగిలించుకొనటం మొదలైన పనులతో ముందుకూ, వెనుకకూ నడుస్తూ వుండే గూడ్సు బళ్ళతోను, ఇంజన్లతోను, రకరకాల కూతలతో, ప్రజల అర్ధంకావి రణగొణ ధ్వనితో వూరుకువూరే హోరుమంటూ వుంటుంది. బజార్లలో ఎన్నో రకాల కిరాణా దుకాణాల దగ్గరనుంచి పెద్ద పెద్ద బట్టల షాపులు, సైకిల్ షాపులు, ఇతర ఫ్యాన్సీ షాపులు, నోరూరించే రకరకాల తినుబండారాలతో వున్న హోటళ్ళు, మిఠాయి దుకాణాలు కనుపించి మనల్ని, ఉక్కిరి, బిక్కిరి చేస్తాయి. ఇటువంటి పెద్ద పెద్ద పట్టణాలు, ఇదే పద్ధతిలో కొంతకు కొంతయినా అభివృద్ధి చెందివున్న చిన్న చిన్న పట్టణాలు వున్న ప్రాంతాలను బాగా అభివృద్ధిచెందిన ప్రాంతాలుగా - అంటే చాలా ముందుకు వచ్చిన ప్రాంతాలుగా - చెప్పటం జరుగుతుంది.





## బాలానందం

నిత్యమూ బస్తీ జీవితానికి అలవాటుపడిన మనలో కొందరం సరదాగా పల్లె ప్రాంతాలకు పోయి పొలాల్లో, పంటచేలల్లో, తోటల్లో, పశుసంపదలో. పల్లెకాపర్లతో సహజ ప్రకృతి సంపదలో లీనమయి

పోతుంటాం. చక్కని, చల్లని, పిల్లవాయువు లను అనుభవించుదామని సెలవుల్లో పల్లెటూళ్ళ వైపు పోవటం మనకు అనుభవంలో వున్న విషయమే. అక్కడవున్న పచ్చని పంటపొలాలను, నిర్మలంగా నిలకడగా అక్కడక్కడ ప్రవహిస్తూవుండే సెలయేళ్ళను, చిన్నచిన్న పంట కాలువలను, చెరువులను చూస్తే మన కళ్ళు మిలమిల లాడుతాయి. పచ్చని చెట్లను, మొక్కలను, పొదలను, ఆ పంటపొలాలను చూస్తే అందని ఆలోచనలు మెరుస్తాయి. తెలియని ఆనందంతో మన మొహం కళకళలాడుతుంది. ఊరి వెలుపల పచ్చిక బయళ్ళల్లో గొడ్ల కాపర్లతో బిల్లంగోట్లు ఆడుతాం. గేదెల గుంపుల్లో ఆలమందల్లో, దూడల్లో అలనాటి గొల్లవారు, గోపాలకృష్ణుడు గుర్తుకు వచ్చేటట్లుగా సంచరిస్తాం. మరోవంక, పాతబడిపోయిన పూరిపాకలు, నగిషి పనులు ఏవిధమైన రంగులూ లేకుండా పాడుపడినట్లున్న నాసిరకం ఇళ్లు, కనుపిస్తే "ఇవేం ఇళ్లు. ఈ కొంపల్లో ఎలా వుండగలం?" అనిపిస్తుంది. మురికి వర్షాలు కురిసిన రోజుల్లో నయితే మోకాలిదాకానో, చీలమండ దాకానో దిగిపోయే బురదలో— ఏ అయిదు నిమిషాలకో రెండో మూడో అడుగులు వేస్తూ యమయాతన పడుతూ ఉంటే—'అబ్బ. ఈ వూరునుంచి ఎప్పుడెప్పుడు పోదామా' అనిపిస్తుంది. అవే కంకర రోడ్లయితే, వర్షపు జల్లులకు ఇసుక కొట్టుకపోగా, బైటపడిన చిన్నచిన్న, పెద్దపెద్ద కంకరరాళ్లు, గిలకరాళ్లు గుచ్చుకొని బాధపడుతాం. అదే మట్టిరోడ్లయి వేసవి కాలమయితే సన్నగా సూదిముక్కులు తేరిన కంకర్రాళ్ల కంటికటువుగా శనగలవలె గుచ్చుకొనే మట్టిగడ్డలతో నడవలేక 'ఎప్పుడు ఇంటికి పోదామా' అనిపిస్తుంది. అక్కడ పెద్దవాళ్లు కట్టుకొనే సిరుకావి బట్టలు, పిల్లలు కట్టుకొనే ఏ విధమైన 'ఫ్యాషన్లు' లేని మామూలు వుతికిన బట్టలు చూస్తే— రోజూ 'ఉష్, ఉష్' మంటూ వూదితే మాసిపోయేటట్లుగా వుండే ఇస్త్రీబట్టలు కట్టుకొనే మనకు 'యీ బట్టలు ఏమిటా' అనిపిస్తుంది. మంచి మంచి బంగళాలలో కుర్చీలు, డ్రాయర్లు, బెంచీలు, డస్కులతో నిండి వున్న మన స్కూళ్ళముందు తాటి, ఈత ఆకుల చాపలతో, గోనెసంచులతో పూరిపాకల్లోవున్న యీ 'స్కూళ్లు' "ఏమిటా ఇలా వున్నాయి?" అనిపిస్తుంది.—'ఇంకా బస్సు రాలేదేమబ్బా!' అని వుస్సురుమని ఎదురు చూచే ప్రయాణీకులతో అరగంటకో, గంటకో, రెండు గంటలకో వచ్చే బస్సులతో వూళ్ళోవున్న ఆ ఒక్క రోడ్డును చూస్తే, మన పట్టణంలో ఇది ఏ సందుతో పోటీ పడుతుంది? అనిపిస్తుంది. ఇక, ఏదికావాలంటే అది కొనుక్కోటానికి అవకాశాలు కొద్దిగా వుంటాయి. ఇటువంటి వూళ్ళన్నీ మధ్యరకంగా అభివృద్ధి చెందినవని చెప్పవచ్చు. అంటే ఇవి కొంత వెనుకబడి, కొంత ముందడుగు వేసిన ప్రాంతాలన్న మాట. ఈ మధ్యరకం ప్రాంతం కంటె ఏ మాత్రమూ అభివృద్ధి చెందకుండా ఉన్న ప్రాంతాలు మన దేశంలో మరికొన్ని వున్నాయి. వీటిలో ఏజన్సీ ప్రాంతాలు మరీ ముఖ్యమైనవి.

# ఆట విడుపు పద్యాలు

*వేజెండ్ల సాంబశివరావు*

**ఆట —**

గంగిగోవు పాలు। కడుపారగా త్రాగ
పుష్టి గల్గు దేహ। పుష్టి గల్గు
పాలుగానిపాలు। బ్రతుకునే చెరచును
దీని భావమేమి। తెలుగు బాల! 1

పాటు మంచిదనుచు।
పలుకు చుండునె వాడు
అతడె కష్ట జీవి। అవని లోన
పాటుగానియట్టి।పాటుగోరు ఖలుండు
దీని భావమేమి। తెలుగు బాల! 2

కారులో షికారు।కలవారలకు మోజు
కారుతోనె బ్రతుకు। గడుపు శిల్పి
కారుగాని కారు। కలిగించు అలజడి
దీన భావమేమి। తెలుగు బాల! 3

రాయిలోనె శిల్పి। రమణీయశిల్పాలు
మలచి జగతిలోన। వెలుగుచుండు
రాయిగానిరాయిని।రాజుశిరము నెక్కు
దీని భావమేమి। తెలుగు బాల! 4

రాజు ఏలు నట్టి। రాజరికమె పోయె
ప్రభుత ఏలు వారు। ప్రజలె నేడు
రాజుగాని రాజు। రారాజుయందురు
దీని భావమేమి। తెలుగు బాల! 5

చుక్కలెన్నొ ఆడు।చక్కగామింటిపై
చందమామ తోడ। సరస గతిని
చుక్కగానిచుక్క। చక్కని రుచిపెంచు
దీని భావమేమి। తెలుగు బాల! 6

మాలయంచు తోటి। మానవాళిని నీవు
చీదరించు కొనుట। సిగ్గు గాదె
మాలగాని మాల। మాలరా కంఠాన
దీని భావమేమి। తెలుగు బాల! 7

పురము వెల్గు పుణ్య। పురుషుల చేతను
శాంతి జీవమందు। సాగి నడుచు
పురము గాని పురము।
పొలు పొందు వెల్గుచే
దీని భావమేమి। తెలుగు బాల! 8

(విడుపు 77 పేజీలో)

ఈ ఏజన్సీ ప్రాంతాలలో నివసించే మనుష్యుల వేషభాషలు, ఆచారాలు, పద్ధతులు మన వాటికంటె భిన్నంగా వుంటాయి. వారు మనం వూహించలేనంతగా వెనుకబడి వున్నారు. వారికి బట్టలు కట్టుకోవటం, పరిశుభ్రంగా వుండటం లోగడ — అంటే స్వాతంత్ర్యానికి పూర్వం — తెలియదు. మొన్న మొన్నటివరకు ఆకులనే వస్త్రాలుగా చేసికొని ధరించే వారు. మన ప్రభుత్వం వీరి అభివృద్ధి విషయమై శ్రద్ధతీసికొంటున్నప్పటి నుంచీ, బట్టలుకట్టుకొనటం మొదలైనవి నేర్చుకొన్నారు. భోజన విధానాల్లో కూడా వారు చాలా వెనుకబడి వున్నారు. అనాది కాలంనుంచి వస్తున్న ఆచారాలనే పాటిస్తున్నారు. వారు నివసించే ప్రాంతాలుకూడా వారికి తగ్గట్టుగానే వున్నాయి. వారికి ఆధునిక సౌకర్యాలు ఏమీ వుండవు. ఏ పాత పూరిళ్ళలోనో వుంటూ వుంటారు. మనం కట్టుకొంటున్నట్లు పెద్దపెద్ద దాబాలు, మేడలు కట్టుకోవటం వారికి తెలియనే తెలియవు. వారికి మంచి నీరు త్రాగటానికి కొళాయిలు వుండవు. అసలు బావులు కూడా లేని వెనుకబడిన ప్రాంతాలు చాలా వున్నాయి. ఎక్కడో దూరంగా వుండే నీటి మడుగునుంచి మంచి నీళ్ళో, ఉప్పు నీళ్ళో — కాసిని తెచ్చుకొని, ఆ వేళకు కాసిని తాగి దాహం తీర్చుకొంటూ వుంటారు. వారు నివసించే ప్రాంతాలన్నీ ఎంతో ముకిరి మురికిగా వుంటాయి. రోడ్లుగాని, రహదార్లుగాని వుండవు. ఆ మురికి వల్లనే జ్వరాలు, జబ్బులు కూడా వస్తూ వుంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే వారు అన్ని విధాలా వెనుకబడి వుంటారన్నమాట.

ఇటువంటి ప్రాంతాలనే అనేక విధాల అభివృద్ధి చేసి, వారెందరినీ మామూలు మనుషుల్లాగా తయారు చేసేందుకు మన ప్రభుత్వం ప్రణాళికలన్ను తయారుచేసి, ఒక దాని తరువాత ఒకటి వంతున అమలు జరుపుతున్నది. ఆ ప్రాంతాలలో వుండే బాల బాలికలకు పాఠశాలలను స్థాపించి, వారికూడా చదువుకొనే అవకాశం కల్పించి మన వూళ్ళల్లో వుండే పిల్లల్లాగానే తయారు చేయాలని మన ప్రభుత్వం నిశ్చయించింది.

ఇంతగా వెనుకబడిన ఏజన్సీ ప్రాంతాలు మన రాష్ట్రంలో మూడు జిల్లాల్లో ఉన్నాయి. అవి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, విశాఖపట్టణంజిల్లాలు. ఈ జిల్లాలపేర్లుమనలో దాదాపు అందరూ వినేవుంటారు. ఈ మూడు జిల్లాలలోనూవుండే అరణ్య ప్రాంతాలనే ఏజన్సీ ప్రాంతాలని వెనుకబడిన ప్రాంతాలని కూడా అంటుంటారు. ఈ వెనుకబడిన

---

విడువు :

| | |
|---|---|
| 1. కోపాలు | 5. తరాజు |
| 2. సాపాటు | 6. నే(త్రి)చుక్క |
| 3. పుకారు | 7. పూమాల |
| 4. తురాయి | 8. కపురము |

---

# నీతిలేని చౌ

నీ మోసం తెలిసెలే
నీతిలేని చౌ ఎన్ లే

ఛాయ్ ఛాయ్ అన్నావు
మాయ వలను పన్నావు
చేతి కందినంత కా
జేయాలను కున్నావు

ఇన్ని వేల వత్సరాలు
ఇరవు కొన్న మన స్నేహం
దొంగ పోటు పొడిచి కడకు
గంగ పాలు చేసినావు

మే మంతా ఒక్కటి యౌ
తామను కొని యుండవు మరి
సభ్య జాతులన్నీ మా
సరస నిలచునని ఎరగవు !

నా డెవడో నీవాళ్ళకు
నల్లమందు పెట్టెనంటె
నే డీ వే భంగు పెట్టి
నీచుడ ఉసిగొల్పినావు

నీకు చేసి నట్టు మేలు
నిజముగ బూడిదపాలు
పంచశీల సూత్రాలను
వంచించినదే చాలు

తిండికి కరవై మిడుతల
దండులాగ పెరిగియున్న
నీ మూకను మా బంగరు
నేలపైకి తోలినావు.

చల్లగ మెల్లగ మే మిం
ఢెల్లిపాది సుఖపడడం
ఓర్వలేక నిప్పు లోసు
కున్నావా కళ్లల్లో ?

కుత్సితుడా లోకం ఒక
కోడై కూస్తున్నా వెర
పింత లేక చింతలేక
ఎంత దాక నీ చర్యలు.

నీ పాపం తప్పకుండ
నిన్ను కట్టి కుడుపును లే
నీ కోపం తప్ప కుండ
నిన్ను మట్టి గలపును లే.

—బి. వి. నరసింహారావు

ప్రాంతాలలో ప్రధానంగా కొండ జాతులవారు, ఇతర ప్రాచీన తెగలవారు వుంటారు. కొండ జాతులవారంటే మనలో చాలా మందికి తెలుసు. మన వూళ్ళకు అప్పుడప్పుడూ — మెడల్లో పెద్దపాములు తగిలించుకొనో యేపైనా అడవుల్లో దొరికేవస్తువులు అమ్ముకొంటూనో వచ్చేవారివి. కోయ వాళ్ళను కొండజాతులంటారు.

వెనుకబడిన ప్రాంతాలన్నింటిని పునరుద్ధరించాలని ప్రభుత్వం నిశ్చయించింది. ప్రాంతాలను పునరుద్ధరణ చేయటమంటే అక్కడి ప్రజలకు చక్కని అలవాట్లనునేర్పి, వారినికూడా మనం నిత్యమూ చూచే మానవుల్లాగ తయారు చేయటమే. వారందరిలో నాగరికత పెంపొందింపచేయటం కూడా వారివి అభివృద్ధిచేసే మార్గాలలో ఒకటి. అందుకు ప్రధానంగా వారిని విద్యావంతులుగా చేయాలి. పెద్దవాళ్ళను; ముసలివాళ్ళను రప్పించి విద్య నేర్పటంకంటె, బాలబాలికలను రప్పించి వారికే విద్య నేర్పటం చాలా సులభమూ, ఉపయోగకరమైనది. ఈ బాలబాలికలే రేపటిపౌరులై — ముందు తరాలవారికూ్కడా — అంటే వారి పిల్లలకు కూడా చక్కని నాగరికత అలవరత గలరన్నమాట. అందుకే, పిల్లలను అభివృద్ధి చేయటానికి ఏజన్సీ ప్రాంతాలలో మన ప్రభుత్వం కొన్ని పాఠశాలలను స్థాపించింది. అక్కడ చదువుకొనే కొండ జాతులవారి పిల్లలకు ప్రత్యేకంగా 'స్కాలర్ షిప్పు'లను ఇచ్చి, వారిని తగినంతగా అభివృద్ధిలోకి తీసుకరావడానికి, ప్రయత్నిస్తున్నది.

ఈ స్కాలర్ షిప్పులను సెకండరీ పాఠశాలల్లో చదివేవారికి, ఎలిమెంటరీ స్కూళ్ళలో చదివేవారికి వేర్వేరుగా ఇస్తున్నారు.

సెకండరీ స్కూళ్ళలో ఆరవ తరగతి నుంచి ఎనిమిదవ తరగతి వరకు చదివే బాలబాలికలకు నెలకు నాలుగు రూపాయల వంతున ఇస్తారు. ఒకమారు 'స్కాలర్ షిప్పు' మంజూరయిందంటే, ఆ సంవత్సరంలో స్కూలు పనిచేసే తొమ్మిదినెలలూ ఇస్తూనేవుంటారు. మొన్న మొన్నటివరకు తూర్పు గోదావరి జిల్లాలో వుండి యీ మధ్యనే ఖమ్మం జిల్లాలోచేరిన ఏజన్సీ ప్రాంతాలు కొన్నివున్నాయి. ఆ ప్రాంతాలలో వుండే సెకండరీ స్కూళ్ళలో చదివేవారికి మాత్రయే యీ స్కాలర్‌షిప్పును ప్రత్యేకించారు. దీనికితోడు యీ సదుపాయం కోసం దరఖాస్తుపెట్టుకొనే బాలబాలికలు కొండ జాతులకో, లేకమరో అణగారిపోయిన ప్రాచీనతెగకో చెందివుండాలి. ఇవే తెగలకు చెంది, ఈ పాఠశాలల్లోనే తొమ్మిది, పది, పదకొండు తరగతుల్లో చదివే బాలబాలికలకు నెలకు ఎనిమిది రూపాయలవంతున ఇస్తారు.

## జాతీయ సైనిక విద్యార్థి దళం

శరీర సౌష్టవం కలిగి, ఎన్. సి. సి. (జాతీయ సైనిక విద్యార్థి దళం) రైఫిల్సులో చేరటానికి తగివున్న కళాశాలల విద్యార్థులు, విశ్వవిద్యాలయాల విద్యార్థులు దానిలో ప్రవేశించటానికి అవకాశం కల్పిస్తూ ఆ ఎన్. సి. సి. రైఫిల్సు కేడెట్ల ( సైనిక విద్యార్థులు ) సంఖ్యను మరి నాలుగు లక్షలు పెంచాలని నిశ్చయించ బడింది. ఈ సంవత్సరంలో సైనిక విద్యార్థిదళంలోని కేడెట్ల సంఖ్య బాగా పెరిగింది.

1963 జనవరి 1 నాటికి సైనిక విద్యార్థిదళంలో సీనియర్ విభాగం, రైఫిల్సు, జూనియర్ విభాగం, సహాయ సైనిక విద్యార్థిదళం అన్నింటిలోను కలిపి మొత్తం 31,291 మంది ఉపాధ్యాయులు, 22,47,893 మంది కేడెట్లు వున్నారు. శిక్షణా శిబిరాలు, సంఘసేవా శిబిరాలు, నాయకత్వ లక్షణాలలో ఉన్నత శిక్షణ యిచ్చే శిబిరాలు, అఖిల భారత వేసంగి శిబిరాలు అన్నింటిలోను ఆఫీసర్లు, కేడెట్లు పాల్గొన్నారు. హిమాలయా పర్వతా రోహణ సంస్థలో యేర్పాటు చేయబడే పర్వతారోహణ తరగతులలో ఈ జాతీయ విద్యార్థి సైనికదళం పాల్గొంటునే వున్నది.

ఆ 'స్కాలర్‌షిప్పులు' వరంగల్లులో వుండే విద్యాశాఖ – ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టరు గారి ఆధీనంలో వుంటాయి. అంటే వారే వీటిని బాలబాలికలకు మంజూరు చేస్తారన్న మాట.

ఏజెన్సీ ప్రాంతాలలో పోలవరంకూడా ఒకటి. ఇదికూడా గోదావరి జిల్లాలోనిదే. పోలవరం ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో చదివే బాలబాలికలకుకూడా కొన్ని స్కాలర్‌షిప్పులు ప్రత్యేకంగా వున్నాయి. కాని, ఇవి అన్ని వర్గాలవారికీ వర్తించవు. కొండజాతులకు చెందిన బాల బాలికలు, లేక ఇతర అణగారిపోయిన వర్గాలకు చెందిన బాలబాలికలు మాత్రమే వీటికిఅర్హులు. కాకినాడలో వుండే విద్యాశాఖ - ప్రాంతీయ డైరక్టరుగారే వీటిని పరిశీలించి, అర్హులైనవారికి ఇస్తూంటారు. ఆరు, ఏడు, ఎనిమిది తరగతుల్లో చదివేవారికి నెలకు నాలుగు రూపాయిలు; తొమ్మిది, పది, పదకొండు తరగతుల్లో చదివేవారికి నెలకు ఎనిమిది రూపాయల వంతున ఇస్తారు. సంవత్సరంలో స్కూలు పనిచేసేది తొమ్మిది నెలలేకాబట్టి, తొమ్మిది నెలలుమాత్రమే యీ స్కాలర్‌షిప్పులను ఇస్తారు.

ఎలిమెంటరీ స్కూళ్ళలో చదివే బాలబాలికలకు కూడా 'స్కాలర్‌షిప్పు'లున్నాయి. విశాఖపట్టణం జిల్లాలో వున్న ఏజెన్సీ ప్రాంతాలలోని ఎలిమెంటరీ స్కూళ్ళలో చదివే బాలబాలికలకు – వారిలో అర్హులైన వారికి మాత్రమే – మరికొన్ని స్కాలర్‌షిప్పులున్నాయి. "అర్హత, అనర్హత" లను ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. ఎలిమెంటరీ స్కూళ్ళలోనే చదువుతూవుండే ప్రాచీన తెగల బాలబాలికలకు కూడా మరికొన్ని స్కాలర్‌షిప్పులున్నాయి. ఈ కులాల్లో కూడా అర్హులైనవారికే యీ సౌకర్యం లభిస్తుంది. చిన్న చిన్న స్కూళ్ళలో చదివే బాలబాలికలకు జీతంఏమీ వుండదు కాబట్టి, సహజంగా వారి చదువుకూడా పెద్ద ఖర్చేమీకాదు. అందుకోసమే వారిలో నిత్యమూ స్కూలుకువెళ్ళాలనే ఉత్సాహాన్ని కలిగించడానికి విద్యపట్ల ఆసక్తిగలిగించడానికి వీటిని ప్రవేశపెట్టారు. అందుకే ఒకటవ తరగతి చదివేవారికి నెలకు ఎనిమిదణాలు; రెండు మూడు తరగతుల్లో చదివేవారికి నెలకు ఒక రూపాయి; నాలుగైదు తరగతులు చదివేవారికి నెలకు రెండేసి రూపాయలు ఇస్తూవుంటారు.

'కోయ'వాళ్ళుకూడా ఒకతెగ అని మనకు తెలిసిందే. ఈ తెగకుచెందిన బాలికలలో విద్యాసక్తి పెంపొందింప చేసేందుకు కొన్ని 'స్కాలర్‌షిప్పు' లున్నాయి. ఒకటి, రెండు, మూడు తరగతుల్లో చదివే పదహారుమందికి నెలకు ఒకరూపాయి వంతున ఇస్తారు.

ఈ ఎలిమెంటరీ పాఠశాలల 'స్కాలర్‌షిప్పులు' కాకినాడలో వుండే, ఏజెన్సీ ప్రాంతాల ప్రత్యేక విద్యాశాఖాధికారి ఇస్తారు. వారి ఆధీనంలోనే మరికొన్ని కూడా వున్నాయి. ఏజెన్సీ స్కూళ్ళలో ఆరు, ఏడు, ఎనిమిది తరగతుల్లో చదివేవారికోసం వీటిని ప్రత్యేకించారు. ఒక్కొక్కరికి నెలకు మూడు రూపాయిలవంతునఇస్తారు. వీటన్నింటినీ సంవత్సరంలో 10 నెలలపాటు ఇస్తారు.

అప్పుడప్పుడూ యే సెలవల్లోనో ఆయా ఏజెన్సీ ప్రాంతాలకు యెవరైనా మన విద్యార్థి బృందాలు, పెద్దలూవెళ్తే ఉత్తమసంస్కృతికి ప్రతిబింబమైన మన వేషభాషలు ప్రవర్తనా చూస్తే బాగా విద్యావంతులమై మనంకూడా యీ విధంగా అభివృద్ధికి రావాలన్న కాంక్ష ఆత్రుత ఉత్సుకత వారిలో పెల్లుబుకుతుంది. అందువల్లనే వారు మన ప్రభుత్వం చేస్తున్న ఆర్థికాది సహాయాలను సద్వినియోగం చేసుకొని ఆరోజుకారోజు అభ్యుదయ పథంలో ముందడుగు వేస్తున్నారు. అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న మనతోటి సోదరులు మనలాగా విజ్ఞాన తేజంతో వెల్లివిరియడం మనకు గర్వకారణంకదూ!



# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

18 మార్చి :— పరిశ్రమల మంత్రి శాసన సభలో తన శాఖకు సంబంధించిన పద్దును ప్రవేశపెట్టారు.

19 మార్చి :— అమ్మకం పన్ను స్వరూపాన్ని గూర్చిన లోకనాధన్ నివేదిక విడుదల చేయబడింది.

22 మార్చి :— అమ్మకం పన్ను చట్టానికి సవరణ బిల్లు గజెటులో ప్రచురించ బడింది. న్యాయ, సమాచార శాఖల మంత్రి జైళ్ళ పద్దును శాసనసభలో ప్రవేశపెట్టారు.

23 మార్చి — సింగరేణి కాలరీలకు చెందిన యెల్లందు డివిజన్‌లో క్రొత్త బొగ్గు గని తెరువబడింది.

జాతీయ రక్షణనిధి సేకరణకై వెల్లూరు జిల్లా విధ్ణయించిన రూ 25 లక్షల లక్ష్యాన్ని అధిగమించింది.

30 మార్చి — రెండు అమ్మకం పన్ను సవరణ బిల్లులు సెలెక్టు కమిటీకి నివేదించబడ్డాయి.

13 ఏప్రిల్ — జాతీయ రక్షణకై పారిశ్రామిక సమీకరణ విషయంలో ప్రభుత్వ పాత్రపై రెండు రోజుల గోష్ఠికి హైద్రాబాదులో ప్రారంభోత్సవం జరిగింది

## భారతదేశంలో

23 మార్చి :— కేంద్ర నీటి పారుదల శాఖా మంత్రి గుల్జారీ కమిషన్ నివేదికపై భారత ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయాన్ని లోకసభలో ప్రకటించారు.

2 ఏప్రిల్ :— భారత యుద్ధ ఖైదీలను విడుదల చేసి, స్వదేశానికి పంపాలని చైనా చేసిన నిర్ణయం ప్రకటించ బడింది.

9 ఏప్రిల్ :— న్యూ ఢిల్లీలో రాష్ట్రాల ఆరోగ్యశాఖా మంత్రుల సమావేశం రెండు రోజుల వరకు జరిగింది.

12 ఏప్రిల్ :— నాగా ప్రాంతంలో తిరుగుబాటు చర్యల్ని అణగద్రొక్కడానికి భారత విమాన దళం విద్రోహుల కీలక స్థావరాలపై విమాన దాడి జరిపింది

18 ఏప్రిల్ :— 1960 డిసెంబరులో నేపాలు రాజు స్వయంగా నిర్వహించిన పరిపాలనా బాధ్యత అంతమైన వెంటనే నేపాల్‌లో అత్యయిక పరిస్థితి ప్రకటించబడింది.

16 ఏప్రిల్ :— కేంద్ర ఆర్థిక మంత్రి రూ 16 కోట్ల మేరకు పన్నులను తగ్గిస్తూ లోకసభలో ప్రకటన చేశారు.

## విదేశాలలో

22 మార్చి — అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ (ఐ డి.ఎ) రైల్వేల అభివృద్ధికిగాను భారతదేశానికి రూ 67 మిలియన్ డాలర్ల అప్పును ఇస్తూ ప్రకటన చేసింది.

భారత దేశంలో మూడు రోజుల వరకు అధికార పర్యటన చేయడానికి లావోస్ రాజు సావాంగ్ వట్టానా న్యూ ఢిల్లీకి వచ్చారు.

1 ఏప్రిల్ :— విదేశాంగ విధానంపై అమెరికా అధ్యక్షుని ఉన్నత సలహాదారుడు శ్రీ వాల్టర్ రోస్టావ్ న్యూఢిల్లీకి వచ్చారు.

లావోస్ విదేశాంగ మంత్రి శ్రీ క్యునిమ్ ఫోల్‌సేనా హత్యగావింపబడ్డారు.

2 ఏప్రిల్ :— భారత రక్షణను పటిష్ఠం చేయడానికి అమెరికా ఇతోధికంగా కృషి చేయాలని అమెరికా అధ్యక్షుడు కాంగ్రెసుకు పంపిన ఒక ప్రత్యేక సందేశంలో అభ్యర్థించారు

అర్జంటైనా సైన్యం ప్రభుత్వాన్ని పడగొట్టి అధికారం హస్తగతం చేసుకుందని దాని నాయకుడు శ్రీ బెంజమిన్ మెనెన్ దెజ్ ప్రకటించారు.

6 ఏప్రిల్ :— ఛెస్టర్‌బౌల్సు భారత దేశానికి అమెరికా రాయబారిగా తిరిగి నియమించబడ్డారు.

9 ఏప్రిల్ :— ఇంగ్లాండు ప్రభుత్వం భారత దేశానికి 3.5 మిలియన్ పౌనుల రుణం ఇవ్వడానికి ఒప్పందం కుదిరింది.

11 ఏప్రిల్ :— 'థ్రెషార్' అను అణుచోదక జలాంతర్గామి పాటవ పరిశీలన చేయడానికి అట్లాంటిక్ మహాసముద్రంలో అట్టడుగునకు పోతున్న సందర్భంలో ఘోర ప్రమాదానికి గురి అయింది.




అయ్యా!

మీరు ప్రచురించిన 'ఆంధ్ర ప్రదేశ్' మార్చి సంచిక మాకుచేరినది. ఒక సంచిక తరువాత ఒక సంచిక సర్వాంగ సుంద రముగా ప్రచురించి అందించుచున్నందుకు మా ధన్యవాదములు తెలుపుచున్నాము. ఏదో ఒక సారస్వతము అందించకపోతారా అనే వుద్దేశముతో చందాదారుగా చేరినాను. మీ ప్రచురణలను మా బార్ అసోషియేషన్ యువక అడ్వొకేట్లు చూచి చాల మెచ్చుకొని చాలామంది చందాదారులుగా చేరవలయుననే వుత్సాహము చూపించినారు. మీ మార్చి ప్రచురణలోని 'ఏరిన ముత్యాలు' చాలా బాగావున్నది. ఆఖరు పద్యము 'బల హీనులయ్యు నేమగు'అను పద్యము అక్షరాలా తటస్థరాజ్యాలకు అన్వయించును. చైనా దురాక్రమణ మూలంగా తటస్థ రాజ్యాలు అన్నీ ఒకటిగా నిలబడి ఇండియాను సమర్థించి సహాయపడగలిగితే యింతకుమించిన బలం కలిగినదే చైనా అయినప్పటికీ జయించ గలము. ఆ ప్రకారం తటస్థరాజ్యాలు మనకు సహాయ సానుభూతులు చూపేలాగున మన ప్రభుత్వము చేయగలదని ఆశిస్తున్నాను.

*కనిగిరి* *చీదెళ్ళ చెంచు బసవయ్య*
*ప్లీడరు గుమాస్తా*

తమరు ప్రచురిస్తున్న 'ఆంధ్ర ప్రదేశ్' గత నవంబరు మాసంనుంచీ చూస్తున్నాను. నా ఆనందానికి అవధులు లేక పోతున్నది'

రాష్ట్రేతరాంధ్రలో ఉంటున్న నాబోటి వానికి 'ఆంధ్ర' సమగ్ర రూపమూ, దిన దినాభివృద్ధి నొందుతున్న రాష్ట్రీయతా, సామాన్య ప్రజానీకానికి, కూడా అవగాహన అయే వ్యాసరాజాలూ, దేశభక్తిని ప్రోత్స హించే కవితలూ, గేయాలూ, కథలూ, నాటికలూ. ఇత్యాదుల్ని అందజేస్తున్న పత్రిక ఎంత ప్రమోదాన్ని కలిగిస్తున్నదో ఎలా విన్నవించ మంటారు?

తరువాత తమరు కొత్తగా ప్రవేశపెట్టిన 'అనువాదభారతి'... ఈ విషయంలో ఒక సంశయ...అనువాదాలు కథానికలకు సంబం ధించినంతవరకూ ఏ విషయాలమీద ఉండాలి? ప్రస్తుత పరిస్థితుల్ని కల్లోల పెడుతున్న విషయాలమీదనే ఉండాలా? లేక సాంఘిక చారిత్రక విషయాలమీదకూడా ఉండవచ్చా? వివరింప కోరిక.

*ఖర్గపురం.* *కు. జానకిరామ్ పట్నాయక్.*

["అనువాదభారతి" శీర్షికక్రింద ప్రచురిత మయ్యే కథానికలుగాని నాటికలుగాని యెటు వంటి విషయాలమీద రచితమైనవైనా స్వీక రింపబడతాయి. అయితే ప్రస్తుత అత్యవసర పరిస్థితిని దృష్టిలోపెట్టుకుని రచించబడే వాటికి ప్రాధాన్య మివ్వబడుతుంది.

—ఎడిటర్]

సాహితీ మధురముగా తాము సంపాదించు చున్న 'ఆంధ్ర ప్రదేశ్' ఆంధ్ర జనతకు పరితోషహేతువుగా నగుచుండుట ముదావహము. రచనలు చక్కని వైవిధ్యం చూపుతూ రచయితలకు వెలుగుదారులు చూపుతూ తాము సహృదయతతో వర్తించు చున్నందులకు సాహితీలోలను లెందరో, ఆనందించుచున్నారు.—

*సామర్లకోట,* *పోచిరాజు శేషగిరిరావు,*
*తెలుగు పండితుడు.*

---

# శంఖారావం

—*ఓలేటి శేషాచార్యులు*

ఏమిటా? హిమవత్ప్రాంత కోలాహ
లము కాదు, కాదది
మనతల్లిగర్భమున జొచ్చిన హాలా
హాలము.

సామ్రాజ్యపు సమరకాంక్ష
పైశాచిక వికటఖేల
గోముఖవ్యాఘ్రమ్ము ॥చౌ॥
భక్షించెను పంచశీల.

పరులస్వేచ్ఛ నపహరించు
పశుప్రాయుడైన నేత
తేనెలొలుకు మాటలతో
గొంతుకోయు పాపనీతి.

ధర్మాధర్మాలోచనకల
భరతజాతిరా మనది
సత్యాహింసాసాధన
ఆశయమ్మురా మనది.

మిత్రద్రోహుల నెయ్యము
కోరుటయే పెద్దతప్పు
ఇంటజొచ్చు శత్రువులను
తరుమకున్న పెద్దముప్పు,

అంతఃకలహములుమాని
కలసిమెలసి కదలిరండు
మాతృదేశ ఋణముదీర్ప
బలికై వెరవక లెండు.

ప్రజాబలము ప్రజ్వరిల్లి
ప్రళయరుద్రులై లేచిన
నల్లమందు భాయీలను
నలిచివేయు టొకలెక్క.

వీర భారతీయ తేజ
వేడిరక్తముప్పొంగగ
అరులగుండె లదిరిపడగ
కడలియట్లు కదలిరండు.

ఢిల్లీసామ్రాజ్యలక్ష్మి
దీవెనలివె అందుకొనుడు
దేశస్వాతంత్ర్యరక్ష
శంఖమ్మును పూరించుడు.

తప్పదు దుష్టులకెప్పుడు
భువిని అపజయమ్ము
తథ్యము నమ్ముడు మనకే
జయము నిశ్చయమ్ము.

# ఉత్తమ నవలిక — ధన్యజీవులు

"ధన్యజీవులు" అనే ఈ నవలను రచించిన శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్ గారు గ్రంథానికి తమ "మనవి"లో "అర్ధ శతాబ్దిలో జరిగిన సామాజిక పరిణామాన్ని ఈ నవలలో చిత్రించడానికి ప్రయత్నించాను. కాని, నా ప్రయత్నంలో నా కెంతవరకు సాఫల్యం సిద్ధించిందో నిర్ణయించ వలసిన బాధ్యత పాఠకులదే'' అన్నారు.

ఈ గ్రంథమును నవలగా గాక నవలికగా నెన్నుట మంచిదని నా యభిప్రాయము. గ్రంథము చిన్నది. కథావస్తువు సంపన్న కుటుంబములకు ఎక్కువగా పరిమిత మయినది. అందును ధన్యజీవుల చరిత్రకే ప్రాధాన్య మెక్కువ. నవలకు పెట్టిన పేరు సార్థకమగుటకు ఇతివృత్త మిట్లుండుటయే సమంజసము.

[ధన్యజీవులు - రచన : శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్, ప్రచురణ : నవీన గ్రంథమాల, విజయవాడ - 2. కృష్ణాజిల్లా; పేజీలు 131 సాధారణ ప్రతి రు. 2-00 మేలుప్రతి రు. 2-75]

అర్థశతాబ్దము కాకపోయినా సుమారు ముప్పది సంవత్సరముల కాలము (1921-49)లో జరిగిన సాంఘిక రాజకీయ పరిణామాన్ని తెలియజేసే సన్నివేశములు ఈ నవలికలో సమయోచితముగా వర్ణింపబడినవి. కథలోని ముఖ్య పాత్రలన్నీ వ్యక్తిగతముగాను వృత్తి ధర్మమును బట్టిన్నీ స్పష్టముగా చిత్రింపబడినవి. సంపన్న కుటుంబము లందలి స్త్రీ పురుషులకు గల గుణ విశిష్టత యథాతథముగా నిరూపిత మయినది. కథలో ఎక్కడనూ అత్తాకోడళ్ళ తగవులాటలు గాని దాయాదులు తరుచుగా చూపించే మోసములూ తగాదాలూ గాని కనబడవు. పల్లెటూళ్ళలో కనబడే ఆచార వ్యవహారాలూ బంధు సౌజన్యమూ అతిథి సత్కారమూ కుశల ప్రశ్నలూ మొదలయిన వన్నీ యథోచితముగా ప్రదర్శింపబడినవి.

*గిడుగు వేంకటసీతాపతి*

స్త్రీల ప్రసంగాలకూ పురుష ప్రసంగాలకూ గల వ్యత్యాసము చక్కగా నిరూపితమయినది. కథాసౌష్ఠవమునకు గాని పాత్ర పోషణమునకు గాని వస్తునిరూపణమునకు గాని సంబంధము లేని అధికప్రసంగాలూ, వర్ణనలూ, సన్నివేశములూ నా కెక్కడా కనబడలేదు.

అక్కడక్కడ సందర్భోచితముగా పాఠకులకు మందహాసము కలిగించు భార్యాభర్తల శృంగార లీలలు, పరియాచకాలు ఎట్లు సుకుమారముగా ప్రదర్శితములయినవో పుటలు 57-59 చదివి చూడవచ్చును. బావమరదుల పరియాచకాలు బాపయ్య రామస్వామిగార్ల (అనగా కథానాయకు డనుకోదగిన తిరుపతయ్య పెద్దతండ్రి మేన మామల) సంభాషణములలో కనబడతవి. పురుషులకుండే తొందర బాటు స్త్రీలకుండ దనుటకు బాపయ్యా రత్తమ్మలకును, రామస్వామి (తల్లి) పిచ్చమ్మ, (భార్య) అచ్చమ్మ లకును జరిగిన సంభాషణములను బట్టి తెలిసికోదగును. ఆ విధముగానే కష్టములు వచ్చినప్పుడు పురుషులకుండే ధైర్యము సహనము స్త్రీలకుండదనుటకు కూడా పెక్కు ఉదాహరణములు ఈ నవలికలో కనబడినవి. మానవులకుండే దౌర్బల్యములు రెండు విధములుగాను నిరూపితములయినవి. రామస్వామి కుమారుడైన అప్పయ్య చరిత్ర బ్రతికిచెడి మరల బ్రతికిన వాని చరిత్రకు దృష్టాంతము. బారిష్టర్ భీమేశ్వర రావుగారి కుమారుడు డాక్టర్ రామ్ ఉచ్ఛదశలో ఉండిన్నీ దుష్టబుద్ధులయిన మిత్రులపొగడ్తల కుబ్బి వారి మూలంగా చెడి అకాలమృత్యువు పాలబడినాడు. అతని చరిత్ర ధన్యజీవుల చరిత్రకు విరుద్ధముగా పరిణమించినది. డాక్టర్ రామ్‌ను పెండ్లియాడిన సీత పెద్దింటి ఆడుబడుచు కావడం చేతను శ్యామలా తిరుపతయ్యల సహవాసం కలుగుట చేతను వైధవ్య దుఃఖమును ఎట్లు సహింపగలిగినదో ఈ నవలా రచయిత్రిగారు కడుచక్కగా నిరూపించినారు. అప్పయ్యను ఈమె వివాహము చేసుకొనే యాలోచనతో కథ

# గ్రంథ సమీక్ష

ముగియుటవలన విషాదాంతము కావలసిన కథ సుఖాంతముగా మారినట్లయినది.

రచయిత్రి ఈ నవలికలో ప్రయోగించిన భాష అన్ని విధములా బాగున్నది. సంభాషణలలో పాత్రోచితమయినది. కథా కథనము చేసే వ్యక్తి రచయిత్రి లేదా రచయిత యెవరైనా వారుకూడా ఒక పాత్రవంటి వారే. అట్లాగే యీ రచయిత్రి తనకుచితమైన ఉత్తమమైన భాషలో కథనము గావించినది. సాహిత్యంలో గ్రంథరచయితగాని రచయిత్రిగాని సంఘంలో శిష్టజనులకు ప్రతినిధి గనుక శిష్టజన వ్యావహారిక భాష ప్రయోగించడమే ఉచితమయినది. అదే ఈ రచయిత్రి చేసిన పని. ఈ నవలికలో ఆయా సమయ సందర్భాలకు అనుగుణములయిన లోకోక్తులు సామెతలు ఉదాహరించడములో ఈ రచయిత్రికి మంచి నేర్పు గలదు. ఉ॥ పుట 11— ఉదయం వచ్చిన వానా సాయంకాలం వచ్చిన చుట్టమూ వెళ్ళకుండా నిలవే ఉంటారు. పుట 59 — కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువట; పుట్టింటి గొప్పలు మేనమామ దగ్గరా? పుట 88. గతికితే అతకదంటారు. పుట 105 'ధనం బుద్ధిశ్చిత్త వికారిణీ' అన్న సామెత మొ॥ "అంతేలే; అంతే లెండి" ఇది ఈమెకు ఊతపదము వంటిది; తరుచుగా ప్రయుక్తము. చూ. పుటలు 10, 65, 83 మొ॥.

ఎత్తిపొడుపు ప్రసంగాలు సమయోచితముగాను సున్నితముగాను ఈమె వ్రాతలలో తొంగిచూస్తూ ఉంటవి.

బ్రిటిష్ పరిపాలనము ఇంకా సాగుతూ ఉన్న కడపటి దినాలలో సంపన్నుల కుటుంబాలలో ఆదర్శ ప్రాయములయిన ఆశయాలు ఎట్లుండెనో ఈనవలికలో కనబడుతున్నవి. తిరుపతయ్య జిల్లా కలెక్టరో పెద్ద లాయరో కావలెనని పెద్దతండ్రి మేనమామల కోరిక. వారి దృష్టిలో బారిస్టరు శ్రీమేశ్వర రావుగారు, కలెక్టరు సింహాచలముగారూ ఆదర్శప్రాయములయిన ఉద్యోగాలు చేస్తూ ఉన్నవారివలె కనబడినారు.

సహాయ నిరాకరణోద్యమము సాగుతూ ఉండిన రోజులలో సింహాచలముగారి చర్యలు అటు ప్రభుత్వానికి ఇటు ప్రజలకూ తృప్తి కలిగించినవి. శ్రీమతి సీతాదేవి చేసిన సేవను ప్రశంసిస్తూ పద్మశ్రీ బిరుదం ఆమెకివ్వడం ఎంతో ఉచితంగా వున్నదని బాల గంగాధర తిలక్ మహిళా సంఘం కార్యదర్శి కుమారి శకుంతల ప్రశంసించడం ఈ నవలికా రచయిత్రి గొప్పగా వర్ణించడము బట్టి ఈమె ఆశయము లెట్లున్నవో తెలిసికోగలము.

ఈ నవలికలో ఉన్న సన్నివేశములూ ప్రసంగములూ వ్యక్తులూ వారి చర్యలూ అన్నీ మనకు సుపరిచితములైనవి గానో మన అనుభవములో ఉన్నవిగానో గోచరిస్తవి. అన్ని విధాలా మానవజీవితానికి సన్నిహితంగా ఉత్తమస్థాయిలో నడచిన ఈ గ్రంథము మెచ్చుకోదగినది; ఈ రచయిత్రి ఇంకా ఇట్టి గ్రంథములు — ఇంతకంటెను మేలయిన గ్రంథములు రచించుటకు తగిన అవకాశము, ఆయురారోగ్య భాగ్యములు ఈమెకు భగవంతుడు చేకూర్చుగాక!

## మరి కొన్ని క్రొత్తపుస్తకాలు

చరిత్రాంశాలకు తగ్గట్టు ఉన్నాయా లేవా? అనే తర్జన భర్జనలు చేయకుండా ఉంటే ఒక్కొక్క సంఘటనతో జీవితపథం ఏ విధంగా మలుపు తిరుగుతుంతో ఇందులోని వేమనకవిజీవితంవల్ల అవగతమవుంది. 'నిజమైన విజయం' అనే కథ చక్కగా ఉంది. ఇతరకథలు ప్రబోధాత్మకంగా ఉన్నాయి.

కథలు-గేయాలు; రచయిత... పురాణపండ కామేశ్వరరావు, పేజీలు..50; వెల..1-25 నయాపైసలు ప్రతులకు...పురాణపండ చిత్రం విక్రమహాలు రాజమండ్రి, తూర్పు గోదావరి జిల్లా.

ఇందులోని గేయాలు కూడా ప్రబోధకంగానూ లయానుగతంగానూ ఉన్నాయి.

బాలలకు ఉపకరించే నీతి కథలను ఇంత పిన్నవయస్సులో రచించినందుకు రచయితకు అభినందనలు.

చైనా ముష్కరులు, మంచు కొండల్లో ఇంకా పొంచి వున్నారు. ఏ మాత్రం ఏమరుపాటు వహించినా మన మాతృదేశం అవమానానికి గురిఅయ్యే ప్రమాదం ఉంది. చైనా రక్కసులు మన సరిహద్దుల్లో తమ సైన్యాన్ని నానాటికీ పెంచుతూనే ఉన్నారు. యీ విషయాలన్నీ మనం రోజూ వార్తా

> టి. యల్. ప్రకాశరావు

పత్రికల్లో చదువుతూనే ఉన్నాం. అయినా మనలో కొందరు మనస్పర్థలు కలిగించి యువను బలహీనులుగా చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఏ వేవో సమస్యలతో భారత దేశాన్ని యుద్ధ ప్రయత్నంనుంచి మళ్ళిస్తే తిరిగి చైనా తనపబ్బం గడుపుకునేందుకు రావచ్చు.

దేశ ప్రజలలో నిరంతరం ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని కలిగించడానికి రచయితలు ఎల్లవేళలా ప్రయత్నించాలి. ఇందుకై ఎన్ని పుస్తకాలు వెలువడినా ఆహ్వానించాల్సిందే.

ఇంతవరకూ మనను కాపాడుతూ వచ్చిన హిమాలయాలను ఇప్పుడు మనమే వాటిని రక్షించాల్సిన అవసరం ఏర్పడిందని, తుది విజయం—మనది నిజంలో ప్రసిద్ధరచయిత... కాకోజి నారాయణరావు శంఖం పూరించారు.

ప్రతులకు : కాళోజీ నారాయణరావు హన్మకొండ, వరంగల్.

యీ గేయాలు రాగతాళ లయయుక్తంగా ఉన్నాయి. ఇవి యువకులరక్తాన్ని ఉప్పొంగింప జేస్తాయి.

ఈ పుస్తకాన్ని, అమ్మకానికి మాత్రం కాకుండా ఎవరైనా ఏరూపంగానైనా వాడుకోవచ్చని ప్రచురణకర్తలు వెల్లడించారు.

స్వీకారం :

వీరశంఖము : - (గీతాలు) రచయిత : వీరుభొట్ల సూర్యనారాయణ వెల...0-50 ప్రాప్తిస్థానం : కవిపేర శ్రీ సత్యసాయి కవితానిలయం, తాడేపల్లిగూడెం, పశ్చిమగోదావరి జిల్లా.

చైనా దురాక్రమణ (గొల్ల కథ) రచన... సి. హెచ్. రాజలింగం. వెల 20 నయాపైసలు. ప్రతులకు : సి. హెచ్. రాజలింగం, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా, కరీంనగర్ జిల్లా రచయితలసంఘం అధ్వర్యాన యీ పుస్తకాన్ని వెలువరింప జేశారు.

విజయవిహారం .... (నాటకం) రచయిత. శ్రీ దామరాజు పుండరీకాక్షుడు. వెల....రు 1-00; ప్రాప్తిస్థానం ... స్వరాజ్య సోపాననిలయం, గుంటూరు-2.

దేశంకోసం సందేశం. (నాటిక) రచయిత:ఎం.రంగకృష్ణమాచార్యులు B.O.L. వెల రూపాయి; ప్రాప్తిస్థానం....శ్రీ రంగనాథ సరస్వతీసదనం అందోలు, మెదకు జిల్లా.



# రచయితలు

కవిరత్న శ్రీ సున్నం వీరరాజు, కవితాసమితి, విశాఖపట్నం.

శ్రీ యస్. ఆర్. టికేకర్.

శ్రీ కుంటిమద్ది శేషశర్మ, తెనుగుపండితుడు. ధర్మవరం, అనంతపురం జిల్లా.

శ్రీ అట్లూరి మధుసూదనరావు, ధన్‌విల్లా, తిలక్ రోడ్, హైదరాబాద్.

శ్రీ టి. యన్. సి. వెంకటవరదాచార్యులు. 19/ వసంతపేట, ప్రొద్దుటూరు, కడపజిల్లా.

శ్రీ యస్. బి. చౌదరి, తెనాలి.

శ్రీ విస్సా అప్పారావు, గుంటూరు.

శ్రీ "సుధాకర్ భట్"

శ్రీ పాతూరి ప్రసన్న ఆంజనేయులు, బి. ఎ., పి. డబ్ల్యు. డి. ఆఫీసు, తాండూరు.

శ్రీ దుష్యంత్ సింగ్

శ్రీ భాషాప్రవీణ యస్. టి. పి. ఆర్. రామానుజాచార్యులు, నూజివీడు.

శ్రీ యస్. వి. సత్యనారాయణమూర్తి. యం. యస్. 33, మలక్ పేట, హైద్రాబాద్.

శ్రీమతి ఆవుల జయప్రదాదేవి C/o ఆవుల సాంబశివరావు, హిమాయత్‌నగర్, హైద్రాబాద్.

బి. సరోజ C/o శ్రీమతి జి. మహాలక్ష్మి, యం. యల్. ఎ. అంతర్వేదిపాలెం, తూర్పుగోదావరిజిల్లా.

శ్రీ వాసిరాజు ప్రకాశం, చిక్కడపల్లి, హైద్రాబాదు.

శ్రీ బి. వి. నరసింహారావు, B. A., B. ED. పవర్ పేట, ఏలూరు, ప. గో. జిల్లా.

శ్రీ వేజండ్ల సాంబశివరావు, ఉపాధ్యాయులు, చినమట్లపూడి, పెదమట్లపూడి P. O., రేపల్లె తాలూకా, చందోలు (వయా)

శ్రీ వి. శేషాచారి, ఉపాధ్యాయులు, మానేరు, వరంగల్‌జిల్లా.

శ్రీ వి. వి. యల్. నరసింహారావు, యం. ఎ. ఆంధ్ర ప్రధానోపన్యాసకులు, గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల, రాజమండ్రి.

శ్రీ అమరవాది వెంకటశాస్త్రి, సెక్రటేరియట్, హైద్రాబాద్.

శ్రీ కె. వి. భాస్కరరావు, పి. ఆర్. ఒ. సమాచార పౌర సంబంధములశాఖ, హైదరాబాద్.

గ్రంథ సమీక్ష

శ్రీ గిడుగు వేంకటసీతాపతి, C/o దక్షిణభారత హిందీప్రచారసభ, ఖైరతాబాదు-హైదరాబాద్.

శ్రీ టి. యల్. ప్రకాశరావు, సుల్తాన్ బజార్, హైద్రాబాద్.

# ప్రకటన

వైద్యసంస్థలలో తాత్కాలిక అసిస్టెంటు సర్జనుల నియామకానికై, 62 ఏండ్ల వయస్సుకు లోబడి వున్న ప్రయివేటు మెడికల్ ప్రాక్టీషనర్లవద్ద నుంచి దరఖాస్తులు కోరబడుతున్నవి. అత్యవసర నియమావళి క్రింద ఈ నియామకాలు జరుగుతాయి. నియామకపు షరతులు దిగువ పేర్కొన బడ్డాయి :—

1. కేవలం తాత్కాలిక ప్రాతిపదికపై నియామకం జరుగుతుంది.
2. నెల 1కి రూ. 325/—ల ( మూడువందల ఇరవైయైదు రూపాయల ) ఫిక్సెడ్ వేతనంపై నియామకం జరుగుతుంది. ఇంక్రిమెంట్లు వుండవు.
3. బదిలీకాని. పద్ధతిపైన వారు నియమించబడుతారు.

క్రింద పేర్కొన్న ఫారంలో వారు హైద్రాబాదు-దక్కన్ సుల్తాన్‌బజారులోని ఆంధ్రప్రదేశ్ మెడికల్ సర్వీసెస్ డైరెక్టర్‌కు దరఖాస్తులు పంపాలని కోరబడుతున్నారు.

## ఆంధ్రప్రదేశ్ మెడికల్ సర్వీస్ రిక్రూట్మెంట్‌కు దరఖాస్తు

పదవి : తాత్కాలిక అసిస్టెంటు సర్జను,

1. దరఖాస్తుదారుని పూర్తిపేరు; తండ్రిపేరు (విడి అక్షరాలలో)
2. పూర్తి చిరునామా.
3. (అ) పుట్టిన తేదీ (డాక్యుమెంటరీ సాక్ష్యాధారలతోసహా)
   (ఆ) జన్మస్థానం, జిల్లా.
   (ఇ) వివాహితులా లేక ఒంటరివారా.
   (ఈ) దరఖాస్తుదారుడు.
   (1) వెనుకబడ్డతరగతికి (2) షెడ్యూల్డ్ కులానికి (3) షెడ్యూల్డ్ జాతికి చెందినవారా.
4. విద్యార్హతలు, ఉత్తీర్ణతపొందిన శ్రేణితో సహా అర్హత సంపాదించిన విశ్వవిద్యాలయం లేక సంస్థ పేరు.
5. వైద్య అర్హతలు సంపాదించిన తేదీ, రిజిస్టరు నెంబరు.
6. హౌస్ సర్జెన్సీ చేసినకాలం, తేదీలతోసహా
7. ఇదివరకు సర్వీసు లేక అనుభవం వున్నట్లయితే వాటి వివరాలు.
8. ఇతర రిమార్కులు, ఏవైనావుంటే.
9. దరఖాస్తుదారుని సంతకం

   తేదీ.

గమనిక : దరఖాస్తులతో దిగువ పేర్కొన్న సర్టిఫికెట్లను జతపరచాలి.

(1) హౌస్ సర్జెన్సీ చేసినవారి విషయంలో హౌస్ సర్జెన్సీ సర్టిఫికెటు (ధ్రువపరచబడిన ప్రతి).

(2) సివిల్ సర్జన్ హోదాకు తక్కువకాని అధికారి వద్దనుంచి దేహదార్ఢ్యాన్ని గురించిన సర్టిఫికెటు.

సం. డా. ఎ. టి. యం. అబ్దుల్ ఖాదర్
మెడికల్ సర్వీసెస్ డైరెక్టర్, తరపున
ఆంధ్రప్రదేశ్, హైద్రాబాదు – దక్కన్.

# ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం

# సాంకేతిక విద్యాశాఖ, హైద్రాబాదు.

హైద్రాబాదులోని ప్రభుత్వ సంగీత కళాశాలలో తబలా లెక్చరర్ ఉద్యోగానికై దరఖాస్తులు గోరబడుతున్నవి. హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరుకు 1963 మే 15 వ తేదీలోపు అందునట్లుగా దరఖాస్తులను పంపాలి. జీతం స్కేలు రూ. 180–7½–210–10–300–15–375.

*నిర్ణీత విద్యా యోగ్యతలు :*

1. (1) గుర్తింపబడిన విశ్వవిద్యాలయపు సంబంధిత విభాగంలో సంగీత డిగ్రీ,

లేక

2. (1) యస్. యస్. యల్. సి. వరకుగానీ లేక దానితో సమానమైన ఇతర స్థాయివరకుగానీ చదివి వుండాలి.

(2) (అ) సంబంధిత సబ్జక్టులో సుప్రసిద్ధ ఉపాధ్యాయునివద్ద సరియైన శిక్షణ పొందివుండాలి. లేదా ప్రసిద్ధి పొందిన సంగీత సంస్థ నుంచి సంబంధిత సబ్జక్టులో సంగీతంలో డిప్లొమా పొంది వుండాలి. అభ్యర్థులకు కనీసం రెండేండ్ల బోధనానుభవంకూడా వుండాలి.

లేక

(ఆ) ప్రభుత్వ సాంకేతిక పరీక్షలలో హైయ్యర్ గ్రేడు ప్యాసు అయివుండాలి. అంతేగాక కనీసం నాలుగేండ్ల బోధనానుభవంకూడా వుండాలి.

*వయస్సుకు సంబంధించిన యోగ్యతలు :*

1. అభ్యర్థి వయస్సు 1963 జూలై 1 వ తేదీనాటికి 45 ఏండ్లకు మించి వుండకూడదు.
2. హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయంనుంచి అది పనిచేయు రోజులలో ఉదయం 10½ గంటలనుంచి సాయంత్రం 5 గంటలమధ్య ఎప్పుడైనా నిర్ణీత దరఖాస్తు ఫారాలను పొందవచ్చు.
3. అభ్యర్థులు తమ సొంత ఖర్చుపైన రాష్ట్రంలో ఏ చోటనైనా జరిగే ఇంటర్వ్యూకూ, డెమాన్‌స్ట్రేషన్ పరీక్షలకూ హాజరు కావాలి.
4. ఇదివరికే ఉద్యోగం చేస్తున్నవారు సంబంధించిన అధికారుల ద్వారా దరఖాస్తులు పంపాలి.
5. ఈ నియామకం తాత్కాలిక ప్రాతిపదికపై జరుగుతుంది. ఈ అడ్వర్టయిజుమెంటును పురస్కరించుకొని దరఖాస్తు పెట్టుకొని ఎన్నుకోబడి, ఉద్యోగంలో నియమించబడు అభ్యర్థి ఆ తరువాతజరిగే రెగ్యులర్ నియామకం కొరకు ఇతరులతోపాటు వేచి వుండాల్సి వుంటుంది.

డైరెక్టరు, సాంకేతిక విద్యాశాఖ,
*ఆంధ్రప్రదేశ్, హైద్రాబాదు.*

మన దేశ
స్వాతంత్ర్య పరిరక్షణకై

# ధన
# కనక
# వస్త్ర
# రక్త

రూపాలలో భూరి విరాళాలిచ్చి
మీ కర్తవ్యాన్ని
మీరు నెరవేర్చారా?

# ఆంధ్రప్రదేశ్

| | |
|---|---|
| విస్తీర్ణం ... | 1,05,858 చదరపు మైళ్లు. |
| జిల్లాలు ... | 20 |
| తాలూకాలు ... | 189 |
| 20 వేలు, అంతకుమించిన జనాభాగల పట్టణాలు, నగరాలు ... | 223 |
| గ్రామాలు ... | 26.997 |
| పూర్తి జనాభా (1961) ... | 359.78 లక్షలు |
| జన సాంద్రత ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) ... | 74.90 లక్షలు |
| నికర సాగుభూమి (1959-60) ... | 10,889,000 హెక్టర్లు |
| పశువులు (1961) ... | 327 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1959) ... | 4083 |
| విద్యుదుత్పాదన (1961) ... | 1,026.072 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1961-62) ... | 4084 |
| విశ్వవిద్యాలయాలు ... | 3 |
| కళాశాలలు (1960-61) ... | 119 |
| ఉన్నత పాఠశాలలు (1960-61) ... | 1224 |
| వృత్తివిద్యా పాఠశాలలు ... | 431 |
| పంచాయతీలు (1959-60) ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (1-4-1962 నాటికి) ... | 378 |
| 1960-61 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా ... | రూ. 1007.51 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు ... | 61 |
| శాసన సభ సభ్యులు ... | 301 |
| శాసన మండలి సభ్యులు ... | 90 |

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad - 1.

1963 ఏప్రిల్ 2 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవంచేసిన నల్లగొండలోని లిటిల్ ఫ్లవర్ స్కూల్ భవనం.

1963 ఏప్రిల్ 11 వ తేదీన హైద్రాబాదులో హోంగార్డ్స
దళానికి ప్రారంభోత్సవం జరిగిన సందర్భంలో
హోంగార్డ్ విధులను ప్రదర్శిస్తున్న దృశ్యం.



